ఓం

# శ్రీహనుమద్భగవద్గీత






రచయిత:
అవధాని, కవిశేఖర
అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజి

శ్లో॥ పరిత్రాణాయ సాధూనామ్

# శ్రీ హనుమద్భగవద్గీత

ఇది

శ్రీమ ద్గర్తపుర మండలాంతర రేపలీ పెరవలీ గురుజాలాది
నగరమాండలిక సంఘస్థిత ఉన్నత పాఠశాలావళీ
పండితుండు, అచ్చాంధ్రి నిరోష్ఠ్య నిర్గద్య
దాశరథిచరిత్రా ద్యనేక గ్రంథకర్తయు
నగు

అవధాని, కవిశేఖర

**అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిచే**

రచియింపఁబడి

గ్రంథాలయ — ప్రకృతి — ఉద్యమములయొక్కయు



దివ్యజ్ఞాన సమాజముయొక్కయు సేవకులగు

శ్రీయుత

**అయ్యంకి వేంకటరమణయ్యపంతులవారి**

ద్రవ్యసహాయమున

ముద్రింపబడియె

వినాశాయ చ దుష్కృతామ్

సంభవామి యుగే యుగే



ధర్మసంస్థాపనార్థాయ

శ్రీ భాష్యాయ నమః.

# శ్రీ హనుమద్భగవద్గీతా ప్రశంస



బ్రహ్మశ్రీ అబ్బరాజు హనుమంతరాయ కవిశేఖరుఁడు నన్నొక యుపోద్ఘాతము తన హనుమద్భగవద్గీతకు వ్రాయుమని కోరెను. అది నా కలవిగాని దయ్యును వారి మైత్రియు, నభ్యర్థనము నన్ను నిరుత్తరునిఁజేసి, నాచేత నీ వ్రాఁత వ్రాయించినవి.

భగవద్గీతలకుఁ దెలుంగు టీకలనే వెలసినవి. భాష్యత్రయమునందు గీతాభాష్యము మిక్కిలి కష్టమని యనుభవరసికు లందురు. సోమయాజి గీతలను వ్రాయని కారణము పలువురు పలువిధములఁ జెప్పుదురు. చేతఁగాక వ్రాయలేదన రాదు. శాంత్యనుశాసనికము లందు నశ్వమేధంబునందు దత్త్వమును రచించుపట్ల తిక్కన తన యసమాన ప్రౌఢిఁ జూపెను.

భారతమునం దేయే భాగంబులకుఁ దెలుంగు వ్రాయుట తిక్కన మానెనో యా యా భాగంబులకు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు మున్నె వ్యాఖ్యానము రచించియుంచిరి. భగవద్గీత, సనత్సుజాతీయము, విష్ణుసహస్రనామము నను నీ త్రితయమునకు నాచార్యులవారు మహత్తర మగు

భాష్యము రచించినారు. ఈ మూడింటికి భాషావివరములు వ్రాయరా దని వ్యాసులవారి యభిప్రాయ మైనట్టు లొక్క యైతిహ్యము కలదు. తిక్కన సోమయాజి తన భారతము వ్యాసప్రోక్తము చేయించుకొనుటకు వారణాసిపురంబునకుం జని యట వేదవ్యాసుల దర్శించె ననియు, వారు "అదేమి చేసితి వదేమి చేసితి వదేమి చేసితి"వని యడిగినట్లును, సోమయాజి భక్తితో నమస్కరించి "అది యట్లే యుంచితి నది యట్లే యుంచితి నది యట్లే యుంచితి" ననె ననియు, నంతట వ్యాసుండు 'మంచి పని చేసితివి. నీ గ్రంథము ప్రపంచమున విఖ్యాతిం జెందు'నని వచించినట్లును బెద్దలు చెప్పుదురు.

దీనిని మానుట కేమి కారణమో తెలియ లేదు. మంత్రమగుటచే నది దెలుఁగున నుండరా దని కొంద ఱందురు.

ఏది యెట్లున్నను భగవద్గీతఁ దెనుంగు సేఁతలో నొక కష్ట మున్నది. మూలములోని పదములే వాడినచోఁ గొన్ని యెడల వివరించుట ఘటింపఁదగు. ద్వైతా ద్వైత విశిష్టా ద్వైతమతములవారు వారి వారికిం దగురీతి వ్యాఖ్యానించు కొందురు. ఆ యా మతములవారు దెనుఁగు వ్రాయునపుడు దమ సిద్ధాంతమున కనుకూల మగు సంస్కృత వ్యాఖ్యాన భాష మును దెనుఁగుపద్దెమున వ్రాయుదురు. అది పక్షపాత మగును. వ్యాఖ్యానమును వ్రాయఁదలచినచో నొక వ్యాఖ్యాత యభిప్రాయమే యొసఁగినవాఁడగును. దానికిం దగిన తెనుఁగుమాటయే యనువాదకుఁడు వాడుటచే వ్యాఖ్యానాంతరముల కవకాశము

లేక పోవును. అనేకవ్యాఖ్యానములు సూచింపఁదలఁచు వా రనేకపద్యము లొక శ్లోకమున వ్రాయవలసిన వారగు చున్నారు. కొంద ఱా మార్గ మవలంబించిరి, కాని వార కిచ్చ వచ్చిన పద్యముల కే యట్లు వ్రాసిరి. కాని యన్నిటికి నట్లు వ్రాయుట యసాధ్యము.

ప్రాయికముగా ననువాదకు లందఱ కీ కష్ట మున్న దియే. పోతనయు శ్రీధరీయవ్యాఖ్య ననుసరించియున్నాఁడు. గోపీ నాథము వేంకటకవియుఁ గొన్ని యెడల వ్యాఖ్యాము నను సరించి యొక్క శ్లోకార్థమును బెక్కుపద్యములుగా రచించెను.

పై లక్షణము లనువాదకులకు, నందు గీతానువాదకు లందఱకు సమానమె యగును. ఈ కవిశేఖరున కే కాక యనేక మం దిప్పనికిఁ గడంగినవారి కీ చిక్కులు కలిగినవి. పాఠకులకుఁ గూడ విమర్శగాఁ జదివెడు వారి కీ చిక్కుతప్పదు. సామాన్య ముగాఁ బోవువారికి గీతామృతరస మనువాదమున నాస్వాద్య మయి యుండును. ఆపాతరమణీయం బగు హనుమంతరాయుని గీతములు శ్రావ్యములు.

ఇఁకఁ దెనుంగుసేత యసంప్రదాయ మనుటలోఁ గూడ ముందెందఱో గీతల కనువాదము వ్రాసియుండుటచేఁ దొల్లింటి వారి కే సమాధానమో, మనకవికి నదియే యగుటచే "నలుగు రితో పాటు నారాయణ" యన్నట్లయినది.

శ్రీకృష్ణభారతకర్తలు శ్రీకృష్ణత్వము వహించి కృష్ణతత్త్వ మగు భగవద్గీతను తమ సమగ్రభారతముతో పాటుగాఁ దెనిఁగించిరి.

పాపయ్యశ్రేష్ఠిగారు తాము శ్రేష్ఠులగుట గీత ననువదించిరి. శ్రేష్ఠు లెది యొనరించిన నితరు లది యొనర్తు రను న్యాయమున మఱి కొందఱు తెనిఁగించిరి.

స్వయముగాఁ దాము పార్థసారథులగుటచేఁ బార్థసారథి నాయనింగారు భగవద్గీత ననువదించిరి. ఇట్లే యెందఱో పెద్దలు తమకు భగవద్గీతయం దుండు భక్తి తాత్పర్యంబులు లోకంబున కెక్కఁగా ననువదించిరి.

ప్రకృతము కవిశేఖరు లగు హనుమంతరాయలకు హనుమద్భగవద్గీత యొనర్చుటకు "అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభిః" అను న్యాయ మాధారమయినది. పూతం బగు నేతద్గీతాశాస్త్రము రచించిన కవిపరంపర తమ యారంభమునకు ముందే యేర్పడుటయే హనుమద్భగవద్గీతావతరణంబునకుఁ గొంత సౌలభ్య మేర్పడియెను.

గీతాచార్యులు గీత లుపదేశించినపుడే తాను జెండాపై నుండి విన్నవాఁడు హనుమంతుఁడు. అట్టివాఁడు కవిశేఖరుండై నేఁడు భగవద్గీత లాంధ్రంబున ననువదించుటచే, నీహనుమద్భగవద్గీతాప్రాశస్త్యము వేఱుగాఁ గొనియాడవలెనా ? అదిగాక మన కవిశేఖరుని తండ్రి మాఘమాహాత్మ్య కృతికర్త. వీరి

కుమారుండును పార్వతీపరిణయ కృతికర్తయై యశఃకాయుం డయ్యె. వీ రుభయభాషా భూషితం బగు నాంధ్రప్రబంధం బులు పెక్కు రచించి పేరు గాంచిరి. అచ్చ తెనుంగు పొత్తం బొకండు నొడివి యొరులు పడయరాని పెంపుంగాంచిరి. ఆంధ్ర దేశంబున నియోగి బ్రాహ్మణశాఖలో లుత్తమైన వైదికంబు నుద్ధరించి యొక పద్ధతిగా నియమ పూర్వక వేదాధ్యయనము, అగ్న్యుపాసనము పునఃప్రతిష్ఠ గావించి శకకర్తలైన శ్రీనంది రాజులక్ష్మీనారాయణ దీక్షిత చరిత్రను రచించి ప్రసిద్ధింగాంచిరి.

స్వయముగా సాధుస్వభావము కలవారు, సదాచార సంపన్నులు, పాకయాజులు, మృదుమధుర మగు ధారాశుద్ధిగల హనుమంతరాయ కవిశేఖరులచే రచింపఁబడిన యీ భగ వద్గీత జగంబున జిజ్ఞాసువుల కుపకరించునని యాశించుచున్నాను.

ఇది యనుభవశాస్త్ర మగుటచే సంప్రదాయముగాం దజ్ఞులగు పెద్దలవలన నుపదేశమునుబొంది గ్రంథారంభ మొనర్చు వారలకు సుబోధంబు కలుగును. స్వయముగానే చూచు కొనువారలకు సుబోధ కలుగుట కష్టము. సామాన్యముగా భగవద్గీతలలోని విషయమును దెలిసికొనుట కనువాదము లేర్ప డును. సవిశేషజ్ఞాన మెప్పటికైన "తద్విద్ధి ప్రణిపాతేన పరి ప్రశ్నేన సేవయా" యన్నట్లుగా గురూపాసనచే లభింపఁ దగినదియె. ఇది పూర్ణానుభూతికిఁ జెప్పినమాట.

అనువాదములైనను సభక్తికముగాఁజదివినచో నపూర్వ మునోసంగఁగలవనియె పెద్దల నిర్ణయము. కావున గీతాధ్యయన

మొనరించు. వారల కీ గ్రంథము ప్రథమమునఁబఠింపఁదగినదిగాఁ దిలింగ దేశమునందు ప్రసిద్ధి వహించుఁగాక.

ఈ గ్రంథమును మా మిత్రులు మహారాజశ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు కృతిగా గ్రహించుట మాకు సంతోషదాయకము. వేంకటరమణయ్యపంతులుగారు స్వార్థత్యాగులు, దేశాభిమానులు, గ్రంథాలయ స్థాపకులు, పారమార్థికులు. అట్టివారు శ్రీ భగవద్గీతలయందు భక్తి తాత్పర్యములు కలిగితగు కవిశేఖరునిచేనాంధ్రీకరింపఁజేసి యా గ్రంథమును తన కంకితంబుగా నొనర్చుకొనుట యెంతయుసంతసింపఁదగినది.

కుమారుని పాణిగ్రహణ మహోత్సవములో తండ్రి కావ్యకన్యాపరిగ్రహణ మహోత్సవము రసికజన హృదయ రంజకము. కవులకు ప్రోత్సాహము తగ్గిన యిట్టి కాలములో సంపన్న గృహస్థులు మా అయ్యంకి వేంకటరమణయ్యగారి మార్గమవలంబించి కృతికాంతాపరిగ్రహణ మొనర్చుచు దానఁ గీర్తి కాంతాసమాశ్లేషమునుం బడయుదురు గాక.

ఓమితి శివమ్.

శ్రీ తిరుమల శ్రీనివాస
త్రిలింగ విద్యాపీఠము
విక్రమ వైశాఖ బ. ౨.
గురువాసరము.

ఇట్లు,
అధిపతి - వైద్యరాజ, కవిరాజ,
దంటు సుబ్బావధాని.

# శ్రీ బా ల గో పా లా ష్ట కం

శ్రీనాయకం సకలభూనాయకం విజయభూనాయకార్చితపదం
నానామునీంద్రహృదయానందదాయకశుభానంతమూర్తికలితం
గానావశీకృత కులీనార్త వల్లవ వధూనవ్యచిత్తకమలం
జ్ఞానప్రకాశిత మహానందనందన మహీనాత్మకం హృది భజే.

గోపాలకం స్వగరుధూపాలకం జనకభూపాలకాభివినుతం
గోపాలక ప్రముఖ గోపాలకాళి వినుతాపాదమస్తక మజం
పాపాలవాల జగతీపాలకానన మహాపావకం మునిహితం
గోపాల బాలక చమూపాలకం ప్రణుత గోపాలకం హృదిభజే.

బాలం హిమాంశు సమఫాలం కలాన్వితకపోలం రసాలఫలవా
గ్జాలం బలాదినుతశీలం లసత్కనకచేలం విశాలనయనం
నీలం ఖలావళివిఫాలం రమాహృదయలోలం సురారిజనతా
భీలం ప్రశస్త గుణజాలం గళస్థవనమాలం సదా హృది భజే.

రామం వికుంఠపురరామం శిరీషసుమదామం సుధాబ్ధితనయా
రామం శ్రితాంబునిధిసోమం శివాభినుత నామానమార్యవరదం
శ్యామం నిశాచర విభీమం జగద్భరణకామం శమాదిసుభగ
స్తోమం స్వభక్తజనధీమందిరం ప్రణుతసామం సదా హృదిభజే.

నందాత్మజం దివిజ బృందార్చితం దనుజ బృందాత్మ భీతికరణం
బృందావనస్థపశుబృందావనం నరకబృందారకారిహరణం
మందారకుందశరబృందారవింద శశిసౌందర్య మందిర యశ
స్సందోహగేహభువనం దాసచిత్త కమలేందిందిరం హృదిభజే.

కాళీయమౌళిమణిపాళీ లసత్కిరణ పాళీసుశోభితపదం
నాళీకజాది దివిజాళీ స్తవార్హ గుణపాళీ మనోజ్ఞ మమలం
కాళీకపాలి వినుతాలఘపాద నిజకేళీ పరిపూర్ణభువనం
నాళీకజాహృదయ నాళీకభాస్కర మఘాళీహరం హృది భజే.

వారాణశీవిభుకృపారాశిపోషితకుమారానుమోదహృదయమ్
ధారాధరోపమశరీరం ఫణీశమణివారాంశుధార్యశయసమ్
స్వారాట్ప్రమోద సకలారాతిదైత్య మదహారాదికార్యకరణమ్
నారాయణీ రమణ పారాయణార్హతరసారాభిధం హృది భజే.

వందేముకుందమరవిందాలయాహృదరవిందాలయార్క మనఘమ్
వందే మునీంద్రికర సందోహపూజితపదం దానవాంతక మజమ్
వందేమురాంతకమనిందార్హనీయగుణబృందోజ్జ్వలంయదువరమ్
వందేమహేంద్రముఖబృందారకాభినుతకుందోపమానయశసమ్

కృతికర్త.

# పుష్పమాలికా బంధము



చెలువలు వేలు కల్మిచెలి • చెల్వు చెలంగఁ గరంగ సంగతిం
గలువులు జాలువారు గతిఁ • గమ్మగ నెమ్మి గడుం గడంగఁగా
గులుకులుదేలు పాట కుసి • కుట్టి కులాసగ రాగ వేఁగతోఁ
బలుకులు మేలు తేనె పసఁపట్టు పసందులు గ్రాలు బాలుఁడా !

# మ హా ర థ బం ధ ము.

శ్రీ రమణీయ సంత్కృతిభావ్య! శీతోష్ణ
భాను మోహనవీక్ష! పర్వతేళ!
రత్యనుచరహార! రజనీధవస్థాన
మకుటాగ్ర! బ్రహ్మణ్య! మాబలాఢ్య!
హృత్కమల బ్రహ్మ! ధృతిమంధర! విధిస్తు
తా! వేంకటేళ! ముంక్తాప్రకాళ!
కామారి! మఙ్గళంకరగుణ! సకలేంద్రి
యాధార! సంకటంహార! కృతిప!

పణ్డిత జనానుకారి సంద్భక్తచారిఁ
గృతివధూధారి శేషాంబ హృద్విహారి
వేంకటరమణశౌరి విం వేకసూరిఁ
గల్మలంగూర్చి ప్రోవుమా కరుణఁదేర్చి.

# ఛత్రబంధము



వీర ! జలజజవిదిత ! హిమ
పారసరసహాసభాస ! • సరతా ! రాధా
ధారా ! తారవరాభీ
భీరావర ! సామహిత ! ది•విజజలజరవీ !

బ్రహ్మశ్రీ అవధాని, కవిశేఖర అబ్బరాజు హనుమంతరాయ
శర్మగారికి ది 11—4—40 తేదిన అమృత భాండారములో
రు 116-0-0 లు ఇచ్చి పండిత సన్మానము
చేయబడిన సందర్భమునందు
అధ్యక్షురాలు శ్రీమతి కవితిలక, కవితావిశారద, విద్వాన్
కాంచనపల్లి కనకాంబగారు రచించిన

# పద్యములు.

క. వర విజయవాడ హనుమం, తరాయ కవిశేఖరునకు ♦ నల్వురిలోఁ బె
  ద్దరికంబు నిచ్చి మెచ్చుట, సరసులకున్ సజ్జనులకు ♦ సంతోష మగున్.

క. దీక్షిత శిష్యుఁడు దీక్షితుఁ; డక్షరకుశలుండు పాక ♦ యాజి కవిసుతుం
  డక్షీణపద్యరచనా, దక్షుం డీ సుజను బుధులఁ ♦ దక్షిఁ బొగడఁదగున్.

క. కవి లక్షణంబు లివి కా, కవిలక్షణములని దెలియ ♦ గల విబుధులకే
  సువిదితము కవులభేదము, భువి నిరతము పక్షపాత ♦ మునఁ దెలియుదురే.

క. నవరసములు కవినోటన్, బ్రవిమల మోదం బొసంగు ♦ రసికుల కెల్లన్
  భువి ఖేదమోదదము లవి, అవురా! కవిసృష్టి బ్రహ్మ ♦ కైన దెలియునే.

ఆ. చదివి చదివి యగును ♦ సర్వజ్ఞుఁడొక్కఁడు
  చదువకయె యెఱుంగు ♦ సకల మొకఁడు
  చదువు జపములేక ♦ వదనంబు దెరచెను
  కవులు కవులె? దాన ♦ గవులు గవులె.

గీ. కవులు శపియింప దీవింప ♦ గలిగినారు
  కవులు శాసింప శిక్షింప ♦ గలిగినారు
  కవులు వర్ణింప రంజింపఁ ♦ గలిగినారు
  ధీర కవివరుల్ తారకుల్ ♦ గారె ప్రజకు.

గీ. పుణ్యమును పురుషార్థంబు ♦ బొందకుండ
  పద్య మా పరభావ ప్ర ♦ పంచమెల్ల
  బంధమున నల్ల నయ్యది ♦ ప్రతిభ యౌనె
  ప్రతిభ కలవారి నియతికిఁ ♦ బ్రతియె గాన.

గీ. పొలము పాటలు రుచియించు ♦ పొలములోన
పడవ పాటలు రుచియించుఁ ♦ బడవలోన
దంపుపాటలు సొం పగు ♦ దంపుసాగ
సభ్యములు కాక పోయిన ♦ సరసము లవి.

గీ. బీళ్ళ పచ్చిక కంటికిఁ ♦ బ్రియము గూర్చు
గడ్డిమోపులు సభలలో ♦ గారవింత్రె
కుసుమముల తావు లింపగు ♦ కొమ్మలందు
సభల సభ్యుల మెడలలో ♦ శౌరి తలను.

గీ. గౌతమ వ్యాసశేషుల ♦ గణన యేమి
సరససాహిత్య సిద్ధుల ♦ సరస ననియె
మున్ను పండితరాయఁ డ♦న్నన్న నేఁటి
కేమి చదువక వచ్చు సా♦హిత్యమందు?

గీ. యశము నర్థంబు నిడు వ్యవ♦హార మెఱుక
పరచు నశుభంబు లన్నింటి ♦ భంగపరచు
అప్పుడే గూర్చు నానంద♦మన్ని దెలుపు
మనసు కరిగించి కావ్యంబు ♦ మగువబోలి.

గీ. తీపి చేపుటయే గాని ♦ తెలుపరాదు
కావ్యమందురు కొందఱు ♦ నవ్యకవులు
గువులుపుట్టించి యురికించు ♦ గురియలేక
పాడు గీతాలు తాలేరి ♦ వేడు కగును.

గీ. తీపిమాటున బుద్ధులుఁ♦ తెలుపఁదగును
తీపితో భక్తి నేర్పనా ♦ దేవునందు
తీపితోఁ బతిభక్తిని ♦ తెలుపనాను
తెంపులకు నేల గీతాల♦ సొంపు లకట.

గీ. కట్టలో నది పొంగును♦ గాక యొకట
తటినిరై పారు సతతంబు ♦ దరుల నడుమ
వానవెల్లువ లెల్లెడ ♦ వరదబారి
ముంచు నన్నింటి నేరికి ♦ ముదమొసంగు.

శ్రీ శ్రీ శ్రీ

## జాను తెనుఁగు

తే. గీ. తేటతేలియ పల్కుల ♦ నీటుగుల్కు
పాత్రముల నెన్నియేనియు ♦ బొందుపరచి
నలువపొలతికి కాన్కగా ♦ నలవరించి
యప్పనం బొనరించిన ♦ యట్టిమేటి.

తే. గీ. చవిని కళుకుల జిలికెడు ♦ చలువతేని
కులుకుతావుల వెదజల్లు ♦ నలరుగమిని
మెఱపు గయిసేఁతలం గాంచ ♦ నొరయు మోజు
గలుగజేయును వీరి మేల్ ♦ కైత పజకు.

తే. గీ. అందమగు వేస, మలరించు ♦ నట్టి బాస
మేలినడకలు కులుకులు ♦ మిసిమి పసయు
తనరు సొబగును నొయ్యారి ♦ తనము గలుగు
ప్రోడవలె వీరికైత త ♦ న్పు గనజేయు.

తే. గీ కలుపుగోలుఁగ నచ్చమౌ ♦ తెలుగుగాఁగ
పలుతెలుంగుల మేలిక ♦ బ్బములు గూర్చి
ఇరుదెసల కైసరుల మను ♦ లింపు గొలిపి
మెప్పుగొను మిమ్ము పొగడఁగ ♦ నొప్పుగాదె.

తే. గీ. మెచ్చఁదగు కర్జములనింక ♦ మీరుసలిపి
బాసకును మేలు చేకూర్ప ♦ పాటుపడుచు
గొప్పతనమూన, మిమ్ము ప ♦ ల్కుచెలి లచ్చి
యొదవు నెనరున నెపుడు ప్రో ♦ చుదురుగాత’’.

మకాం
గవర్నరుపేట, బెజవాడ.
11—4—1940

ఇట్లు విధేయుఁడు.
చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రి,
ఈమని: గుంటూరు జిల్లా.

## శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు రచించిన

# పద్యములు

శా. శ్రీ మౌనీశు హవంబు గాచె మునినా ♦ రిం బ్రోచె దైత్యాళి ని
స్సీమోత్సాహముతోడఁ ద్రుంచె సభలో ♦ శ్రీకంఠు విల్వంచి శ్రీ
భామారత్నముఁ దా వరించె నెవఁ డా ♦ బాహాబలోల్లాసి శ్రీ
రాముం డిచ్చుత గోర్కు లీ హనుమకున్ ♦ రాజత్కృపాంభోధియై.

తే. గీ. అబ్బరాజు కులాంభోధి ♦ యమృతకరుఁడు
ననఘుఁడు నమాయకుండు శ ♦ తావధాని
పండిత కవీంద్రుఁడును ధర్మ ♦ భాసితుండు
సోదరసముండు నాకు వి ♦ శుద్ధ మతియు.

మ. కలుషం బింత యెఱుంగ డెప్డు బహుళ ♦ గ్రంథంబుల న్వ్రాసె ని
స్తుల భక్తిన్ బరమేశు నెమ్మదిని గొ ♦ ల్చున్ సద్గృహస్థుండు వే
దలసత్కర్మ లొనర్చుచున్ స్వకులస ♦ ద్ధర్మంబు దా వీడకే
నిలిచెన్ వాగ్వనితాప్రసాద గరిమన్ ♦ నిత్యంబు సంతుష్టితోన్.

తే. గీ. భవ్యమతి సత్కవీంద్రుండు ♦ పాకయాజి
బహు కుటుంబియు నాంధ్ర వి ♦ ద్వద్వరేణ్యుఁ
డైన హనుమంత కవిశేఖ ♦ రాఖ్యుఁ బ్రీతి
నాంధ్రులు బహూకరించుట ♦ హర్షమయ్యె.

తే. గీ. తండ్రి కవి, తాను కవి, తన ♦ తనయుఁడు కవి
వంశపారంపరీ లబ్ధ ♦ వరకవిత్వ
ధనుని హనుమత్కవీంద్రు ని ♦ తాంతభక్తి
సత్కరించు టెల్లరకును ♦ సంతసంబు.

తే. గీ. అమల కృష్ణానదీతీర ♦ హారపేటి
మా విజయవాటి కనకదు ♦ ర్గావిహార
మల్లికారామవాటి స ♦ మస్తవిబుధ
మాన్యగుణకోటి యను కీర్తి ♦ మహి జెలంగ.

తే. గీ. ఇతరదేశాల నెటనైన • నెట్టి కవుల
కైన మన్ననగలదు హా! • యాంధ్రకవుల
కన్నమే లేదనుచు బొక్కులాడు పల్కు
కల్లగా నాంధ్రుల మనముల్ • చల్లగాగ.

గీ. ఆంధ్రు లలసు లటని యన్యు • లాడకుండ
నాంధ్ర మర్యాద చెడకుండ • నాంధ్రభూమి
నాంధ్రవిద్వద్వరేణ్యుల • నాదరించు
టాంధ్రులకు నుత్తమ పథంబె • యగును గాదె.

మ. అలరన్ పూర్వము సత్కవీశ్వరుల వి•ద్యావంతులై మించి భూ
పులు, శ్రీమంతులు, కీర్తిమంతు లగుచుం • బూజించి పోషించి రా
విలసత్కాలము నెంచగా మనసు లా•వేగంబుచే గుందు; నేఁ
డల రాజన్యులు లేరికం గలుగు వా•రా రీతిగా లేరుగా.

గీ. అలసమతు లౌచు భూమీశు•లకట నేఁడు
చెన్నపురిఁ జేరి యింగ్లండుఁ • జేరి నీల
గిరులఁజేరి స్వరాజ్యంబు • సిరులు తూల
స్వప్రజల స్వభాషల మఱి • స్వగృహములకు.

గీ. పాసిపోవ శ్రీవాణులుఁ • బాసిచనిరి
గాన సుకవుల పోషించు • ఘను లెవారు
ప్రజలపైఁ బడె విద్యల • భారమెల్ల
భవ్య విద్యాభిమానులై • ప్రజలు ప్రీతి.

తే. గీ. మించి సత్కళలెల్లఁ బోషించ • వలయు
నెంచి సత్కవులను సత్క•రించవలయు
దేశమాత విచారంబు • దీర్పవలయు
ఘన యశము పుణ్యము సుఖంబు • గాంచవలయు.

గీ. ఆలపాలన్ని కాఫీల • పాలుగాగ
ప్రభువు లెల్ల విలాసాల • పాలుగాగ
వారి ధనము విదేశాల • పాలుగాగ
దేశదౌర్భాగ్య మే మని • తెలుపగలము.

సీ. భరత దేశంబు ము◆న్నటిరీతి నెల్లెడ
భాషాభివృద్ధిచే ◆ బరగవలయు
కవుల కష్టంబులు ◆ గడముట్ట పూర్వ భూ
పులఁబోలు భూపతుల్ ◆ పుట్టవలయు
ఘనధర్మ మెల్లెడ ◆ గ్రాలగా వరపతి
వ్రత లౌచు సతులెల్ల ◆ వరలవలయు
నిత్యసత్యవ్రత ◆ నిష్ఠచే పరసతీ
విముఖులై పురుషులు ◆ వెలయవలయు
గీ. సరస సాహిత్య సభ లెందు ◆ జరుగవలయు
నెపుడు బుధులకు మన్నన ◆ లెసగవలయు
నూట పదియార్లు క్రొత్తలా ◆ మేటిశాల్వ
లిట్టి సభలందు గవులకు ◆ నిడగవలయు.

గీ. ద్రిష్టలకు పృచ్ఛకులకు శ్రో◆తలకు బండి
తులకు సత్కవులకును దా◆తలకుఁ దుష్టి
పుష్టి ధనము యశంబునుఁ ◆ బొసఁగవలయు
నీతి గల విద్య సతులు గ◆ణింపవలయు.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీమత్పరదేవతాయై నమః.

# అ భి నం ద న మి త్ర లే ఖ.

బ్రహ్మశ్రీ కవిశేఖర అబ్బరాజు హనుమంతరాయశర్మ
పాకయాజిగారి సముఖమునకు——

నమస్కార పురస్సరముగ వ్రాయునది.

ఉ. ఆరని భక్తిపెంపునఁ గృ◆పార్ద్రమనంబున మీ రొనర్చు "గీ
తా"రవముల్ సెవిం బడఁగ ◆ ధన్యుఁడ నైతిని మిత్రరత్నమా!
కూరిమి దానిఁగాంచితి న◆కుంఠిత మైత్రిని మిత్రలేఖికా
ద్వారమునన్ మదాశయము ◆ బంపితిఁగావున స్వీకరింపుఁడీ!

'గీత' భగవత్ప్రోక్త మగుటంజేసి యందు సర్వ వేద వేదాంగ ధర్మములును, సర్వశాస్త్ర మతధర్మములును చేర్చఁబడియుండుటచే సారములేని సంసరణసాగర మీదులాడువారు తరించుటకును, మాయామోహలీలలలోఁ దగుల్కొనక యించుక విజ్ఞానమార్గమునఁ జరించుటకును, జీవిత తరణోపాయమును వెదకికొనుటకును, లోక వ్యవహారములయందైనను దెలివిగలిగి, మెలకువగలిగి, ప్రవర్తించుటకును, చివరకు మోక్షద్వారము చేరుటకును, ననువగు రహస్యోపదేశము లన్నియు నందిమిడియున్నవి. ఆ రహస్యము గ్రంథము చేపట్టి చదువుకొన్నవా రందఱకుఁ దెలియునా? నమ్మకము ప్రధానముగా నుండవలె. ఒక్క భక్తిఁగలవానికే యా రహస్య ప్రబోధ తెలియు. అట్టి వానికిఁగాక యితరులకుఁ జెప్పరా దనియే మేటిసిద్ధాంతము. అట్టి లక్ష్యగ్రంథ మగుటచే దానిని విజ్ఞానవేత్త లెందఱో యార్యావర్తదేశముననే కాక ఖండాంతరముల యందును వివిధ భాషలలో ననువాద మొనర్చుకొనిరి. ప్రకృతము పరమ పవిత్రమును, సారవంతమును, జ్ఞానప్రదమును నగు మన భారతదేశము పడమటిగాలుల కెరయై రుచులలో మార్పుజెందుచున్నను ఆస్తికత్వ మింకను రక్తనాళములనుండి పోలేదు. అందు సత్కవులు లోకము నుద్ధరించుటకై భక్తిజ్ఞాన వైరాగ్య బోధకములగు సత్కృతు లెన్నియో రచించుచున్నారు. అందు గీతానువాదము నందనేకు లభిరుచి కలిగియుండిరి. మంచి విషయము త్వరలో మఱచిపోవుట కలవాటుపడిన లోకమునకా మంచి విషయము పలువురు చెప్పుటయే మేలు. ఒకప్పుడైనను, నొకవానియందైనను లక్ష్యము కుదరకపోదు.

'గీత' వంటి యుత్కృష్ట గ్రంథములో సారము వీరువారను భేదము లేక యందఱకుఁ దెలియఁజెప్పిననాఁడు గాని, క్రియారూపమున నాచరించుటకుఁ దగిన యవకాశ ముపన్యాస బోధనలచేఁ గలిగించిననాఁడు గాని, లోకమంతయును జ్ఞానముగలిగి నైతికమార్గమున సంచరించుట కంతగా వీలుపడదు. కనుక గీతానువాద ప్రయత్న మెంతయు సంశ్లాఘ్యము. అందు సదాచారసంపత్తియు, నిష్ఠయు, నిర్మలహృదయమును గల మీవంటి మహాకవిచేఁ దెనిగింపఁబడినదన్నఁ బఠించువారి భాగ్య మనక తప్పదు. ఏలయన, గీతాసిద్ధాంతము "కర్మ" ప్రేరణకొఱకే ముఖ్యముగాఁ జెప్పఁబడినది. ఎంతటి యోగికైన, ఎంతటి బ్రహ్మవేత్తకైన శరీర మున్నంతవఱకు కర్మ

చేయక తప్పదు. అట్టి నిత్యనైమిత్తిక కర్మయందే బ్రహ్మానందజ్ఞాన మిమిడి యున్నది. జ్ఞానేంద్రియము తెలిచియాచు వా రంగీకరింపక పోరు. మీరు జ్ఞానధనులు - భక్తిసంపన్నులు - విశేషించి కర్మిష్ఠులు - కనుక మీ అను వాదము, భావ గాంభీర్యము నందుఁగాని, ఔచితియందుఁ గాని కుంటు వడక తేటతెనుంగు గీతలలో, సహజమార్దవకవితాధోరణిలో మృదు మధురంబుగ నుండి పండితులకు పామరులకుఁగూడ హృదయంగమముగ నుండుననియు మీ పరిశ్రమ సార్థకమైన దనియు నేను మనసార నానందించి నా హృదయాభిలాషను మిత్రలేఖికాద్వారమునఁ బంపుకొంటి. గొప్ప కవు లగుటయే కాక శతాధికగ్రంథకర్తలై లోకఖ్యాతి నార్జించిన యను భవజ్ఞులు మీరు. మీపవిత్ర హృదయము, మీ అనువాద గీతికలలో నద్దము వలెఁ బ్రతిఫలించుచున్నది. కాన పాఠకులకు మఱికొంత సౌకర్యమును, లక్ష్యమును గుదురు నని నా భావము.

గీతానువాదప్రశంస వచ్చినప్పుడు కవిత్రయకృతమగు మహాభారత మును నొక్కచేతి మీదుగా వ్రాసి నిర్వహించిన అస్మద్గురుముఖ్యులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కవిసార్వభౌములుగారి శ్రీకృష్ణభారతాంతర్గత గీతానువాదము స్ఫురణకు వచ్చు.అభాగ మా భారతమునకు వన్నె కలిగించిన దని "శ్రీకృష్ణ భారతప్రాశస్త్యము" అను గ్రంథములో వ్రాసి యుంటి. మీ గ్రంథము శ్రీరాజాభుజంగరాయ బహద్దరుగారి గీతానువాద కృతితోఁ గూడ సాదృశ్యమెంచి చదివితి. ఒకేగ్రంథము పలువురు తెనిగించినప్పుడు కొంచె మోపిక బట్టి యటనట సాదృశ్యమెంచి చదువుటలో గుణగ్రహ ణమే కాక, రసగ్రహణమే కాక, యాధ్యాత్మికజ్ఞాన గ్రహణలాభముగూడ త్వరగఁ బొందఁగలిగిన వారల మగుదుము. మొత్తము మీఁద నీ మూడు గ్రంథములు నాదృష్టికి నన్నిఁట సమానముగఁ గన్పట్టుచున్నవి.

ఎట్టులైననేమి మీ గ్రంథము తమ సార్థక నామధేయమున వెల్ల డించుటయేకాక ప్రతి అధ్యాయమునందును తొలిపద్యము హనుమన్మయమ జేసి - అనువాదములోఁగల క్లిష్టతకు నించుకేనియుఁ దావొసంగక రసమ గాని శబ్దార్థముగాని తత్త్వసూక్తిగాని ద్వైతాద్వైత సిద్ధాంత నిర్ణయ సంద ర్భమున జూపు నేర్పుకూర్పుగాని యెప్పట్టుననైన లోపములేకుండ అనువా

మనిపించుకొనక యాద్యంతము రసానందావేశమున వ్రాసినట్లు కనబడు చున్నది.

శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరి యగు శ్రీ సురభి వేంకటరత్నమాంబికా మతల్లి గారిచేఁ బోషింపఁబడుచు, శ్రీయువరాజా జగన్నాథరాయ బహద్దరుగారిచే సీతాకళ్యాణాదికృతులను వ్రాయు ప్రోత్సాహమును గాంచుచు చదువుల సరస్వతియై చక్కని కవయిత్రియై యెప్పు శ్రీ రాజ్ఞి ఇనుగంటి సరస్వతీదేవీ సతీమతల్లిగారి కరుణాకటాక్షశ్రీలకు బాత్రుండనై కలము చేపట్టి మిత్రలేఖకాద్వారమున భాషాసేవ చేయుచున్న నాకు నిట్టి యుత్తమగ్రంథసారమునుగ్రోలు నవకాశముకలిగించినందులకు మిక్కిలి కృతజ్ఞుఁడను. లోకోపకారమును, మానవజీవితాదర్శమును నగు నిట్టి గ్రంథములు మఱికొన్ని రచించుటకుఁ బరమేశ్వరుఁడు మీకు దీర్ఘాయురారోగ్యభాగ్య శ్రీలను బ్రసాదించి రక్షించుగాక. ఇట్టి తత్త్వకృతికి కృతిభర్త లగుట బహుజన్మసుకృత తపః ఫలము – అట్టి మహాభాగ్యమును బొందిన మహారాజశ్రీ అయ్యంకి వేంకటరమణయ్యపంతులుగారు కవిజనకల్పకులై పూర్ణాయురాభాగ్య సముపేతులై తనరారునట్లు భగవానుఁ డనుగ్రహించుగాక.

ఉ॥ శ్రీహరి కృష్ణమూర్తికవి • సింహులు మంత్రిభుజంగ రాయలున్
మా హనుమంతరాయకవి • మాన్యులు వ్రాసిన గీతలన్ జగ
న్మోహనభేదరీతి గనఁ • బూనిన వారికిఁ జిక్కఁజేయు బో
సోఽహము భావ దర్శి పదు • నైదవ భాగపు టూర్ధ్వమూలమే.

ఇట్లు విధేయులు,

మకాం, బెంగుళూరు. } వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు.
స్నేహలతా కవితాసంఘము, కొల్లాపురము,
జటప్రోలు సంస్థానము.

---

శ్రీ మాత్రే నమః.

# శ్రోత్రియ కవి బిరుదము

క. కృతికాని కృతికర్తల కాని, కృతిపతికా మందు శ్లాఘ • కృతి ధని సభల
కృతిదర్శి పరమశివులకుఁ, గృతిపతికిని మొదలనుతులు • గీర్తింపవలెన్.

క. కవియగుట కవితకిచ్చుట, కవికృతులకుఁ బతిగనగుట • కవిగలయుటయు
కవితా సభలను గాంచుట, శివుకృప లేకున్న నెట్లు • చేకూరు సిరుల్.

క. కృతికర్తలఁ గృతిగుణములఁ, గృతులగువా రెన్నివారి • కృతు లున్నపుడే
ప్రతిఫలమగుకృతిఘనతను, గృతిగాఁ బ్రకటింపనుభయ • కృతకృత్యతలౌ

తే. ధనముఁ గవి కిచ్చి కృతికిఁదా • ధనికఁడైన
ధనియె సరసుఁడు కవిమతి • ధారకుండు
అటులఁ జేయని ధనికి న • త్యంతశిక్ష
వేణుగోపాల శతకాన • విశద మౌను.

తే. ఏటి కౌరస సంతతు • లెన్నియున్న
ధర్మ సంతాన తుల్యముల్ • ధరను గావు
కృతికి స్థిరతను గావింపఁ • గృతియె దీటు
కర్తృభర్తృల కగు సిరి • ఘనమె యలుదు.

తే. ఆయములు గల్గి వ్యయము ల • త్యధికమైన
గొంద ఱిలఁ బేరు నించుకే • నొంద అకట!
పాత్రమబ్బక యే ప్రతి • ఫలము లేక
తలపరానివె స్వప్నంపు • స్ఖలనరీతి.

క. భగవద్గీతల తర్జుమ, జగమంతట సల్పియున్న • జను లధికముగా
దగినట్లు తేటతెనుఁగున, సొగసుగ హనుమంతశర్మ • సూక్తులఁ జేసెన్.

క. హనుమ ద్భగవద్గీతలు, హనుమ యనెడు పాకయాజి • యల్లికనారయ
వినఁ గృష్ణ భారతంబని, మనుపటి భారతమె నేఁడు • మూగెడుపగిదిన్.

క. ప్రత్యధ్యాయముఁ బద్యము, స్తుత్యముగా సార ముండి • తుష్టికరంబై
సత్యమగు నర్థ మలరుచు, వ్యత్యాసము లేకయుండు • వరభాషముతోన్.

ఉ. కర్మల చిత్తశుద్ధియని • కర్మఠులెల్లరుఁ బల్కఁ దాన బల్
మర్మముఁ జెల్ల జ్ఞానమని • మంత్రముఁ దంత్రము జెప్పవేత్తలై
ధర్మము నాచరించెదఱు • దార్ఢ్యముఁబట్టి ఘటించు మోక్షమున్
శర్మకిఁగూడ ధన్యతకు • సాధన సంపద భక్తికర్మలే. ౧౦

క. కారాగృహవాసంబున, వారాణశ్యధిపు గృపకు • భగవత్కృతికై
మారిచె గీతలఁ దెనుఁగున, జారుగ నాగేశరావు•శహబాసనెదన్. ౧౧

తే. అబ్బరా జనుకులమున • నబ్బురముగఁ
గబ్బమల్లెడు నీ శుభ్రత•కవికిఁ దండ్రి
తనయుఁడును ఘనకవులయి • గణ్యమైన
గ్రంథములఁజేసి భువి యశః•కాయులైరి. ౧౨

తే. మాఘమాహాత్మ్యమునఁ దండ్రి • మాన్యుఁడౌట
ప్రబలఁ దనయుండు పార్వతీ•పరిణయాన
దాను నిర్బంధకవితల • ధన్యుఁడౌట
కవుల "హ. శ. పా. ని" "శ్రోత్రియ • కవి" యటందు. ౧౩

తే. తొలుత భారతకవులలో • స్తుత్యుఁడన్న
శ్రోత్రియుఁ డగు తిక్కన • సోమయాజె
నేటి కవులందు వైదిక•కోటియందుఁ
బ్రాకు హనుమంతశర్మయన్ • బాకయాజె ౧౪

శ్లో. శృంగార రససన్యాసా, ద్గోపీ బుషిగణా శ్రితాః
యం తుష్టా స్స జయే త్కృష్ణః, తన్మయాత్వోత్సవశ్రియై. ౧౫

ఇతి కవికులోత్తేజకః,

గురుకులాశ్రమము,
విజయవాడ.

ఘంటాశత గ్రన్థకరణ ధురీణ శతావధాని విద్వత్తిలక
భాషణ భట్టాదిపౌరుష నామబిరుదాంకితః
పండితభూషణ శతావధానీ,
వేమూర్యుపాధిః శ్రీరామశాస్త్రీ.

---

శ్రీమత్పరదేవతాయై నమః.

# పండితాభిప్రాయములు

I

భగవద్గీత:— ఇద్దాని యోగ్యత ననుసరించి దీనిని కవుల నేకు లనేకభాషలలో ననువదించిరి. ఇందఱు కవులనిగాని యిన్నిభాషలనికాని నిశ్చయించి చెప్పుట కేరికిని తరముగాదు. "భగవద్గీతా కించిదధీతా" అని శ్రీ శంకరులో వారి శిష్యులో భజగోవింద శ్లోకములలో నుడివియున్నారు. దీని నేవిధముగా నేని జపించుట పరమ పురుషార్థమునకు సాధనము. కావున నెందఱిద్దాని ననువదింపఁ బూనినను పునరుక్తి దోషమున కవకాశము లేశమును నుండదు. పలువురు భక్తులు భగవంతుని ప్రార్థించుటలోఁ బునరుక్తి యెట్లు లేదో, భగవద్గీతానువాద విషయములోగూడ నట్లే. ప్రస్తుతము దీని నాంధ్రీకరించినవారు శ్రీయుతులు అబ్బరాజు హనుమంతరాయశర్మగారు. వీరిని నేను చిరకాలమునుండి యెఱుగుదును. వీరు రచించిన సుగ్రీవ పట్టాభిషేకమును జూచియున్నాఁడను. వీరి కవిత్వము తద్రచనా కాలమునకే మంచి ధారాళధార కల్గియున్నది. ఇటుల వీరు చాల గ్రంథములు రచించియున్నారు. ఆ కారణమువలన నిపుడు మిక్కిలి ధారాళత్వ మేర్పడి యీ గీతానువాదము మిక్కిలి సులభశైలిలో నడిచినది. అన్నివిధముల నియ్యది ఆదరణీయముగ నున్నదని సూత్రప్రాయముగ నొకటేమాట వ్రాసి దీనిని ముగించుచున్నాఁడను.

బెజవాడ — చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని.

---

II

ఆర్యా! తమ హనుమద్గీతా గ్రంథమును గూర్చిన నా యభిప్రాయ మీ శ్లోకమువలనఁ దెలియఁ జేయుచున్నాను.

శ్లో॥ ఆద్రాక్షం భవదీయ వాక్యరచనా చాతుర్య సద్ధ్రీకృతం
గీతాఖ్యస్య జగత్ప్రసిద్ధ భగవద్వాక్యామృతార్ణోదధేః
దుస్సాధ్యాం భగవత్కృతిం నిజపదై రాన్ధ్రీకృతం కో వదేత్
మాధుర్యైకనికేతనం యది భవేత్తన్నాస్తి తత్రేత్యపి.

శ్రీ మన్మహోపాధ్యాయవిద్వన్మణిః శిష్టా నరసింహశాస్త్రీ

## III

శ్లో॥ అష్టావధాని కవిశేఖర మబ్బరాజ
వంశాబ్ధిసోమహనుమత్కవివర్య మేతమ్।
తత్కర్తృకాంధ్రకృత దీక్షిత సచ్చరిత్ర
ముఖ్యానహం త్వవిదమేవ బహూన్ప్రబంధాన్. ౧

శ్లో॥ భగవద్గీతా మాంధ్రే కవినాఽద్య కృతాం నిరీక్ష్య తుష్టోఽహమ్।
హనుమద్భగవద్గీతా మేతాం లోకోపకారిణీం మన్యే. ౨

శ్లో॥ అయ్యంకివంశ ముక్తా వేంకట రమణేన పోషితా సేయమ్।
దివ్యజ్ఞాన సమాజే మహతా గీతాఽనఘా చిరంజీయాత్. ౩

ఇత్థం,
లక్కావఝ్ఝల వేంకట కృష్ణశాస్త్రీ,
ఆశ్చర్య రామాయణాది గ్రంథరచయితా,
హిందూహైస్కూల్ ప్రధాన సంస్కృతాధ్యాపకః. బెజవాడ.

---

## IV

శ్రీ భాస్యాయనమః.

బ్రహ్మశ్రీ కవిశేఖర, అబ్బరాజు హనుమంతరాయ శర్మగారికి,
అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నొసంగినది.

శ్లో॥ కృతా సుకృతినా గీతా ధీమతాఽద్య హనూమతా
శేష భూషణ హృత్తోషా భూసా భాషావతా మహాన్.

శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ
మహావిద్యాపీఠము, బెజవాడ.
16—6—1940.

వైద్యరాజ,
దం. సు. అవధాని.

---

## V

శ్రీ హనుమద్భగవద్గీత:—దీనిని అవధాని కవిశేఖర బ్రి॥ అబ్బరాజు హనుమంతరాయశర్మ పాకయాజిగారు రచియించిరి. ఇది భగవద్గీత కాంధ్రానువాదము. పలువురు పండితు లాంధ్రీకరించిరి. కొన్ని సంస్కృత శ్లోకములవే తేలికయనిపించునవియై యున్నవి. వీరి హనుమద్భగవద్గీత సరళమధుర శైలితో నిర్దుష్టమై, భావవిపులీకరణము కలిగి హృదయానందమును గలిగించుచున్నదనుటకు సందేహము లేదు. ఇందలి పదునెనిమిది యధ్యాయముల సారమును బదునెనిమిది గీతములలో వీరు స్పష్ట పఱచియుండిరి. కఠిన ఘట్టములలో సందేహముగా నున్న కొన్నితావుల, సమంజసార్థ ప్రకటనమునకై పాఠాంతర కల్పనమున విశదపఱచి యుండిరి. ఆంధ్రగీర్వాణములలో వీరికిఁగల సామర్థ్యము బహుగ్రంథరూపమునఁ బాఠకలోకమునకు వెల్లడించి యున్నారు.

గీతార్థ మెంతసులభముగాఁ జక్కఁగాఁ జదువువారికి బోధపడవలయునో యంతసులభముగాఁ జక్కగా నుండునట్లు వ్రాసియుండిరి. బోధనాశక్తి వీరి కుగ్గుబాలతో నభ్యస్త మయ్యెననుట కున్నతపాఠశాలాపండిత బిరుదమే సాక్ష్యము.

సీ. సిగ్గెఱుంగని కడు♦జిన్నతనాననే, సిగ్గున గోపికా♦శ్రేణి ముంచె,
నాఁకలి యెఱుఁగని♦యట్టి శైశవమందె, యాఁకలిఁదీర్చె ముల్లోక♦ములకు,
గీతలు తిన్నఁగా♦గీయనేరనినాఁడె, గీత లర్జునునకుఁ♦బ్రీతిఁ గఱపె,
జక్రింబుఁ బట్టంగఁ♦జాలనియప్పుడే, చక్రరక్షకత ని♦చ్చలును జూపె,

గీ. నట్టి శ్రీపార్థసారథి♦యబ్బరాజు, రమ్యకులజాతుహనుమంత♦రాయశర్మ,
పాకయాజిని నవధాని♦సాకుఁగాక, సత్త్వకవిశేఖరత్వంబు♦సంఘటించి.

ఏలూరు,
7–6–40.

ఇట్లు సుజనవిధేయుఁడు,
రాజా, యం. భుజంగరావు.

---

## VI

శ్రీ కృష్ణుఁడు విజయున క
స్తోక కృపఁ దెలిపి యుడిపె శోకము నా గీ
తాకృతి దెనిఁగించి మనో
వ్యాకులత తరించె నే బుధాగ్రిణి బళిరా!

భగవన్ముఖేందు మండల
విగళితమై, వ్యాసముఖ పవిత్రింబై జా
లుఁగ భారత కేదారము
సొగసుగఁ బండించె గీతసుధయై మించెన్.

ఎందఱు టీకింపరు, ము
న్నెందఱు తెల్గింప రెంద, ఱెందఱు వ్యాఖ్యల్
పొందుపఱుప రీ గీతకు
నిందటి బాసలను నమృతమే యిది చిలుకున్.

అబ్బరాజాన్వయుండు శత్యైకరతుఁడు
దాంతుఁడు, యశస్వి, శ్రీ హనుమంతరాయ
శర్మ, సుకృతి కుటుంబి భాషావధూటిఁ
గొలిచి తెలిగించు గీతల, చెలువ మెంతు.

కోదండపాణిఁ గొలుచుచుఁ
గోదండజ్యానినాదగుంఫిత కవితా
మేదురు లగుదురు గావుత
శ్రీ దయితుని కృపను నితని చిన్నికుమారుల్.

శ్రీ శ్రీ శ్రీ

విద్వాన్ కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు, బెజవాడ.

---

## VII

మ. భగవద్గీతఁ దెనుంగుఁ జల్పితివి, నీ◆ప్రావీణ్యముం జూపి, దా
ని గుణాఢ్యుండు వదాన్యవర్యుఁడు కళా◆నిష్ణాతుఁ డయ్యంకి వం
శ్యగరిష్ఠుండగు మంత్రిసత్కులున కి◆చ్ఛాపూర్తిగా నిచ్చి య
మ్మగవానిన్ జగమెక్కఁ జేసితి వహో◆మత్ప్రాకయాజ్యాగ్రణీ!

మ. మనవంశంబు కవిత్వకామినికి జ◆న్మస్థాన మై వారుఁగా
దనఁగా రానిది వ్రాసిచూపితివి కా◆వ్యంబుల్ మఱింకేమ నీ
ఘనకావ్యోక్తగుణంబు లిట్టివని వ◆క్కాణింపఁగా నేల చం
ద్రునకున్ వెన్నెలయున్న దన్నగతి గా◆దో? సత్కవిత్వాంబుధీ.

ఉ. వ్రాసిరి కొందఱీకృతులు◆వాసిగణింపఁగ నెవ్వరెన్నియున్
వ్రాసిన నొండొకంటికిఁ గొ◆ఱంతయు హెచ్చునుగూర్పఁజాల నే
దీ సరివచ్చు దీని కిది ◆ యియ్యది తగ్గిది మొగ్గటంచు నే
భాసురకీర్తియున్ బయికి◆వచ్చి వచించిన వాక్కులకగ్గలై నే.

ఉ. ఒక్కని కొక్కశక్తి మఱి◆యొక్కని కింకొకశక్తి యుండు స
మ్యక్కవితాభిరాములగు◆మాన్యుల కావ్యములన్ గుణంబు లే
చక్కని బల్కు సాధ్యములు ◆ శారదయొక్కని మాత్రయా నె వీ
రెక్కువ వీరు తక్కువని ◆యెంచుట లే యవివేకమార్గముల్.

చ. పటుమతిశాలియున్ సుగుణ◆బంధుఁడు సింధుగభీరమూర్తి వేం
కటరమణార్యుఁడీ కృతిని◆గైకొన దగ్గ పవిత్రకీర్తి నీ
వటె యొసఁగన్ సమర్థుఁడవు◆వారి యశంబొనఁగూడె మీకు మి
క్కుటమగు ప్రేమ మీ యుభయ◆గోత్రములన్ శివ ప్రోచుఁ గావుతన్.

ఇట్లు,
ఆశుకవి సమ్రాట్ప్రముఖ బిరుదాంకితులు
కొప్పరపు సోదరకవులు, శతావధానులు.

---

## VIII

# శ్రీహనుమద్భగవద్గీతా ప్రశంస

ఉ. శ్రీహనుమత్సమాఖ్య కవిశేఖరుఁ డాచరితత్రియామతా
వ్యాహత నిత్యసత్క్రియుఁడు హర్షిత సర్వసుపర్వవర్యుఁడు
త్సాహసమగ్రుఁ డాంధ్రమున జల్పిన గీతల నంతరార్థముల్
నా హృదయంబునం దగిలి నాటిన వాని నెఱుంగఁ జేసెదన్. 1

సీ. ధృతరాష్ట్ర భూమీశుహృదయ సద్భావంబు
ప్రథమపద్యముఁ గూర్చి పలుకఁబడియె
దుర్యోధన మహీశు దుష్టాశయం "బప
ర్యాప్తం" బనెడు శ్లోకమందుఁబలికె
నాత్మస్వరూపమే యన్నిజీవు లని "న
త్వేవాహ"మను దానఁ దెలుపఁబడియె
నవినాశి యనఁగ బ్రహ్మం బంచు స్థిరముగ
"నవినాశితు" శ్లోకమందు నుడివె
తే. గీ. "యా నిశా"యను శ్లోకమ్మునందు జ్ఞాని
లక్షణాదులు లెస్స వివక్షసెసె
మఱియుఁ "గర్మేంద్రియాణి సంయమ్య" యనెడు
దానియందు మిథ్యాచారు నూని పలికె. 2

తే. గీ. "యజ్ఞ శిష్టాశిన స్సంత" యనెడు దానఁ
బంచయజ్ఞ సూనాదులు పలుకనయ్యె
"కర్మ బ్రహ్మోద్భవ"మను శ్లోకమున బ్రహ్మ
రూపమగు యజ్ఞఫలముఁ జేర్కొనఁగఁ బడియె. 3

తే. గీ. పలికె "శ్రేయాన్ స్వధర్మ"యన్ బద్యమందు
వివిధధర్మ భావంబుల వివరణమ్ము
నాల్గువర్ణంబు లా త్రిగుణములఁ గలిగె
నంచు నుడివెఁ "జాతుర్వర్ణ్య"మనెడు దాన. 4

తే. గీ. "ఊర్ధ్వమూల"మ్మనెడుదాన • నొప్పుముఖ్య
శబ్దభావ విశేషార్థ • సరణిఁ బలికె
దిక్ప్రదర్శనముగఁ దెల్పి • తి నిటు వీరు
వరమనీషా ప్రశస్తిఁ గ • న్బరచి రిందు. 5

మ. సుగమంబై హృదయంగమం బగునటుల్ • శోభాయమానంబులై
తగు మూలానుగతైకభావముల సుం • తన్ వీడఁగాఁ బోకయుక్
నిగమాంతార్థవిశిష్టమై సువిషయా • న్వీతంబు నాధ్యాత్మ్యవాక్;
భగవద్గీత రచించి మించితిరి స • త్ప్రాగల్భ్య మేపారఁగన్. 6

చ. సరసుఁడు తిక్కయజ్వ దయ • చాల మదిం దలపోసి యిట్టులన్
బరిగణనీయతత్త్వ పరి • పాకసుధామయ మైన గీతలన్
విరచన సేయకే విడుట • విశ్రుతు లీ బుధు లెంతధన్యులో
నెఱిబహుధంగులన్ గృతుల • నించి తరించియు సంతసింపఁగన్. 7

ఆ. వె. పూర్వజన్మసుకృత • భూరిఫలంబునఁ
గాక యిట్టి పనికిఁ • గడఁగరాదు
తెనుఁగుసేత తత్త్వ • మనఁగ సాధ్యం బొకో?
గ్రొచ్చి యబ్ధిసుధను • గొనుట గాక. 8

తే. గీ. పలువు రలగీత తెలుఁగుసే • తల ఘటించి
రనయమును మది హర్షించు • పనియయౌను
అటుల మీగ్రంథమును మణి • హార మగుచు
సతత హర్షద మై సర • స్వతికిఁ దనరు. 9

ఉ. సారమతత్త్రియార్థ సువి • శాలము, తత్త్వరసాలవాల మిం
పారఁగ మోక్షమున్ గరత • లామలకంబుగఁ గూర్చు దీనినిన్
జారుమనీష నేఁజదివి • సంతస మందితి మెచ్చితిన్ గృతిన్
మీరు రచించు టెంతయును • మేలు శుభంబులు గల్గు మీ కొగన్. 10

ఈమని, గుంటూరుజిల్లా,
మకాం:
బెజవాడ, గవర్నరుపేట.

ఇట్లు,
చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రి.

## IX

క౦. సుగమము లగు గీతంబుల
భగవద్గీతలకు దెలుగు◆వ్రాసె గవివరుం
డగు హనుమశ్శర్మ శర్మం
బగుఁ గృతికిన్ బతికి ! వినెడి◆వారల కెపుడున్

తిరుమల శ్రీనివాస త్రిలింగ
మహావిద్యాపీఠము,
విజయవాడ.



కవితిలక, కవితావిశారద
విద్వాన్
కాంచనపల్లి కనకాంబ
లెక్చరర్
క్వీన్‌మేరి కాలేజి, మదరాసు.

---

## X

శ్రీరామ

క. దీక్షిత మతదీక్షామతి, యక్షీణ కవిత్వ నవసు◆ధాభిమత మనో
నిక్షేపరామసేవా, దక్షుడు హనుమత్కవీంద్రు ◆ ధన్యుం డెలమిన్ .

గీ. సోదరసముండు నాకు వి◆శుద్ధ చరితుఁ
డలఘు సమ్మాన మతిని సా◆కంపినట్టి
ఖ్యాతిగల భగవద్గీత ◆ గీతపాళి
నాంధ్రరచన వెలయుదాని ◆ నలర గంటి.

గీ. తేటతెల్లంబుగా తేనె ◆ తియ్యదనము
లొలుక కడుభక్తి భవములు ◆ దొలగఁ బలికి
ధన్యతముఁ డయ్యె నీ కవి◆తల్లజుండు
నెందరో మున్బలికి రని ◆ యెన్న నేల.

గీ. ఒకరు చవులూరు భక్ష్యంబు • లొనరజేయ
నవియె యెందఱో కడు నేసు•పమర జేసి
సంతసము నంది రటులె భూ•షణమొకండు
నెంద రెన్ని తెఱగుల ని•ర్మించి రెలమి.

క. ఎందఱు సెప్పరు రాముని, సుందరచరితంబు బ్రీతి • జొక్కమనముః
బొందుగ భగవద్గీతయు, నెందఱు రచియింపఁ గొఱత•యేమిటఁదలపఁ

ఇట్లు, సోదరీ సమాన,
గుడిపూడి ఇందుమతీ దేవి.

---

# XI

ఓం శ్రీ కనకదుర్గాంబాయైనమః

సీ. పాఠశాలల గల్గు • పండితులందఱ నగ్రిగణ్యుండవై • యలరినావు
అచ్చాంధ్రమున, కైత• నల్లి నిస్తులరీతి,ఖ్యాతిక్కీర్తి జగతిపై • పఱచినావు
గద్వాల జటప్రోలు• కాశ్యపీశ్వరులిచ్చు,సత్కారముల జెంద•జాలినావు
వైశ్వదేవంబాది • పాకయజ్ఞంబుల, సలిపి వైదికకర్మ • నిలిపినావు

గీ. జన్మధన్యంబు గాజేయ•జాలినట్టి,గీతరచియించి యఘుమసుప్రీ•క్కించినావు
అబ్బరాజుకులాబ్ధిశీ•తాంశుమూర్తి,రచిత సత్కర్మ హనుమంత•రాయశర్మ

తే. మంజురీతిని యర్థ కఠి•నమ్ము విడక
ఆంధ్రభాషను సరస ప•ద్యములతోడ
కృష్ణబోధితమైన త•ద్గీత నెలమి
రచన యొనరించె హనుమంత•రాయశర్మ!

ఉ. పంచమవేదమై పరగు•భారతమున్ రచియించువా రుపే
క్షించిన గీత పెక్కఱు ర•చించిరి తెల్గున వారినందఱన్
మించి నిజాభిధన్ బుధు ల•నేకులు మెచ్చగ గీతవ్రాసె న
భ్యంచిత పాకరీతి సుగు•ణాఢ్యుఁడు శ్రీ హనుమత్సమాఖ్యతోన్.

ఉ. మక్కికి మక్కిగాగ బుధ • మాన్యులు కొందఱు వ్రాసినట్టి యా
ఫక్కిని గాక యర్థమును • బాగుగ జూచి విశేషభావముల్
చక్కగ వ్రాసి ప్రాజ్ఞులకు • సంతసముగ్ ఘటియించి రిద్ది పె
న్మక్కువగా పఠించ నఘ • నాశన మౌటకు నబ్రి మున్న దే.

గీ. ఆంధ్రముదాస్త్రలయమునకు • నధిపతు లగు
రసికు డయ్యంకి వేంకట • రమణమంత్రి
దీని నెంతేని కరుణ ము • ద్రింపఁజేసె
తనయశ మితోభివృద్ధియై • తనరురీతి.

అవధానకంఠీరవ, ప్రతాప వేంకటేశ్వరకవి, శతావధాని.
బె జ వా డ.

---

## XII

### శ్రీ ర స్తు

శ్రీ భగవద్గీతను తిక్కన్నగారు తెలుగు చేయలేదు. పిండిప్రోలు లక్ష్మణకవిగారు కాబోలు తెలుగుచేయఁబోఁగా నొక వృద్ధపండితులు పగలు రెండుజాముల వేళ వారింటి కతిథిగా వచ్చి భోజనము ముందఱ తెలుగు చేయనని వాగ్దానము పుచ్చుకొని యాపోశనము చేసినాడట.

అట్టి భగవద్గీతను నే డనేకులు తెలుగుచేసిరి.

ఇది మన నాట ఒక ప్రొటెస్టాంటు మతము వంటి మార్గము. అన్నియు నందఱ కందుబాటులో నుండవలయు నని.

అందులోని యర్థములు గ్రహించుటగాని, దాని ననుభవములోనికి తెచ్చుకొనుటగాని యెవరి శక్తి ప్రకారము వారికి.

అసలు విషయము అందఱకుఁ దెలియవలయునని. అనఁగా నందఱు చదువవలయు ననుట.

శాస్త్రగ్రంథములు పద్యములలోఁ దర్జుమా చేయుటలోఁ గవితా శక్తి ప్రకటించుటకు వీలులేదు. వచనముకన్నఁ బద్యమైనచోఁ గంఠతః పట్టుటకు జ్ఞాపక ముంచుకొనుటకు నెక్కువ వీలు.

మతీ యితరులు చేసిరాయెను, మరల నీ తెలుఁగు తర్జుమా యె కనవచ్చును. ఒక్కొక్క చోట నొక్కొక్కరి రచన గ్రాహ్యము నుండవచ్చును. శ్రీ అబ్బరాజు హనుమంతరాయ శర్మగారి పద్య మృదువుగా సులభముగా నుండును. కానఁ దెలుగుపాఠకులకు దీని భగవద్గీతార్థము స్థూలముగాఁ దెలిసికొనుటకు సౌలభ్య మేర్పడును అదియుఁగాక యిట్టి గ్రంథరచన కవిగారి యాధ్యాత్మిక సాధనలో భాగ ఒకానొక దుఃఖావేగము తరించుటకు వ్రాసియుండవచ్చును.

క॥ కృతికర్తకుఁ గృతిభర్తకు
నితాంతమహనీయ సౌఖ్య◆నివహంబులు స
మ్మతిఁ జేయుఁ గాక గీతా
కృతిప్రథమఋషి పరుండు ◆ కృష్ణుఁడు ప్రేమన్.

ఇట్లు,
విశ్వనాథ సత్యనారాయణ
బెజవాడ.

---

## XIII

ఒక చిరకాల జీవి సుకృ◆తోదయ వాక్చరితార్థతాకృతిన్
బ్రకటితమయ్యె గీత భగ◆వన్ముఖ నిస్సృతయైన గంగయై
ప్రకృతి దురామయోత్సరణ ◆ బంధుర భంగ విలోల డోలికా
సుకృత విహార ధీర నవ◆సుందర యోగ విలాస హంసమై.

త్రిపథగయైన గీర్నదిని ◆ ఉద్ధరి భాష్య విధిన్ భగీరథుల్
వ్యపగతకిల్బిషుల్ మువురు ◆ భాషల బావుల నూరి యద్దియున్
దపసి జనుల్ పిపాస మెయిఁ ◆ ద్రావఁగ సంస్కృతి దాహశాంతికై
యుపమిత దివ్యలోక సుధ◆యొప్పు వహించెఁ ద్రిలోక పూజ్యమై

ఈకృతిఁ గాంచునట్టి నరుఁ◆డే సుఖముం గనుఁ గాంచుఁబో మనో
వ్యాకృతి కందరాకయ 'వు◆వాః' యని దిక్కుల సామగాన వి
ద్యాకలనంబునన్ దిరుగు ◆ నంట బికారితనంబు సెల్లఁగా
నీకృతి నొందు సత్కృతి స◆రే, యిక నెట్టినయట్లె సంస్కృతిన్.

పంచసహస్రి వర్ష యగు ♦ భామిని యీయమ పాకయజ్ఞ వి
ధ్యంచిత బుద్ధి శ్రోత్రియుని ♦ యంపు జనించెను నీవెం గట్టుకో
నుంచునొకో గృహమ్మున నొకూతన నిల్వెడి కాన కంపునో
మంచి సతిన్ గ్రహించితివి ♦ మాటకు మాటకు నింటి కెక్కంబో.

నిను పెంపంగను నబ్బరాజు కులముం ♦ గామించి యయ్యంకి వా
రును బూర్వాపరముల్ పదా తరములున్ ♦ శుశ్రిత్యంత నిర్దిష్ట బ్రి
హ్మ నివిష్టస్థితి నొందఁజేయు మహనీయజ్యోతి గీతాఖ్య మా
నిని దృశ్యాతిగమైన సంస్థితి సము♦న్మేషంబునం బొల్చుతన్,

విశ్వనాథ వేంకటేశ్వరులు.

---

## XIV

పంచమవేదం బనం బరగిన మహాభారతమునకు మకుటాయమానమై భగవద్గీత యలరారుట సర్వజన సంవేద్యము. దానిప్రతిభ భరతదేశమునందే గాక ఖండాంతరము లందుగూడ వెలుగొందుట జూడ నియ్యది మహోన్నత గ్రంథరాజ మనుట నిస్సంశయము. అట్టి మహోత్కృష్టమయిన భగవద్గీత పలు పురచేఁ బలువిధములఁ బ్రశంసింప బడుటయేగాక మతత్రయమువారికి ముక్తినిధాన మనుట నిర్వివాదము. ఒక్కొక్కమతము ననుసరించి శ్రీ శంకర రామానుజాచార్యాదు లెన్నియో భాష్యములువ్రాసి లోకోద్ధరణమార్గములను సూచించినను ఆయామతముల వారు భాష్యములకు భాష్యములువ్రాసి గీతామృత సారమును బలువిధముల లోకమునకు బంచిపెట్టి తమతమ జీవితలాభమునంద గలిగిరి. అట్టి శ్రీ భగవద్గీతను భారతాంధ్రీకరణమునఁ గవిబ్రహ్మ తిక్కన సోమయాజి యాంధ్రీకరింపకుండుట జూడఁ దెలుఁగు నేత మాలమునుబోలె సర్వమత సాధారణము కాఁజాల దేమో యని తలంచి వదలివేసిరా యని తలంపవలసియున్నది.

తరువాత శ్రీకృష్ణ భారతకర్తలును, కవిసార్వభౌమేత్యాది బిరు దాంకితులును, మహామహోపాధ్యాయులునైన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారు తమ భారతాంధ్రీకరణమున భగవద్గీతలకుఁ గడు మనోజ్ఞ

ముగఁ బద్యముల వ్రాయుట జూచితిని. మఱి కొన్ని యాంధ్రీకరణము
గూడ నే నిటీవల గనుగొంటిని. "రాఘవేశ్వరుచారిత్రము నెంద ఱెన్ని
లఁ వర్ణించినఁ గ్రొలదే" అని శ్రీ కంకంటి పాపరాయామాత్య
వర్యుఁడు చెప్పినట్లు భగవద్గీత కెన్ని వ్యాఖ్యానములు, ఎన్ని యాంధ్రీ
ణము లున్నను అయ్యవి యధికములు కానేరవు. ఇంతియేగాక భగవద్గీ
మాహాత్మ్యమున.

శ్లో. గీతాయా శ్లోకదశకం సప్త పంచ చతుష్టయం
ద్వౌత్రీనేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠే న్నరః
చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువం
గీతాపాఠ సమాయుక్తో మృతోఽమానుషతాం వ్రజేత్.

అని చెప్పఁబడియున్నది.

పైశ్లోకములకు ప్రస్తుత గ్రంథకర్త లగు కవిశేఖరుల యాంధ్రీ
ణము.

గీ. ప్రతిదినంబును నెవ్వఁడు • పదియుఁగాని
యేడు నైదును నాల్గని • మూఁడె గాని
రెండుగాని యొకటిగాని • యొండునందు
సగమయిన శ్లోకమేగాని • చదువువాఁడు.

గీ. విధునిలోకంబునను పది• వేల యేండ్లు
నిల్చి గీతలఁ జదువుచు • నేలఁ ద్రెళ్ళె
నేని యవ్వాఁడు దేవత్వ • మెలమిఁ గాంచు
వారిఁ బోలిన వార లెవ్వారు లేరు.

అందువలన భగవద్గీత యే సాంప్రదాయమున నెంతవరకు దే
అంతవఱకే లాభ మున్నదనుట నిస్సంశయము. కావున భగవద్గీత యా
కరణము కూడ ఆత్మోద్ధరణమే గాక లోకోద్ధరణ మనుటకు సందియము
ప్రస్తుతము శ్రీ మానుద్భగవద్గీతాకర్తలగు, బ్రహ్మశ్రీ కవిశే
అబ్బరాజు హనుమంతరాయ పాకయాజి కవివర్యులు సుప్రసిద్ధులు.
తాతలు జ్యోతిశ్శాస్త్రప్రవీణులు, తండ్రులు పద్మపురాణాంతర్గతమాఘమా
మాహాత్మ్యమును తెనుఁగించి లోకఖ్యాతి గడించిరి. మన కవిశేఖ

సంస్కృతాంధ్రముల నారితేరి సుగ్రీవపట్టాభిషేకము, నిరోష్ఠ్యదాశరథి చరిత్రము, దీక్షిత చరిత్రము మున్నగు గ్రంథముల రచించి స్థిరకీర్తి నార్జింపఁ గల్గిరి.

వీరి ప్రథమపుత్రుఁడు బాలకవి కోదండపాణిశాస్త్రి కడుంగడు లేఁబ్రాయమున గొప్ప కవియై 16 వ సం॥రమున పార్వతీపరిణయ నాటకమును వ్రాసి కీర్తిశేషుఁ డయ్యెను. కుటుంబమును జూచినను, కవిశేఖరుల ప్రతిభను జూచినను లోకాదరణపాత్రు లనుటకు సందియము లేదు. సరళముగను మృదుమధురముగను, భగవద్గీత నాంధ్రీకరించి తాము ధన్యులై లోకమునకు ధన్యత నాపాదింపగల్గిరి. ఆంధ్రీకరణము

శ్లో. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం
ఛందాంసి యస్య పర్ణాని యస్తంవేద స వేదవిత్.

కవిశేఖరుల తెనుఁగు

గీ. అప్పరబ్రహ్మ మూలంబు హారకృతియు మ
హత్తు తన్మాత్ర లా శాఖలవ్యయంబు
శస్త్రవేదపర్ణంబు నశ్వత్థతరువు
విరివిగా నెఱింగినవాఁడు వేదవిదుఁడు.

ఇత్యాది ఘట్టములందు భాష్యమార్గముల ననుసరించి చక్కఁగ నాంధ్రీకరించిరి. కవిజనాదరణము లోపించిన యిక్కాలమున దీని నంకితముగఁ గైకొని కృతిపోషణ మొనర్చిన శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య పంతులు గారి భాషాభిమానమున కిది యొక నవ్యభూషణమై వారిని ధన్యజీవితుల జేయు ననుటకు సందియ ముండదు. ఇట్టి కృతికర్తలును, కృతిభర్తలును విస్తరిల్లి ఆంధ్రదేశాలంకార ప్రాయు లగుదురుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

శ్రీ రాముల సచ్చిదానందశాస్త్రి,

సావిత్రీ గ్రంథమండలి, పూర్ణానందంపేట—బెజవాడ.

---

XV

శ్రీః

నమస్కారములు.

సీ. లలితభావమ్ము తెల్లమ్ము గాఁ బైఁబొంగఁ
బదరత్నముల కూర్పు ♦ భాసిలంగ
నన్వయ కాఠిన్య ♦ మలవడ కుండంగ
స్థిరతరార్థము సుంత ♦ చెడకయుండ
పరుషవాక్యంబుల ♦ స్పర్శంబు లేకుండ
విపరీతభావముల్ ♦ వెలయకుండ
శ్రుతిరసాయనతకుఁ ♦ జ్యుతియె కల్గక యుండ
భక్తిరసం బుట్టి ♦ పడుచు నుండఁ

తే. జేసెను దెనుంగు సత్కవి ♦ శేఖరాబ్బ
రాజహనుమంతరాయ శ ♦ ర్మ కడు నేర
పమరునటు భగవద్గీత ♦ నతులభక్తి
జన్మసాఫల్య మగునట్టి ♦ సరణి మించి.

కడప, ఇట్లు విన్నవించు విధేయుఁడు,

13-7-40. జ॥ శేషాద్రిశర్మ

---

వృష సంవత్సరాశ్వయుజ శు ౩ సౌమ్యవారము అనూరాధనక్షత్రయుక్త మకరలగ్నమున హనుమజ్జననము.



కవిశేఖర

అ. హనుమంతరాయశర్మ పాకయాజి, కృతికర్త.

అ. వేం. కోదండపాణిశాస్త్రి పార్వతీ పరిణయ కృతికర్త.

ఓమ్.

# తొలిపలుకు



క॥ శ్రీ కృష్ణదేవు గీతలు
శ్రీ కృష్ణుం డెద నిలిచి వ•చింపఁగ నే నా
శ్రీ కృష్ణునకై పలికితి
శ్రీకృష్ణుని భక్తులార! • కృపఁ గైకొనుడీ! ౧

క॥ లోకమునకుఁ దెలియంగా
శ్లోకమునకొ భాష్యమునకొ • సులభపదములం
డీకను వ్రాసిన లాగున
వాకొంటిని నే స్తకాని • వాక్కని వినుఁడీ! ౨

క॥ ఒకరిని దీటుటకుం గా
దొకరికి సాటిగనుగాదు • నోపినకరణిఁ
సకలాత్ముఁడు పలికింపఁ బ
లుకవలసెను గృపను సుకవి • లోకము గనుఁడీ! ౩

క॥ మోఁడులు చిగుర్పఁ జేసెడు
వాఁడామనియంచు జాల•వడిఁ గఱఁచెడు రే
ఱేఁడట్లు నెట్లు నేసిన
వాఁడయినను నేరు మెచ్చు•వా రననేలా? ౪

క॥ ఎందఱో వ్రాసిరి గీతల
నందఱిలో నేను బిన్న నౌదుఁ గనుక మీ
రందఱు కొండిక మాటల
విందురు ధన్యుండ నగుదు వేయు నిఁ కేలా ?

తే॥ చింతపలి రామకృష్ణశాస్త్రి ప్రవరుఁడు
గీతలను వ్రాయు మాకుఁ జేయూఁత నిడుట
ప్రాజ్ఞుఁ డయ్యంకి వేంకటరమణ మంత్రి
వ్యాప్తి కూఁత నిడుట నెంతు వారి మేలు.

ఇట్లు బుధ విధేయుఁడు,

కృతికర్త.

# కృతజ్ఞత

శ్రీ హనుమద్గ్రంథమండలి కృతులం బోషించిన

## కృతిభర్తలు

సీ॥ శ్రీ భగవద్గీత • శివభక్తు డయ్యంకి
వేంకటరమణయ్య • విశదయశుఁడు
శ్రీ చోడవరకుల • క్షీరాబ్ధి చంద్రుండు
దేవళరాయండు • దీక్షితకృతి
వరశిష్టకులపద్మ•వనరవి హనుమంత
రాయండు శ్రీ దాశ•రథిచరిత్రి
ఏలులగడ్డ ప•కీరయాభిఖ్యుండు
సుగ్రీవు నభిషేక • శోభనకృతి
శ్రీకృష్ణయాఖ్యుండు • చిన్నకోటయ్యయుఁ
బ్రీతి నారాయణ • నీతికథలు
మా శిష్యబృందంబు • మాఘమాహాత్మ్యంబు
వరహితుల్ పార్వతీ•పరిణయంబు
అచ్చొనొత్తించి యిప్పింప • హర్షమతినిఁ
బ్రచురపఱచితి నే వారి • ప్రబలమైన
ద్రవ్యసాహాయ్యమున; నట్టి • దాతలైన
వారికిఁ గృతజ్ఞుఁడ నటంచుఁ • బలుకువాఁడ.

ఇట్లు,

కృతికర్త.

# కృతిస్వీకారము

శ్రీ వేంకటరమణుని కృప
శ్రీ వేంకటరమణమంత్రి॰ శేఖర! కొని మా
శ్రీ వైకృతగీతా కృతి
శ్రీ వైఖరి నేలుకొనుమ! ॰ సిరులం గనుమా!

ఆయకవులందఱు మును హరి
హయవిభవులు రాజమంత్రు॰ లరసిన గతి మీ
శయమునఁ గృతి నిడు మముఁగని
వియత్తునంటు సిరినలరు॰ వేంకటరమణా!!

# కృతిస్వీకారము

శ్రీ వేంకటరమణుని కృప
శ్రీ వేంకటరమణమంత్రి• శేఖరః కొని మా
శ్రీ వైకృతగీతా కృతి
శ్రీ వైఖరి నేలుకొనుమః • సిరులం గనుమా :

ఆయకవులందఱ మను హరి
హాయవిభవులు రాజమంత్రు • లరసిన గతి మీ
శ్రేయమునఁ గృతి నిడు మమ్ముఁగని
నియత్తునంబు సిరినలదు • వేంకటరమణా !!

శ్రీ రస్తు

శ్రీ భగవద్గీతాకృతిభర్తలు పోషకులు నగు

## శ్రీయుత అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారి

# వంశావళి



కమలాసనాదులును
    జిత్తములం దలపోసి యిట్టి దం
చేకమతంబుగాఁ బలుక
    నించుక యేనియు నేరకుండు రే
లోకము తల్లి పేర్మి నవ
    లోకన మాత్రి సృజించు కార్య మా
లోకము లేలుమాత నెద
    లోనఁ దలంచి నుతించి మించెదన్. ౧

శా॥ శ్రీవ్యాలాప కలాబలాన్విత రసా • ర్ద్ర బ్రహ్మాశబ్దార్థముల్
దివ్యాలోకన భాగ్యమాత్రమున సా • ధింపంగనై భక్తసం
భావ్యంబై సకలార్థ సాధనమునై • మాహేశ్వరం బైన శ్రీ
దివ్యజ్ఞాన మనంత శాంతమును న • ర్థిం గూర్చి కాపాడుతన్

ఉ॥ పుణ్యముఁగోరి క్రుంకులిడు • భూమి జనాఘ మలీమసాంగలౌ
పుణ్యనదీనదాంగనలు • భూరిమతంగకులాంగనాకృతిన్
ధన్యలఁ జేయుఁడీ యని ప్ర • దక్షిణముం బొనరింపు చప్సరః
కన్యలరీతి వెల్గుచును • గన్గొను వారికి వింతఁగొల్పుచున్

మాన్యగతిం జనం జలుపు ♦ మాధవ భక్తకృతాగ్ని
హోత్రము
పుణ్యము బెంపఁ బెంపలరు ♦ భూముల, నిత్య పవిత్రగాత్ర
గణ్యతఁగన్న సాధ్వులను, ♦ గాలికి నెండకు నోర్చుచుం ద
ధన్యతగన్న మానులను ♦ దాల్చిన మాభరతోర్వి నెన్నద
ఉ. ఖండములన్నిఁటన్ భరత ♦ ఖండ మఖండ రమం దలిర్చిర
ఖండల రాజధాని నగుఁ ♦ గాండవనంబుల వెల్లు నందు
ణ్మండల పంక్తిఁగృష్ణయను♦మండల మొప్పెడు దానిలోన
జ్మండలకీర్తిఁ జల్లపలి ♦ మానవనాయకపాలితంబునై.
క॥ అయ్యంకి పురము సిరితో
నెయ్యంబునఁ దేజరిల్లు ♦ నేటిల్లిన యా
యయ్యంకి యింటి పేరున
నయ్యమరాచార్యమేధ ♦ నలరిరి విప్రుల్.
శా॥ ఆ విప్రోత్తములందు శౌనకుని గో♦త్రాంభోధిచంద్రుండు
ద్యావిఖ్యాతచరిత్రుఁ డర్థిజనమం♦దారుండునై మేటి వా
చేవన్ వేంకట రత్నమంత్రి యలరున్♦శేషాంబికార్ధాంగ
భావుండై హరిభక్తితత్పరుఁడు నై ♦ప్రజ్ఞారమాన్వీతుఁడై.
క॥ వేంకట రమణుని శ్రీపద
పంకజభక్తులగు వారి ♦ భక్తిఫలంబా
వేంకట రమణుఁడు గలిగెను
బంకజముఖి సుందరమ్మ ♦ భాగ్యోదయమై.
తే॥ సుందరాంబాముఖాంభోజ♦సూర్యుఁడైన
వేంకటరమణ మంత్రియు ♦ విశదయశులు
శ్రీమహితులైన వేంకట♦రామమంత్రి
సూరి వేంకటరత్నంబు ♦ సుతులఁ గనియె.

వ. ఆ సోదరరత్నంబు లిరువు రందు.

శా॥ శ్రీమద్వేంకటరత్న మంత్రిమణి ప్రా-చీనంపుటాచార సం
స్తోమంబున్విడఁబోక హృణకళయం-దుం బ్రజ్ఞనుంగూర్చి శ్రీ
భామారత్నముఁబోలు మంగమను సం-భావించిప్రేమించియా
పై మాన్యోర్విపతిప్రదత్త మగు నో-వర్సీర్పనిం జేసెఁ దాన్.

సీ॥ రత్నమంత్రి గడింప • రమణి మంగమ పెంప
సంపదలం బెంపు • డింపలేదు
మంత్రిమణి విధింప • మంగాంబ సాధింప
మేలైన పనులకు • మేరలేదు
మాన్యుండు వండింప • మానిని వడ్డింప
లెక్కకు విస్తళ్ళు • చిక్కలేదు
మహితుండు దెప్పింప • విహిత దా నిప్పింప
బొక్కసంబున డబ్బు • లెక్కలేదు
వహవ! యని భూమిజనములు • నహరహంబు
నభినుతింపంగ మంగాంబి-కాత్మనాథుఁ
డైన వేంకటరత్నంబు • మాననీయ
వర్తనంబున నలరారి • కీర్తిఁదనరె. ౧౧

సీ॥ కట్టించె నయ్యంకి • గ్రామాన నే మంత్రి
చంద్రమౌళీశ్వర-స్వామి గుడిని
పెట్టించె నే మంత్రి • పృథులాన్న సత్త్రంబు
తత్ప్రతిష్ఠం జేయఁ • దగిన యపుడు
ఇప్పించె నే మంత్రి • యీశ్వర భక్తిమై
మాన్యంబు లెల్ల వ-దాన్యు లెన్న
మెప్పించె నే సూరి • మిత్రమండలివారి
దీపితోద్యోగంబుఁ • దీర్చునాఁడు

సప్తసంతానముల దీర్పఁ • జాలినాఁడు
హరిహరార్చనలను బొద్దు • జరిపినాఁడు
బ్రాహ్మణారాధనంబులఁ • బ్రబలినాఁడు
రసికజన మైత్రి వేంకట•రత్నమంత్రి. ౧౨

సీ॥ పతికి మాఱాడని • సతియెవ్వరన నీమె
యను నాలుకకు తోడ • యైన సాధ్వి
సతతాన్నదాత్రియా • చాన యేదన నీమె
యని చూపుటకు గుఱి • యైనవెలఁది
మహిత పతివ్రతా•మణి యెవ్వ రన నీమె
యను శబ్దమున కర్థ • మైన సుదతి
పార్వతీశార్చనా•పర యెవ్వ రన నీమె
యని చెప్పటకుఁబాత్రి • మైన పొలఁతి
గీ॥ మొదల హృదయేశు గౌరవ•స్ఫురణ నిలుపఁ
దుదకుఁ బ్రియపుత్రు కీర్తినిఁ • బొదలఁ జేయ
నేర్పమైఁ గూర్మిమై నొప్పు • నెలఁతమిన్న
మాన్య గుణమణినికురంబ • మంగమాంబ. ౧౩

క॥ శ స్తమతి రామమోహన
పుస్తక భాండారమునకు • బుధహర్షముగా
విస్తర రూప్యసహస్రముఁ
బ్రస్తుతి హేతువుగ నొసఁగెఁ • బరగతిఁగన నా. ౧౪

క॥ పంకజముఖి మంగాంబా
వేంకటరత్నములు గనిరి • విజ్ఞాననిధిన్
వేంకటరమణుని లక్ష్మీ
పంకజ నేత్రులు మనోజుఁ • బడసిన కరణిన్. ౧౫

క॥ శ్రీ వేంకట రమణయ్యయుఁ
బావని శేషాంబ ధర్మ•పత్నిగఁ గొని వి
ద్యావిలసితు లగు వారల
మూవురు సుతులం ద్రివర్గ•ముగఁ గని పొదలెన్. ౧౬

వ॥ వా రెవ్వ రంటేని; ౧౭

సీ॥ శ్రీరంగ నాయికాం•బా రాగపాత్రిండు
వేంకటరత్నమ్మ • పెద్దకొడుకు
అనసూయ హృదయేశుఁ • డైన వేంకటకృష్ణ
మూర్తియే రెండవ • పుత్రికుండు
హర్షస్వారాజ్య ల•క్ష్మ్యంబికానాథుండు
శ్రీరంగనాయకుల్ • చిన్నకొడుకు
శస్తగుణులువారు • సద్విద్యలంగూర్చి
తండ్రి యాజ్ఞ మెలంగి • తనరు వారు
గీ॥ నగుచు నుండిరి తండ్రికి • నాత్మజులకు
నెడముగాఁ దల్లి దివ మేఁగ • నెఱుక మెఱయఁ
దండ్రి మహాలక్ష్మిఁ బెండ్లాడఁ • దత్సతియును
స్వర్గ మేగఁ బితామహి • సాకి తేర్చె. ౧౮

వ॥ మఱియు వీరివంశంబునందు. ౧౯

గీ॥ సర్పదష్టుల మంత్రి ప్ర•సక్తిచేత
జీవితులఁ జేయఁగలరు; ని•ర్జీవులుగను
బరగువారల నేని యీ•వంశభవులు
జరగె నటు జరగుచు నుండె • జరుగనుండె. ౨౦

## వేంకటరమణయ్యగారి ప్రశస్తి

ఉ॥ మంగమ వత్సలత్వ గరి♦మం గమకంబుగ జూపి కావఁ బ్రే
మం గమనించి పుత్రులకు♦మంగళముల్ సమకూర్పనో!యనం
గం గమలాక్షి వేడుకతఁ ♦ గైకొన మానిన జ్ఞాని, మాని సె
న్నంగ మదీయవాక్కున క♦నంత యశంబనిశంబుఁ గూర్ప దే

సీ॥ ఆంధ్రావనీస్థలి ♦ నాంధ్రప్రజలఁ గూర్చి
గ్రంథాలయోద్యమ ♦ క్రమము దీర్చె
"ఆంధ్రభారతియు" "గ్రం♦థాలయ సర్వస్వ"
పత్రికాద్వయము, నే♦ర్పడఁగ నడపె
"బాలభటోద్యమ" ♦ ప్రక్రియ నలరించె
విమ"లాంధ్రపరిషత్తు" ♦ విస్తరించె
మహిత "దివ్యజ్ఞాన" ♦ మాన్యసమాజంబుఁ
దీర్చి తత్త్వంబు బో♦ధించి మించె
"ప్రకృతి" పత్త్రిక వ్యాప్తికిం ♦ బ్రథముఁ డయ్యెఁ
దెలుఁగు గ్రంథాలయపుఁ బ్రెస్సుఁ ♦ దీర్చియేలె
రామమోహన లైబ్రరీ ♦ క్షేమకరుఁడు
రసికుఁ డయ్యంకి వేంకట♦రమణ మంత్రి.

ఉ॥ శంకర పాదపంకజ వ♦శంకర వేంకటరత్న మంత్రికిం
బంకరుహాక్షి మంగమకు ♦ మానిత కీర్తి నిఁబెంచి మంచె స
య్యంకిపురాంక వేంకటవ♦రాంకు డహార్య సుతార్య శౌర్యో
ఖాంకములైన సత్క్రియల♦బూనిచి పోషణ సల్పెఁ గీర్తిమై

చం॥ తటుకున కాదనండు నని • తాళుకొనండు చనం డోకండుగాఁ
గటకటయంచు సంకటము • గాంచఁడహంకరణంబునొందఁడ
న్నిటఁబరికించుసత్కవులఁ • నిండుమనంబునఁగాంచుఁబెంచు వేం
కటరమణుండుసత్కృతులఁ•గాంచఁగఁబెంచఁగఁజాలువాఁడగుఙ
కం॥ కై కొనియెను దొలుదొల్తను
పాకృత జీవనవిధాన • వరకృతికన్యన్
శ్రీకృష్ణుని సత్కృప గీ
తాకృతి కన్యఁ గొని యేలెఁ •దత్పరతుండై. ౨౫
తే॥ ఉన్న కాలంబు గ్రంథాల•యోద్యమమున
కఖిల భారత గ్రంథాల•య ప్రయత్న
మునకు విడి స్థాపకుం డయి • పూన్కినెఱపె
నా మహాశ్రమ మంత స•ర్వాత్ముఁ డెఱుఁగు. ౨౬
తే॥ ఆశ్రితాదరుఁడుం బండి•తాదరుఁడయిఁ
గుంద లక్ష్మీనృసింహాది • కోవిదులను
స్వీయ ముద్రాలయమ్మునఁ•జేర్చి పేర్మిఁ
జూప వారు కృతజ్ఞతఁ • జూపి యోర్మి
కార్య నిర్వహణము జల్పి • ఘనత నిడిరి. ౨౭
ఉ॥ శ్రీకరరంగనాయకులు • చెల్వలమిన్న స్వరాజ్యలక్ష్మినిం
గై కయిఁజేర్చి పట్టికొనఁ • గల్గిన పెండ్లిదినంబులందు మా
యాకృతినొందియేలికొను• హేతువుచేతను మువ్వురాత్మజుల్
వైకృతి గీతకన్య బిత్రు•భక్తి మెయిం దనియింత్రు గావుతన్.
ఉ॥ ఇంకను నెన్ని సత్కృతులొ•యీ కరణిం ధరణిం భరింపగా
వేంకటరత్న మంత్రిజుని • విశ్వగుణాన్విత చిత్తవృత్తిలో
వేంకటశైలనాథుఁడుప్ర• వేశమునై తలఁపుల్ ఘటించుతన్
సంకటముల్ హరించుతను•సంపద లిచ్చుతఁగూర్మి నోముతఙ

# కృతిప్రదాన సమయ ప్రశంస

కృతి : శ్రీ హనుమద్భగవద్గీత

కృతిపతి : అయ్యంకి వేంకటరమణయ్య పంతులుగారు.

శ్రీ టకటొంకులాడి యని • శ్రీపతి మాయలవాఁ డటంచుఁ బో
ట్లాటల మీరు మీరనిన • నావ్యవసాయము మాక దేల? ఓ
మాట మిటారి! వారు కృప • మాదృశులైనటువంటి వారలన్
మాటికి గాంచువారని ర • మాకమలాక్షుల భక్తిఁ గొల్చెదన్.

భోజభూపాలుని • భూరి సత్కృతులచే
దండిలోనగువారు • ధనికులైరి
కృష్ణరాయలు మున్ను • కృపను మన్నింపంగ
పెద్దనాదులు కల్మిఁ • బెద్దలైరి
వేమభూమీశుండు • వేయినూటపదార్లు
పంచ సత్కవులు సం • పన్నులైరి
ఆ విజూర్వేదాద్రి • యరసి సన్మానింప
రామకృష్ణులు ధన • రాజులైరి
ప్రాజ్ఞకవులెంతవారైన • భాగ్యశాలు
లైనవారలు దరిఁజేర్చి • యాదరింప
కెట్టు లున్నతిఁగాంతురు? • పట్టులేక
స్త్రీలు లతలు పండితులు వ • ర్ధిల్లఁ గలరె?

దేవళరాయు పోల్కఁగని ♦ దేవళరాయని భక్తరత్నమై,
దేవళరాయశర్మ మము ♦ ధీరుల దారిని నిల్పి సత్కృతిన్
గావఁ గృపార్ద్రచిత్తమునఁ ♦ గామితముల్ సమకూర్చి పేర్మిపైఁ
బైవఱలందగన్ విజయ ♦ వాడకు నీడకుఁ గూడఁ గాఁదగన్. 3

వేడుక నాళ్లనందగిన ♦ పెండ్లిదినంబులఁ బండితావళిన్
గూడుకొనంగనైన ఘన ♦ కోవిదు రాయల రచ్చ పెచ్చునం
గూడిన కొల్వునం గుసుమ ♦ కోమలి "మత్కవితాకుమారి"లోఁ
గూడిన ప్రేమనంది మది ♦ కోర్కులు దీర్చిన మంగమాంబికం
గూడిన రత్నమంత్రిజుని ♦ గోవిదు నే నుతియింతు నీ సభన్. 4

కవితిలకామోద ♦ కవితావిశారద
కనకాంబ యగ్రపీ ♦ ఠిని వసింప
శుభభిషజ్మణి దంటు ♦ సుబ్బావధాన్యాది
సూరిబృందం బండఁ ♦ జేరియుండ
న్యాయాధికారులు ♦ న్యాయవాదులు పూన్కి
నూటపదార్లిచ్చి ♦ నుతులు సల్ప
కవిశేఖరులు మేటి ♦ కవయిత్రులుం గూడి
పేర్మి పద్యాల్ విని ♦ పించుచుండ
"అమృత భాండార" మందు మ ♦ ర్యాదగొంటి
ప్రాజ్ఞుఁడయ్యంకి వేంకట ♦ రమణమంత్రి
సకలవిధముల నీరీతి ♦ సత్కరించె
రంగనాయక కళ్యాణ ♦ రంగసీమ. 5

కొందఱు వేదవేత్తలును • గొందఱు సంస్కృతపండితోత్తముల్
గొందఱు నాంధ్రపండితులు•గొందఱు నాంగ్లకళావిశారదుల్
గొందఱు నన్యులుంగలుగు • గొప్పసభన్ రచియించి మమ్ము నీ
యందఱు సూచి మెచ్చఁ గృతి•నంది నుతించు టదెంతయుం
దగున్. 6

వేంకటరమణుని వేడెద
శంకర సోదరి! అయంకి • సద్వంశ్యుల శ్రీ
వేంకటరమణామాత్యుల
శాంకరులన్ మమ్ము జగము • సాకఁగ వాణీ! 7

నీ కృప విద్యల నంది శు
భాకృతి కృతికన్యకల మ•హాదరమతిమై
వాకొని కవయిత్రులు కవి
లోకము ప్రఖ్యాతిఁ గాంచి • లోన నలరుతన్. 8

విజ్ఞాన సంపదంగల
ప్రాజ్ఞులు సత్కవులఁ గూర్చి • ప్రస్ఫుటకృతు లా
యజ్ఞ జన క్షేమమునకు
యజ్ఞపతిం జెందఁ దాము • నలరింత్రింబా! 9

ఇట్లు,
కృ తి క ర్త.

# విషయసూచిక

# గురుస్తవము



శ్రీమ దలమేలు మంగా
తామరసాక్షీ హృదబ్జ • తామరసాప్తుఁ
శ్రీమచ్ఛేషాచలవర
నామసహితు గురు బుధేంద్రు • నా మది నెంతుఁ.

మహిత పద్మపురాణ సం•భవ విశేష
మాఘమాహాత్మ్య సుకృతి ని•ర్మాణ చణుని
జ్యోతిషకలావిదు నృసింహ • సూరిసుతుని
గీర్తనము సేతు గురువర్యు • గీర్తిధనుని.

శ్రీరాజితు నం. లక్ష్మి
నారాయణదీక్షితేంద్రు • నా హృదయమునన్
శ్రీరామకృష్ణ దీక్షితు
ధీరుని గోటీశ్వరాఖ్య•దీక్షితు నెంతున్.



ఓం

# కోదండపాణి





పరమహంస పరివార ♦ సేవ్యమాన
పార్వతీ పరమేశ్వర ♦ పాదపద్మ
భక్త "వేంకట కోదండ♦పాణి" ధీర
నాయకాగ్రిణి హృన్నళినస్థం జేతు.

# దైవ ప్రార్థనము

నిరోష్ఠ్యము. శ్రీ కృష్ణాకృతి ధారీ!

శ్రీ కృష్ణానందకారి! శ్రితహితకారీ!

శ్రీ కృష్ణచేల చారీ!

శ్రీ కృష్ణ! నగేంద్రధారి! జేజే! జేజే!!.

# అచ్చాంధ్ర నిరోష్ఠ్యరచన

జేజేరాజాజిగిఁగల

జేజే! రేతేనిజాల ♦ జిగిగలిగిన రా

జేజే లందిన జేజే

జేజే! క్రీడిచెలియైన ♦ జేజే! జే! జే!.

# శ్రీకృష్ణ స్తవాదికము

అరుణము గంగావతరణ
భరణము భవహారణమగు సు♦భద్రా ప్త రథా
భరణము చరణము భక్తా
స్తరణముగా నుండుగాత ♦ శరణం బగుతన్.

హ స్తములు మోడ్చు ధార్త రా♦ష్ట్రావళి మద
గజవరారోహకులు వీర♦గాత్రధరులు
నాద్యులును నరనారాయ ♦ ణాంశజాతు
లైన మహితాత్ములకును గృ♦ష్ణాహ్వాయులకు.

కరములు మొగిడ్చి మ్రొక్కెద
నరవరుఁ డై నట్టి నరుని ♦ నారాయణునిం
బరమముని, వ్యాసు గణపతి
సరస్వతినిగూర్చి; జయము ♦ సన్నుతి జేతున్.

## ఆత్మ నమస్కారము

నా వలననే ప్రకాశమా◆నంబు నంది
నేన యానందమయుఁడనై ◆ నిండియుండి
నేన యజ్ఞాన తిమిరంబు ◆ నిస్తరించి
"ఆత్మ" నగు నా కొఱకు మ్రొక్కు ◆ లాచరింతు.

ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ హానుమ ద్భగవద్గీతా మాహాత్మ్యము.

ధరోవాచ:—

శ్లో॥ భగవ న్పరమేశాన భక్తి రవ్యభిచారిణీ
ప్రారబ్ధం భుజ్యమానస్య కథం భవతి హే ప్రభో!

భూదేవి అడుగుచున్నది:—

తే॥ గీ॥ శ్రీశ! పరమేశ! భగవంత! ♦ కేశవ! శివ!
పూర్వ జన్మంబునం దాను ♦ బూనిసేయు
కర్మపుంజ మనుభవింపఁ ♦ గలుగువాని
కే విధిని నిశ్చలపుభక్తి ♦ యేరుపడును? ౧

విష్ణు రువాచ:—

శ్లో॥ ప్రారబ్ధం భుజ్యమానోఽపి గీతాభ్యాసరత స్సదా
స ముక్త స్స సుఖీ లోకే కర్మణా నోపలిప్యతే.

విష్ణుమూర్తి చెప్పుచున్నాఁడు:—

తే॥ గీ॥ నిత్యమును భగవద్గీత ♦ నెఱిఁబఠించు
వాఁడు ప్రారబ్ధముంబొందు ♦ వాఁడయినను
అందు సుఖమును ముక్తి ని♦హంబు నందుఁ
గర్మ బంధంబు లతనికిఁ ♦ గలుగఁబోవు. ౨

శ్లో॥ మహాపాపాది పాపాని గీతాధ్యానం కరోతి చేత్
క్వచిత్ స్పర్శం న కుర్వంతి నళినీదళ మంభసా.

తే॥ గీ॥ గీతలను గోర్కి ధ్యానింప ♦ భూతలమున
నీరు తామరఁ దాకని ♦ తీరుగాను
మొనసి యెపుడు మహాపాప♦ములు మొదలగు
పాపజాలంబు లంటక ♦ పాసిపోవు. ౩

శ్లో॥ గీతాయాః పుస్తకం యత్ర యత్ర పాఠః ప్రవర్తతే
తత్ర సర్వాణి తీర్థాని ప్రయాగాదీని తత్ర వై.

తే॥ గీ॥ పావనపు గీత లున్నట్టి ♦ తావునందు
వానిఁ బఠియింపఁ గల నేల♦పట్టునందు
నా ప్రయాగంబు లోనైన ♦ యట్టి పుణ్య
తీర్థరాజంబు లన్నియుం ♦ దేజరిల్లు. ౪

శ్లో॥ సర్వే దేవాశ్చ ఋషయో యోగినః పన్నగాశ్చ యే
గోపాలా గోపికా వాపి నారదోద్ధవపార్షదైః
సహాయో జాయతే శీఘ్రం యత్ర గీతా ప్రవర్తతే.

తే॥ గీ॥ ఎల్లవేల్పులు యోగులు ♦ ఋషిగణంబు
గోపకులు పన్నగంబులు ♦ గోపికలును
నారదుం డుద్ధవుఁడు హరి ♦ ద్వారపాల
కులును గీతలు గలచోట ♦ మెలఁగుచుంద్రు. ౫

శ్లో॥ యత్ర గీతావిచార శ్చ పఠనం పాఠనం శ్రుతమ్
తత్రాహం నిశ్చితం పృథ్వి నివసామి సదైవ హి.

తే॥ గీ॥ రహిని గీతార్థమును విచా♦రణ యొనర్చు
తావు నందుఁ బఠించెడు ♦ తావు నందు
వినెడుచోటున నటు విను♦పించు చోట
పృథివి! నే నిల్కడగ నుందు ♦ నెల్ల యపుడు. ౬

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి గీతా మే చోత్తమం గృహమ్
గీతాజ్ఞాన ముపాశ్రిత్య త్రీన్ లోకాన్ పాలయా మ్యహమ్.

తే॥ గీ॥ ఎపుడు గీతల నే నాశ్ర♦యించి యుందు
గీతలే నాకు నుత్తమ ♦ గేహ మగును
అమలమైన గీతాజ్ఞాన ♦ మనుసరించి
లీల ముల్లోకములను బా♦లింతు నేను. ౭

శ్లో॥ గీతా మే పరమా విద్యా బ్రహ్మరూపా న సంశయః
అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా.

తే॥ గీ॥ విమల గీతలు పరమమౌ ♦ విద్య నాకు
బ్రహ్మరూపంబు నగుచును ♦ బరగు నద్ది
అర్ధమాత్రాక్షరమ్మ ని♦త్యమును నగును
కడు ననిర్వాచ్య శబ్దాత్మ♦కమును నగును. ౮

శ్లో॥ చిదానందాత్మనా కృష్ణే నోక్తా స్వముఖతోఽర్జునమ్
వేదత్రయీ పరానంద తత్త్వార్థజ్ఞాన మంజసా.

తే॥ గీ॥ శ్రీ చిదానందరూపుఁడౌ ♦ కృష్ణమూర్తి
స్వయముగాఁ బార్థునకు బోధ♦సల్పె మున్న
శ్రుతిపరానంద తత్త్వార్థ ♦ రూపక మగు
జ్ఞాన మతినిష్ఠమై సవి♦స్తరము గాఁగ. ౯

శ్లో॥ యోఽష్టాదశ జపే న్నిత్యం నరో నిశ్చలమానసః
జ్ఞానసిద్ధిం స లభతే తతో యాతి పరం పదమ్.

తే॥ గీ॥ అవని! పదియును నెనిమిద • ధ్యాయములను
శ్లోకములు కదలని మది • చొప్పడంగ
భక్తిఁ బారాయణము సేయు • వాఁ డెప్పుడును
బడయు జ్ఞానపరిసిద్ధిని • బరమ పదము. ౧౦

శ్లో॥ పాఠేఽసమర్థ స్సంపూర్ణే తదర్ధం పాఠ మాచరేత్
తదా గోదానజం పుణ్యం లభతే నాఽత్ర సంశయః.

తే॥ గీ॥ గీత లన్నింటిఁ బఠియింపఁ • జేతగాని
పక్షమునను సగం బైనఁ • బఠనఁ జేయ
మానితంబైన గోవును • దాన మిచ్చు
నట్టి పుణ్యఫలంబును • నందు నిజము. ౧౧

శ్లో॥ త్రిభాగం పఠమాన స్తు గంగాస్నానఫలం లభేత్
షడంశం జపమాన స్తు సోమయాగఫలం లభేత్.

తే॥ గీ॥ ఇందు మూఁడవపాలు పఠి • యించువాఁడు
గంగ మునుఁగు ఫలంబును • గాంచువాఁడు
నిందు నాఱవపాలు పఠి • యించువాఁడు
సోమయాగఫలముఁ గాంచు • సారిది వాఁడు. ౧౨

శ్లో॥ ఏకాధ్యాయం తు యో నిత్యం పఠతే భక్తిసంయుతః
రుద్రలోక మవాప్నోతి గణో భూత్వా వసే చ్చిరమ్.

తే॥ గీ॥ ఒక్క యధ్యాయమును భక్తి • యుక్తుఁ డగుచు
నిత్యముఁ బఠించు నాతండు • నీలకంఠు
లోకమున కేగి యందు నా • లోకనాథు
కింకరులఁ బ్రమథులఁ గూడి • క్రీడ సల్పు. ౧౩

శ్లో॥ అధ్యాయశ్లోకపాదంవా నిత్యం యః పఠతే నరః
స యాతి నరతాం యావ న్మనుకాలం వసుంధరే!

తే॥ గీ॥ ఓవసుంధర! విను మమ్మ • యొకట నన్ను
నమ్మి యధ్యాయపద్యపా•దమ్ము నైన
భక్తిఁ బఠియించువాఁడు మ•న్వంతరంబు
వఱకు మనుజత్వముననుండి • పడయు ముక్తి. ౧౪

శ్లో॥ గీతాయాః శ్లోకదశకం సప్త పంచ చతుష్టయమ్
ద్వౌత్రీ నేకం తదర్ధం వా శ్లోకానాం యః పఠే న్నరః.

తే॥ గీ॥ ప్రతిదినంబును నెవ్వఁడు • పదియుగాని
యేడు నైదును నాల్గేని • మూఁడెకాని
రెండుగాని యొకటిగాని • యొందు నందు
సగమయిన శ్లోకమేగాని • చదువువాఁడు. ౧౫

శ్లో॥ చంద్రలోక మవాప్నోతి వర్షాణా మయుతం ధ్రువమ్,
గీతాపాఠసమాయుక్తో మృతో౽మానుషతాం వ్రజేత్.

తే॥ గీ॥ విధుని లోకంబునను బది•వేలయేండ్లు
నిల్చు గీతలఁ జదువుచు • నేలఁద్రెళ్లె
నేని యవ్వాఁడు దేవత్వ • మెలమిఁగాంచు
వాని బోలినవార లె•వ్వారు లేరు. ౧౬

శ్లో॥ గీతాభ్యాసం పునః కృత్వా లభతే ముక్తి ముత్తమామ్
గీ తే త్యుచ్చారసంయుక్తో మ్రియమాణో గతిం లభేత్.

తే॥ గీ॥ గీతలను నిశ్చలపు భక్తి•చేత నెవఁడు
పూన్కిఁ బఠియించునో వాఁడు • ముక్తిగాంచు,
మరణకాలాన గీతల • స్మరణ సేయు
వాఁడు మంచిగతిం గాంచు•వాఁడు సుమ్ము. ౧౭

శ్లో॥ గీతార్థశ్రవణాసక్తో మహాపాపయుతోఽపివా
వైకుంఠం సమవాప్నోతి విష్ణునా సహ మోదతే.

తే॥ గీ॥ లీల గీతల యర్థమా ♦ లించుటందుఁ
గోర్కెఁగలిగిన యవ్వాఁడు ♦ ఘోరపాప
ములను జేసియు వైకుంఠ ♦ మునకుఁ బోయి
విష్ణుతోడ నానంద ప్ర ♦ విష్టుఁ డౌను. ౧౮

శ్లో॥ గీతార్థం ధ్యాయతే నిత్యం కృత్వా కర్మాణి భూరిశః
జీవన్ముక్త స్స విజ్ఞేయో, దేహాంతే పరమం పదమ్.

తే॥ గీ॥ నిత్యనైమిత్తిక క్రియల్ ♦ నెఱపుచుండి
యెపుడు గీతార్థముం బఠి ♦ యించువాఁడు
బ్రతికియుండియు ముక్తుఁడై ♦ పరఁగుచుండుఁ
దనువు విడునంతఁ "బరమ ప ♦ దమ్ము"నందు. ౧౯

శ్లో॥ గీతా మాశ్రిత్య బహవో భూభుజో జనకాదయః
నిర్ధూత కల్మషా లోకే గీతా యాతాః పరంపదమ్.

తే॥ గీ॥ గీతలఁ బఠించి జనక భూ ♦ నేత లోను
గాఁ గలుగు వారలెల్ల జ ♦ గంబు నందుఁ
బాపదూరు లనెడు పేరు ♦ బడసినారు
నందు మీఁదట ముక్తిని ♦ నందినారు. ౨౦

శ్లో॥ గీతాయాః పఠనం కృత్వా మాహాత్మ్యం నైవ యః పఠేత్
వృథా పాఠో భవే త్తస్య శ్రమ ఏవ ఉదాహృతః.

తే॥ గీ॥ భక్తిమై భగవద్గీతఁ ♦ బఠనఁజేసి
దాని మాహాత్మ్య మెవ్వాఁడు ♦ దలఁపకుండు
వాని పారాయణము ఫల ♦ హీనమైన
దగుటయే గాక శ్రమమాత్ర ♦ మగును సుమ్ము. ౨౧

శ్లో॥ ఏతన్మాహాత్మ్యసంయుక్తం గీతాభ్యాసం కరోతి యః
స తత్ఫల మవాప్నోతి దుర్లభాం గతి మాప్నుయాత్.

తే॥ గీ॥ ధరణి! మాహాత్మ్యయుక్త గీ♦తాపఠనము
సలిపి నటువంటివాఁడు త♦త్ఫలముఁగాంచి
పొందశక్యము గా నట్టి ♦ ముక్తిఁగాంచి
పరమ మైన బ్రహ్మైక్యముఁ ♦ బడయఁగలఁడు. ౨౨

శ్లో॥ మాహాత్మ్య మేత ద్గీతాయా మయా ప్రోక్తం సనాతనమ్
గీతాంతే చ పఠే ద్యస్తు యదుక్తం తత్ఫలం లభేత్.

తే॥ గీ॥ శౌనకాది మహాముని ♦ చంద్రులార!
ఆ పురాతన గీతా మ♦హత్వ మేను
పలికితిని గాన గీతలు ♦ పఠన నేసి
భక్తిఁ దరువాత నిది పల్క ♦ ఫలము గాంచు. ౨౩



# శ్రీ భగవద్గీతాధ్యాయ సంగ్రహము

### ప్రథమాధ్యాయ భావము

తే॥ గీ॥ దైవసంపద్విశిష్ట స్వ • ధర్మపరులు
క్షమ శ్రుతి స్మృతి మార్గ ప్ర • చారకు లగు
ద్విజులు శ్రీభగవద్గీతఁ • దెలియఁదగిన
వార లని ప్రథమాధ్యాయ • భావ మగును. ౧

### ద్వితీయాధ్యాయ భావము

తే॥ గీ॥ జ్ఞాన మలవడు నందాకఁ • గర్మయోగ
పద్ధతు లెఱింగి యీశ్వరా • ర్పణముగాగ
సర్వ కర్మఫలము వీడి • శాంతి నొంది
సౌఖ్య మను జ్ఞానయోగంబుఁ • జలుపవలయు. ౨

### తృతీయాధ్యాయ భావము

తే॥ గీ॥ చిత్తశుద్ధి ఫలత్యాగ • శీలురైన
సాంఖ్యులే జ్ఞాన యోగంబు • సలుపఁ గలరు
బ్రహ్మచర్యము విద్యలం • బడసి భార్యఁ
గూడి కర్మయోగము సల్పఁ • గూడు సిద్ధి. ౩

### చతుర్థాధ్యాయ భావము

తే॥ గీ॥ జ్ఞానము తెఱంగు నాధిక్య • సాధనములు
గుఱు తెఱిఁగి పుట్టి గిట్టుట • లెఱుకగలుగు
వఱకుఁ దప్ప వనుచు నెంచి • భగవదనుప
మానరూపముఁ గనువాఁడు • జ్ఞానయోగి ౪

## పంచమాధ్యాయ భావము

తే॥ గీ॥ జ్ఞానకర్మయోగమ్ముల ♦ సరణులు విని
సంశయించిన శిష్యుని ♦ స్వాంతమునకు
దిటవు నేర్పడ శాస్త్రోప ♦ దేశశాంతి
బ్రహ్మమందుదు, జని లేదు ♦ పార్థ! యనియె. ౫

## షష్ఠాధ్యాయ భావము

తే॥ గీ॥ ఫలము గోరక కర్మలు ♦ సలుపఁ జలుపఁ
జిత్తశుద్ధిని గ్రమముగాఁ ♦ జెందు, నవల
గర్మసన్న్యాస, మా మీఁదఁ ♦ గలుగు జ్ఞాన
యోగ, మట బ్రహ్మభావంబు నొందఁ గలుగు. ౬

## సప్తమాధ్యాయ భావము

తే॥ గీ॥ ప్రకృతిరూపంబు పురుష స్వ ♦ భావ మెఱిఁగి
అన్నిభూతాలు వానిచే ♦ నైన సృష్టిఁ
దెలిసి, భక్తులభేదముల్ ♦ తెలిసి, జ్ఞాని
మార్గమున బ్రహ్మముం జెందు ♦ మానవుండు. ౭

## అష్టమాధ్యాయ భావము

తే॥ గీ॥ దేనిఁ దలఁచుచు మరణింప ♦ దాని రూప
మందుఁ గావునఁ; బ్రణవ త ♦ త్వార్థ మెఱిఁగి
మరణమొందిన బ్రహ్మమా; ♦ మనుగడందుఁ
దలచు నెద్దాని మృతినాఁడు ♦ తలఁచుఁ దాని. ౮

### నవమాధ్యాయ భావము

తే॥ గీ॥ జ్ఞానహీనులు ఘన నిర్వి • కారరూపుఁ
డని యెఱుఁగలేక సగుణుఁడం • చాత్మ నెంతు
రితరచింతలులేక న • న్నొదను నమ్మి
వాని యోగంబు క్షేమంబు • నేన యెంతు.

### దశమాధ్యాయ భావము

తే॥ గీ॥ మహిఁ జరాచర వర్త్యహం • శబ్దవాచ్యుఁ
డనఁగఁ బరగిన "ప్రత్యగా • త్మ" నగు నేను
జ్ఞానమును భూతబీజమ్ము • మాన మాదు;
భూతు లన్నియు నేననె • మురహరుండు.

### ఏకాదశాధ్యాయ భావము

తే॥ గీ॥ అన్నిటం గృష్ణుఁ డున్నయ • ట్లర్జునుండు
హర్షమున విన్నవాఁడని • యాత్మరూప
శక్తిఁజూడంగనెంచు వి • జయునిగూర్చి
"కృష్ణపరమాత్మ" విశ్వంబుఁ • గృపను జూపె.

### ద్వాదశాధ్యాయ భావము

తే॥ గీ॥ జ్ఞానకర్మల నిష్ఠయే • గాని భక్తి
వేఱలేదని యధికార • భేదములను
గుఱు తెఱిఁగి నటియింపఁగాఁ • గూడునంచు
భక్తియోగం బిది యటంచుఁ • బల్కె నయ్యె.

## త్రయోదశాధ్యాయ భావము

తే॥ గీ॥ ఇద్ది క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁ ◆ డీతఁ డంచు,
నాత్మనెఱిఁగి, స్థావర జంగ◆మాత్మక మగు
క్షేత్రములయందు క్షేత్రజ్ఞుఁ ◆ జిత్తమునకుఁ,
దెచ్చి యుభయంబు తానని ◆ తెలియవలయు. ౧౩

## చతుర్దశాధ్యాయ భావము

తే॥ గీ॥ దేహముం గలుగఁగఁ జేయు ◆ త్రిగుణముల, న
తిక్రమించినచో సంసృ◆తిం దరించు
నవల తానైన బ్రహ్మంబు ◆ నా నటంచుఁ
"గృష్ణపరమాత్మ" పార్థున ◆ కెఱుఁగఁ జేసె. ౧౪

## పంచదశాధ్యాయ భావము

తే॥ గీ॥ ఎగువ మొదలును గొమ్మలు ◆ దిగువ కుండి,
అడఁగు మేచెట్టు, తెలియంగ ◆ నైనవాఁడు
గాక మూఁడవదగు నొక్కఁ◆డా "కదలిక"
నగుదు పురుషోత్తమాఖ్యుండ ◆ నగుదు ననియె. ౧౫

## షోడశాధ్యాయ భావము

తే॥ గీ॥ సత్వచిత్తాది గుణాదైవ ◆ సంపదులకు
సంసరణ మోక్షముం బ్రహ్మ◆శక్తిఁ గలుగు
ఆసురీ సంపదం గల్గు ◆ నట్టివారు
పడయుచుందురు సంసార ◆ బంధములను. ౧౬

## సప్తదశాధ్యాయ భావము

తే॥ గీ॥ సాత్త్వికము రాజసము తామ•సమ్ము లనెడు
గుణవిశేషత శ్రద్ధ ము•క్కాలము లయ్యె
ఆత్మ నిర్దిష్ట మోంతత్స•దాదికముగ
సర్వ శ్రుతి విప్ర సవనము•లట్లుపరగె. ౧౭

## అష్టాదశాధ్యాయభావము

తే॥ గీ॥ సర్వ కర్మఫలత్యాగ • శక్తిఁ గలిగి
నన్ను శరణంబు వేడనై • యున్న వాఁడు
పాపమోక్షంబు గను దుఃఖ•భరము వీడు
“నాత్మ” నగు నన్నుఁ బొందు నం•చనె గురుండు. ౧౮



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ హనుమద్భగవద్గీత

## ప్రథమాధ్యాయము



### అర్జున విషాదయోగము

క. శ్రీ వెలయ మెఱయు మెఱపుం
దీవెలయందఁ దగు మొగిలు ♦ తెగ వగ యమునన్
వ్రేవెలదుల బలుమూపుల
నేవేళ మెలంగువాఁడ! ♦ ఇందిరజోడా!.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్.

తే॥ గీ॥ అన్ని యుపనిషత్తుల పిండు ♦ నాలదండు,
హరి పితు కతండు, వత్సంబు ♦ నర్జునుండు,
కమ్మగా నుండు గీతామృ♦తమ్ము మెండు
విమల దుగ్ధంబుగఁ గనుండు ♦ విదులు గొండు.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత? సంజయ!.

తే॥ గీ॥ *సంజయా! పుణ్యభూమి య♦నం జను కురు
భూతలంబునఁ బోరాడఁ♦బోయి యున్న
నా కుమారులు పాండునం♦దనులు నేమి
చేసి యున్నారొ? క్రమముగాఁ ♦ జెప్పు మీవు. ౧

శ్లో॥ దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తథా
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్.

తే॥ గీ॥ ఓయి! ధృతరాష్ట్ర! వినుము దు♦ర్యోధనుండు
స్థిరముగా వ్యూహరూపంబుఁ ♦ జెందియున్న
పాండవానీకముం గాంచి ♦ వరగురుఁ డగు
ద్రోణు కడ కేగి యిటు వల్కెఁ ♦ దోడఁగె నపుడు. ౨

శ్లో॥ పశ్యైతాం పాండుపుత్రాణామాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.

తే॥ గీ॥ గురుతిలక! నీదు శిష్యుండు ♦ గురుమనీషి
యైన ద్రుపదాత్మజుని నేర్పు♦చే నెసంగి
వ్యూహరూపంబుగాఁ జేరి ♦ యున్నయట్టి
పాండవుల గొప్పసైన్యంబుఁ♦బారఁ గనుము. ౩

---

తే॥ గీ॥ *ధర్మబుద్ధిని గలిగించు ♦ ధరణియైన
యా కురు క్షేత్రమును జేరు ♦ నంతలోన
మైత్రి జనియించి యుద్ధంబు ♦ మానుటైనఁ
జరుగు నని ధృతరాష్ట్రుఁ డా♦శ నిటు పలికె.

శ్లో॥ అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాట శ్చ ద్రుపద శ్చ మహారథః.

తే॥ గీ॥ ఇందు శూరులు విలుకాండ్రు • వందిత బలు
లైన భీమార్జునులతో స•మానులైన
వారు ద్రుపదమహీశ మ•హారథుండు
ఘనులగు విరాట యుయుధాను • లనెడువారు. ౪

శ్లో॥ ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజ శ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజ శ్చ శైబ్య శ్చ నరపుంగవః.

తే॥ గీ॥ బలముగల కాశిరాజును, • బార్థివోత్త
ముండు, శైబ్యుండు గుంతి భో•జుండు, ధృష్ట
కేతుఁడును, జేకితానుండు • నీతిశాలి
యైన పురుజిత్తు ప్రముఖులై • యలరువారు. ౫

శ్లో॥ యుధామన్యు శ్చ విక్రాంత ఉత్తమౌజా శ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయా శ్చ సర్వ ఏవ మహారథాః.

తే॥ గీ॥ విక్రముఁడు యుధామన్యుండు • వీర్యవంతుఁ
డుత్తమౌజుండు, ద్రౌపదే•యులు, సుభద్ర
యనుఁగు కొమరుండు నభిమన్యుఁ • డనెడువాఁడు
నందఱు మహారథులు గాఁగ • నడరువారు. ౬

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ!
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే.

తే॥ గీ॥ ద్విజకులోత్తమ! నా సైన్య•బృందమందు
నాయకులుగాఁ బేరిమి • నాకుఁ గూర్పఁ
గోరు ఘనులగు వారలం • గుఱుతు కొఱకు
విన్నవించెద నాలింపు • వేడ్కతోడ. ౭

శ్లో॥ భవాన్ భీష్మ శ్చ కర్ణశ్చ కృప శ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః.

తే॥ గీ॥ నీవు, భీష్ముండు, రణజయా ♦ న్వితుండైన
కృపుండు, కర్ణ, వికర్ణ, భూ ♦ రిశ్రవులును
నీ కొడుకుం దీసిపో నట్టి ♦ నెఱసరు లయి
యున్న వారు మహారథు ♦ లన్న వారు. ౮

శ్లో॥ అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః.

తే॥ గీ॥ అన్యు లీంక బహుశూరు లా ♦ హవకుశలులు
సర్వశస్త్రాస్త్రపాణులై ♦ సంగరమున
నా కొఱకుం బ్రాణములు వీడ ♦ నడుముంగట్టి
పోర సిద్ధంబుగా నున్న ♦ వార లిందు. ౯

శ్లో॥ అపర్యాప్తం త దస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్.

తే॥ గీ॥ * చాలియుండదె ? నాదైన ♦ సర్వబలము
ప్రథిత తేజుం డయిన భీష్మ ♦ పాలిత మయి;
చాలియున్నదె ? తద్భీమ ♦ పాలిత మయి
పాండవులయొక్క సైనిక ♦ మండలంబు. ౧౦

---

* తే॥ గీ॥ భీష్ముచేం గొట్టం బడకుండ ♦ భీముచేత
నేలంబడు సేన మన కేమి ♦ చాలకుండు
భీముచేం గొట్టంబడియును ♦ భీష్ముచేత
నేలబడు సేన మన కెంతో ♦ చాలియుండు.

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మ మేవాభిరక్షన్తు భవన్త స్సర్వ ఏవ హి.

తే॥ గీ॥ మొగ్గరము సొచ్చుదారుల ♦ మొనలయందు
మీకు నియమిత మగుచోట్ల ♦ మీరు నిలిచి
యంద ఱతిజాగరూకత ♦ నవధరించి
కాచుకొనియుండఁ దగును గం♦గాతనూజు. ౧౧

శ్లో॥ తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చై శ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.

తే॥ గీ॥ ఆ సుయోధనునకు ముదం ♦ బావహించి
యినుమడింపంగఁ గురువృద్ధుఁ♦డును ప్రతాప
వంతుఁడు పితామహుండు తీవ్రముగ సింహ
నాద మొనరించి శంఖంబు ♦ నూదె నపుడు. ౧౨

శ్లో॥ తత శ్శంఖా శ్చ భేర్య శ్చ పణవానక గోముఖాః
సహసై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్.

తే॥ గీ॥ తడయ కంతట శంఖముల్ ♦ తప్పెటలును
ఘోరముగ భేరు లుడుకలు ♦ గోముఖములు
మొదలుగాఁగల వాద్యముల్ ♦ మ్రోగఁజేయఁ
బడియె నంతటఁ దద్ధ్వని ♦ ప్రబల మయ్యె. ౧౩

శ్లో॥ తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.

తే॥ గీ॥ తెల్లగుఱ్ఱాలఁ దగు గొప్ప ♦ తేరుమీఁదఁ
గూరుచుండిన పాండుకు♦మారుఁడైన
యర్జునుండు గృష్ణుండు ది♦వ్యంబులైన
రెండు శంఖంబు లూని పూరించి రంత. ౧౪

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః.

తే॥ గీ॥ పాంచజన్యంబు రుక్మిణీభర్త యొత్తె
దేవదత్తంబు విజయుండు • తీర్చి యొత్తెఁ
బౌండ్రనామకశంఖంబుఁ • బాణి హత్తి
భయదకర్ముండు భీముఁ డే • ర్పడఁగ నొత్తె. ౧౫

శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవ శ్చ సుఘోషమణిపుష్పకౌ.

తే॥ గీ॥ రాజు కుంతీసుతుండు ధ • ర్మజుఁ డనంత
విజయము, సుఘోషమణిపుష్ప • వినుత రావ
ములగు శంఖద్వయము మాద్రి • పుత్రులైన
నకుల సహదేవు లొత్తిరి • ప్రకటముగను. ౧౬

శ్లో॥ కాశ్య శ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః.

తే॥ గీ॥ ఘనతర ధనుర్ధరుం డగు • కాశిరాజు
నధిక బలుఁడు మహారథుఁ • డగు శిఖండి,
ఆ విరాట ధృష్టద్యుమ్ను • లనెడువారు,
శత్రువుల కోడి పాఱని • సాత్యకియును. ౧౭

శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయా శ్చ సర్వశః పృథివీపతే
సౌభద్ర శ్చ మహాబాహు శ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్

తే॥ గీ॥ ద్రుపదుఁ, డాతని మనుమ లై • దుగురు, జాను
మూలములఁదాఁకు జేతులం • గ్రాలువాఁడు
నైన సౌభద్రుఁ, డందఱుం • దందు నిల్చి
వేరు శంఖంబు లూదిన • వార లైరి. ౧౮

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్.

తే॥ గీ॥ పాండవులు సేనలుంజేయు • పరిబలశంఖ
ముల మహారావ మాకాశ • భూతలముల
దద్దరిల్లంగఁజేసి నీ • తనయులకును
గుండెపట్టుల బ్రిద్దలు • గొట్టె సుమ్ము. ౧౯

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః
హృషీకేశం తదా వాక్య మిద మాహ మహీపతే.

తే॥ గీ॥ ఆంబికేయ! భవత్తన•యాళిఁ జూచి
శస్త్రములను బ్రయోగించు • సమయమందు
ధనువు నెక్కిడుచుం గపి•ధ్వజుఁడు నంత
నింద్రియాధీశు కృష్ణుతో • నిట్లు పల్కె. ౨౦

శ్లో॥ సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత
యావ దేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్
కై ర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే.

తే॥ గీ॥ అచ్యుతా! సంగరారంభ • మందు నేను
నెవరితోఁ బోరవలయునో • యెఱుఁగువఱకు
బవరమున నిల్చు నీ యిరు•వాగులకును
నడుమ నిల్పంగదయ్యా! యీ • నా రథంబు. ౨౧-౨౨

శ్లో॥ యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః.

తే॥ గీ॥ క్రూరుఁడౌ దుష్టబుద్ధి దు•ర్యోధనునకుఁ
బ్రియముఁ గూర్పంగవచ్చిన • వీరవరులు
యోధవరు లగు వారిని • యుద్ధమునకు
ముందుగా నందఱను గనుఁ•గొందుఁ గాక. ౨౩

శ్లో॥ ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత!
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్.

తే॥ గీ॥ వినుము ధృతరాష్ట్ర! కృష్ణుతో • విజయుఁ డట్టు
లనిన యంత హృషీకేశుఁ • డచటఁగల్గు
నుభయ సేనల మధ్య ర•థోత్తమంబు
నిలిపి నటువంటి వాఁ డయి • పలికె నిట్లు. ౨౪

శ్లో॥ భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి.

తే॥ గీ॥ ద్రోణ భీష్మాదులైన యో•ధులకు నెదుట
నిలుప నయ్యె రథోత్తమ • మెలమి పార్థ!
కౌరవసమూహముల నెల్లఁ • గలయు నట్లు
పొడఁగనఁగదయ్య! నీవు సం•పూర్ణదృష్టి. ౨౫

శ్లో॥ తత్రాఽపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీం స్తథా.
శ్వశురాన్ సుహృద శ్చైవ సేనయో రుభయో రపి.

తే॥ గీ॥ అంతటం బార్థుఁ డిరువాగు • లందు నుండు
తాత తండ్రుల గురువుల • మాతులులను
నన్నదమ్ములఁ గొడుకుల • ననుగుకాండ్ర
మనుమలను మిత్రతతుల మా•మలను గనియె. ౨౬-౨౭

శ్లో॥ తాన్ సమీక్ష్య స కౌంతేయ స్సర్వాన్ బంధూ నవస్థితాన్
కృపయా పరయాఽవిష్టో విషీద న్నిద మబ్రవీత్.

తే॥ గీ॥ అర్జునుం డటు మీఁదట • నచటనున్న
సకల బంధు జనంబుల • జక్కఁ గాంచి
సదయహృదయుఁడై వారికై • జాలి నొంది
కడఁగి కన్నీరు మున్నీరు • గాఁగఁబలికె. ౨౮

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథు శ్చ శరీరే మే రోమహర్ష శ్చ జాయతే.

తే॥ గీ॥ కృష్ణ! యుద్ధముసేయఁగా • నిచటఁజేరి
నట్టి నా వారిఁ జూడ నా • యవయవములు
పట్టుఁ దప్పుచు నున్నవి • వదన మెండి
పోవుచున్నది వణకును • బులక లెగసె. ౨౯

శ్లో॥ గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే
నచ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః

తే॥ గీ॥ జారుచున్నది విల్లు హ ♦ స్తంబునుండి
యెత్తుచున్నది పరితాప ♦ మెల్ల మేనఁ
గాకయున్నది నిలువ శ ♦ క్యంబునాకు
సంభ్రమించుచు నున్నది ♦ స్వాంత మంత. 30

శ్లో॥ నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ!
నచ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజన మాహవే.

తే॥ గీ॥ తొలుతఁ గనుచుంటిఁ గేశవ! ♦ దుర్నిమిత్త
ములు స్వబంధుల నీ యుద్ధ ♦ భూమిఁ జంపి
నంతనే కల్గబోయెడు ♦ నట్టిలాభ
లేశముం జూడకున్నాఁడ ♦ లెమ్మిఁ కేల? 31

శ్లో॥ న కాంక్షే విజయం కృష్ణ! నచ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన? గోవింద! కిం భోగై ర్జీవితేన వా!

తే॥ గీ॥ కృష్ణ! గోవింద! జయముఁ గాం ♦ క్షింపలేదు
రాజ్యసుఖములనేని కో ♦ రంగలేదు
రాజ్యభోగంబులంగాని ♦ బ్రతుకువలన
నేని మాకుఁ బ్రయోజనం ♦ బేమి కలదు? 32

శ్లో॥ యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ

తే॥ గీ॥ ఎవరికొఱకే ప్రసిద్ధమౌ ♦ నెల్లరాజ్య
భోగసుఖములు కాంక్షించి ♦ పొందఁగలమొ
వారు ప్రాణధనంబుల ♦ వదలిపెట్టి
యుద్ధమున కిదె సిద్ధమై యున్నవారు. 33

శ్లో॥ ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః
మాతులాశ్శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సంబంధిన స్తథా

తే॥ గీ॥ గురువులును దాత తండ్రులు • కొడుకుఁ గుఱ్ఱ
లటులనే మేనమామలు • స్యాలకులును
మామ లైనట్టివారలు • మనుమలైన
వారు సంబంధులైనట్టి • వారు వీరు. 3౪

శ్లో॥ ఏతాన్న హంతు మిచ్ఛామి ఘ్నతో౽పి మధుసూదన
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్ను మహీకృతే.

తే॥ గీ॥ పగఱచేతను జంపంగఁ•బడిన నేని
వారిఁ జంపంగఁ గోరెడు • వాఁడఁగాను;
పుడమి యేల్బడికే కాదు • ముజ్జగముల
యేలుఁబడి కారణంబైన • నేమి కృష్ణ! 3౫

శ్లో॥ నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన!
పాప మేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః.

తే॥ గీ॥ ఓ జనార్దన! మనము దు•ర్యోధనాది
కౌరవానీకముం జంపఁ•గలదె ప్రీతి?
*ఆతతాయు లయిన వీరి • హత మొనర్ప
నెంచఁ బాపంబె మన నాశ్రి•యింపఁ గలదు. 3౬

తే॥ గీ॥ * ఇంట నిప్పంచుట విషమ్ము • నిడుటయేని
చేతఁ గ త్తినిదాల్చి హిం•సించుటేని
స్త్రీ ధరిత్రీ ధనాళి హ•రించుటేని
ఆతతాయుల లక్షణా•లౌఱ నగును.

శ్లో॥ తస్మాన్నార్హావయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ!

తే॥ గీ॥ అట్టికారణమున, మాధ◆వా! మన మికఁ
జుట్టములతోడి ధార్తరా◆ష్ట్రులను జంప
నెట్టులైనను దగ మని ◆ యెఱుఁగు మప్పు
డిట్టివారిఁ దునిమి సుఖి◆యింపఁ గలమె?. ౩౭

శ్లో॥ యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.

తే॥ గీ॥ ఓ జనార్దన! పేరాస ◆ నుంటఁ జెడిన
తలఁపుఁ గల వీరు నిజకుల ◆ విలయమునను
గలుగు దోషమ్ము మిత్రులఁ ◆ గలఁచుట నగు
పాపముం గుఱు తెఱుంగని ◆ వారలైరి. ౩౮

శ్లో॥ కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్
కులక్షయ కృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన!.

తే॥ గీ॥ కాని కులనాశనంబునం ◆ గలుగుదోష
మెఱిఁగి నటువంటి మనచేత ◆ నీ కలుషము
నుండి తప్పించుకొనుట యె◆ట్లో? యెఱుంగఁ
బడక యున్నదిగా? మాధ◆వా! తలంప. ౩౯

శ్లో॥ కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత.

తే॥ గీ॥ కులము నశియింపఁ బూర్వుల◆వలన నడుపఁ
బడు సనాతనధర్మముల్ ◆ చెడఁగ నౌను;
ధర్మములు నశియించిన ◆ దానివలనఁ
గులము నెల్ల నధర్మ మె◆క్కుడుగ నలము. ౪౦

శ్లో॥ అధర్మాభిభవా త్కృష్ణ! ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ! జాయతే వర్ణసంకరః

తే॥ గీ॥ కుల మధర్మముపాలయి • కూల, వృష్ణి
కులుఁడ! చెడిపోవుదురు గదా? • కులము సతులు;
కులము కులకాంతలుం జెడఁ • బలుకవలెనె
వర్ణసంకర మౌనని • వరుస తోడ. ౪౧

శ్లో॥ సంకరో నరకా యైవ కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః.

తే॥ గీ॥ కులముఁ జెఱిచినవారికిఁ • గులమునకును
నరకమే ప్రాప్త మగును; సంతతటనువారి
పితృగణంబులు లోపించు • పిండతర్ప
ణములు గల్గి యధోగతి • నడువఁగలరు. ౪౨

శ్లో॥ దోషై రేతైః కులఘ్నానామ్ వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః.

తే॥ గీ॥ వంశ నాశన కరులైన • వారియొక్క
వర్ణసంకర కారకుల్ • ప్రబలదోష
సంచయంబులచేత శాశ్వతములైన
జాతి కులధర్మములు సెడు • సంతతంబు. ౪౩

శ్లో॥ ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన!
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ.

తే॥ గీ॥ ఓ జనార్దన! నశియించు • చుండిన కుల
ధర్మములు గల నరులకు • దప్పకుండ
ననిశ నరకనివాసంబు • నబ్బునంచు
విబుధజనముల వలనను • విందుముగద!. ౪౪

శ్లో॥ అహో! బత! మహ త్పాపం క ర్తుం వ్యవసితా వయమ్
య ద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః.

తే॥ గీ॥ ఏ మహారాజ్య సుఖముల • యెడలఁగలుగు
పెద్ద కోర్కిని జుట్టాలఁ • బిలుకుమార్పఁ
దలఁచితిమొ దాననే మహా• త్తరపుఁబాప
మరయకే చేయఁ బూనితి • మక్కటకట!!. ౪౫

శ్లో॥ యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధా ర్తరాష్ట్రా రణే హన్యు _స్తన్మే క్షేమతరం భవేత్.

తే॥ గీ॥ అప్రతీకారుని నశ స్త్రుఁ•డైన నన్ను
శస్త్రపాణులు ధా ర్తరా•ష్ట్ర పరిముఖులు
కదనమునఁ జంపిరేని య•య్యదియు నాకు
క్షేమకర మగు గాదె శ్రీ • కృష్ణదేవ! ౪౬

సంజయ ఉవాచ—.

శ్లో॥ ఏవ ముక్త్వాఽర్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః.

తే॥ గీ॥ సమరధరణిని నిటువల్కి • సశరచాప
మవలఁ బోవంగ వీడి శో•కాకులాత్ముఁ
డగుచు నర్జునుఁ డే మన! • నరద మందుఁ
జతికిలంబడె నాశ్చర్య•సరణిదోఁప.

తే॥ గీ॥ విపుల పురుషార్థములుగల్గు ♦ నుపనిషత్తు
బ్రహ్మతత్త్వంబు బోధింప ♦ బ్రహ్మవిద్య
యొప్పి జీవాత్మసంబంధ ♦ యోగశాస్త్ర.
మచ్యుతార్జున సంవాద♦మైనయట్టి
వ్యాసభగవానుఁ డా నాఁడు ♦ వ్రాయఁదొ_త్త
సమరభాషాభిరామంబు ♦ నై చెలంగు
భగవదు_క్తగీతలు తెల్గు ♦ వ్రాయనైన
అ. హనుమద్భగవద్గీత ♦ లయ్యె నేఁడు.

ఇది ప్రథమాధ్యాయము



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ హనుమద్భగవద్గీత

## ద్వితీయాధ్యాయము

### సాంఖ్యయోగము

సంజయ ఉవాచ—

శ్లో॥ తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః.

తే॥ గీ॥ అట్లు కనికర ముల్లంబు • నందుఁ బుట్టి
హత్తియుండ విషాదంబు • నంది నిండు
కడఁది కన్నీట వ్యాకులే•క్షణుఁడునైన
విజయుఁగని మధువైరి యివ్విధినిఁ బలికె.

శ్రీభగవా నువాచ—

శ్లో॥ కుత స్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున!

తే॥ గీ॥ అర్జునా! స్వర్గ మందింప•నట్టిది, యప
హర్ష మపకీర్తి దాయకం • బైనదియు, న
శక్తిఁ బామరుఁ డొందంగఁ • జాలిన దగు
పాడుమోహంబు నిన్నెట్లు • పట్టె నిపుడు.

శ్లో॥ క్లైబ్యం మాస్మగమః పార్థ! నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!.

తే॥ గీ॥ పగఱఁ దపియింపఁ జేసెడు ♦ వాఁడవైన
పార్థ! మగటిమి లేమిని ♦ బడయ కెపుడు;
పొందరాని యధైర్యంబుఁ ♦ బూన కిట్టి
గుండెపిఱికితనము వీడి♦ గొమ్ము లెమ్ము. 3.

అర్జున ఉవాచ—

శ్లో॥ కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన!.
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన!

తే॥ గీ॥ మధునిషూదన! శత్రుసం♦హార! శౌరి!
పూజ్యులగు ద్రోణ భీష్ముల ♦ భూరి యుద్ధ
భూమి బాణంబులం జేతఁ ♦ బూని యెదిరి
యెట్లు పోరెద నంచుఁ దా ♦ నిట్లు పలికె. ౪.

శ్లో॥ గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్య మపీహ లోకే
హత్వాఽర్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్.

తే॥ గీ॥ అచ్యుత! మహానుభావు లై ♦ నట్టి గురుల
నడఁప కిహమున భిక్షాన్న ♦ మైన మేలు
భూరి ధనకాంక్షఁగల గురు♦వులను బూని
తునిమి నెత్తురుకూడును ♦ దిను టదెట్లు? ౫

శ్లో॥ నచైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యదివా నో జయేయుః
యా నేవ హత్వా న జిజీవిషామ
స్తే౽వస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః.

తే॥ గీ॥ కౌరవులు గెల్తురో? లేక ♦ కౌరవుల జ
యింతుమో? యెద్ది శ్రేష్ఠమై ♦ యెసఁగు నొక్కొ!
యెఱుఁగ మెవరిని జంపి మ♦హీతలమున
నుండగోరమొ? వారె ముం♦దుండినారు.

శ్లో॥ కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢ చేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్య స్తే౽హం శాధి మాం త్వాం ప్రపన్నమ్.

తే॥ గీ॥ మచ్చరపు దోసమున నెల్ల ♦ మార్పుఁజెంది
నెఱి నెఱుంగని కొఱమది ♦ నిన్నడిఁగెద
యేది శ్రేయస్కరమొ నిశ్చ♦యించిపల్కు
శిష్యుఁడను నీకు శరణంటి ♦ శిక్ష సేయు.

శ్లో॥ న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమా వసపత్న మృద్ధం
రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్.

తే॥ గీ॥ పగఱ నెఱుఁగని భూరాజ్య♦పదవి యేని
ప్రబలమా దేవలోకాధి♦పత్యమేని
చెంది యింద్రియములను శో♦షింపఁజేయు
శోకము నడంచుఁదానిగా ♦ జూడ నెతి.

సంజయ ఉవాచ—

శ్లో॥ ఏవ ముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ.

తే॥ గీ॥ పగఱం దపియింపఁ జేసెడు ♦ పార్థుఁ డప్పు
డీ విధంబునఁ బలికి శ్రీ ♦ కృష్ణుతోడ
సంగరంబును జేయంగఁ ♦ జాల నంచు
నుచ్చరించుచు నయ్యెడ ♦ నూరకుండె. ౯

శ్లో॥ త మువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదం వచః.

తే॥ గీ॥ భరతకులవర్య ! విను మిఱు ♦ వాఁగులకును
నడుమ శోకించుచుండిన ♦ నరుని గూర్చి
యింద్రియాధీశుఁ డగు కృష్ణుఁ ♦ డిట్టు లనియెఁ
బరిహాసనముం బొనర్చిన ♦ వాఁడు వోలె. ౧౦

శ్రీభగవా నువాచ—

శ్లో॥ అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాం శ్చ భాషసే
గతాసూ నగతాసూం శ్చ నానుశోచంతి పండితాః.

తే॥ గీ॥ ఏడ్వఁ దగనట్టి వారికై ♦ యేడ్చుచుంటి
వన్నియుం దెలిసిన లాఁగు ♦ నాఁడుచుంటి
పండితులు ప్రాణములు పోవు ♦ వారిఁగూర్చి
కలుగువారిని గూర్చి శో♦కమును గనరు. ౧౧

శ్లో॥ న త్వేవాఽహం జాతు నాసం నత్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్.

తే॥ గీ॥ *లే నొకప్పుడు ననుటయే ♦ లేదు నేను
లే వొకప్పుడు ననుటయే ♦ లేదు నీవు
లే రొకప్పుడు ననునది ♦ లేదు వారు
లే మొకప్పుడు ననునది ♦ లేదు మనము. ౧

శ్లో॥ దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి.

తే॥ గీ॥ పార్థ! కౌమార యౌవన ♦ వార్ధకములు
నెట్లు కలుగునో? దేహికి ♦ నీ తనువున
నటుల దేహాంతరప్రాప్తి ♦ యగుచునుండు;
నందులకు ధీరుఁడెపుడు మో♦హంబు గనఁడు. ౧

శ్లో॥ మాత్రాస్పర్శా స్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగ మాపాయినోఽనిత్యా స్తాం తితిక్షస్వ భారత.

తే॥ గీ॥ ఓయి కౌంతేయ! భారత! ♦ యొడలు గలుగు
నన్నినాళ్లింద్రియపు విష♦యాళివలనఁ
గలుగు శీతోష్ణ సుఖదుఃఖ♦ములును గాని
యెప్పు డుండవు సహియింపు ♦ మీవు వాని. ౧

---

శం॥ భా॥ * తే॥ గీ॥ నేను నీవును వీరును ♦ నిత్యులమయి
రా॥ భా॥ యన్నికాలంబులం దేక♦మైన యాత్మ
మ॥ భా॥ రూపమున నుండి బహుజీవ ♦ రూపములను
వేఱుగాఁ దోఁచుచుందుమీ ♦ తీరుగాను॥

శ్లో॥ యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ!
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే.

తే॥ గీ॥ పురుషవర! యెవ్వనిని శబ్దములును, స్పర్శ,
రూప, రస, గంధములు నేర్చ నోప; వావి
వేకి సుఖదుఃఖ సమభోగి; వెలయ మోక్ష
మొందఁదగు వాఁడటంచు లో నూహ సేయు. ౧౫

శ్లో॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టోఽన్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః.

తే॥ గీ॥ కల్ల యగు మేని కెందు నిల్కడయ లేదు
సత్యమగు నాత్మ కెపుడు నాశంబులేదు
కల్ల నిజముల నిశ్చయకారణములు
బ్రహ్మవిదులైనవార లేర్పడఁగఁ గందు్రి. ౧౬

శ్లో॥ అవినాశితు తద్విద్ధి యేన సర్వ మిదం తతమ్
వినాశ మవ్యయ స్యాస్య న కశ్చి త్కర్తు మర్హతి.

తే॥ గీ॥ *దేనిచే విశ్వమంతయుఁ దేజరిల్లు
నదియె బ్రహ్మము నశియింప దని యెఱుంగు
మవ్యయంబైన బ్రహ్మంబు హతము సేయఁ
జాలు వస్తువు వేఱొండు శమను లేదు. ౧౭

* శం॥ భా॥ సర్వసారోపనిషత్తు } తే॥ గీ॥ జ్ఞానము ననంతమును సత్యమైనయట్టి
బ్రహ్మ మవినాశియగు కాలవస్తుదేశ
సృష్టమైన జగంబు నశించినను న
శించ దవినాశి బ్రహ్మంబు స్థిరమునగుట.

శ్లో॥ అంతవంత ఇమే దేహా నిత్య స్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మా ద్యుధ్యస్వ భారత.

తే॥ గీ॥ అప్రమేయుండు నిత్యుండు ♦ నవ్యయుండు
నగును దేహి; శరీరంబు ♦ లన్ని కూడ
క్రమముగా నాశమై పోవఁ ♦ గలుగు గాన
కదన మొనరింపఁగా నీవు ♦ కడగి లెమ్ము. ౧౮

శ్లో॥ య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్,
ఉభౌ తౌ నవిజానీతో నాయం హన్తి న హన్యతే.

తే॥ గీ॥ చంపునది యాత్మ యొకనిచేఁ ♦ జంపఁబడును
దంచుఁ బల్కెడు వారిద్ద♦ఱాత్మ తత్వ
మరయనటువంటి వారౌదు♦రనఁగవచ్చు
చంపునదిగా దొకప్పుడు ♦ చంపఁబడదు. ౧౯

శ్లో॥ న జాయతే మ్రియతే వా కదాచి
న్నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే.

తే॥ గీ॥ ఆత్మ పుట్టుట గిట్టుట ♦ యనుటలేదు
నొక్కతఱిఁ బుట్టి చచ్చుచు ♦ నుండబోదు
మొదటనుండక క్రొత్తగా ♦ మొలువ లేదు
పుట్టిగిట్ట దొడలు తోడఁ ♦ బోలఁబోదు
నిలుకడగ నుండి ప్రాచీనతద్దై ♦ నివ్వటిల్లు. ౨౦

శ్లో॥ వేదాఽవినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్.
కథం స పురుషః పార్థ! కం ఘాతయతి హంతి కమ్.

తే॥ గీ॥ ఆత్మ పుట్టదు తఱుగదు ♦ నడగిపోదు
నిలుకడగ నుండు సంచును ♦ తెలియు నెవ్వ
డట్టి పురుషన శేణ్యుండు ♦ నరయ నెట్లు
చంపఁగలుగును నే రీతి ♦ చంపఁజేయు. ౨౧

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ.

తే॥ గీ॥ నరుఁడు చిఱిఁగిన బట్టలఁ ♦ బరగ విడిచి
క్రొత్తబట్టల వేఱుగాఁ ♦ గొన్నకరణి
నాత్మ సడలిన మేనుల ♦ నవల నడఁచి
క్రొత్త లగు మేనులం దాల్చు♦కొంచు నుండు. ౨౨

శ్లో॥ నైనం ఛింద న్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః.

తే॥ గీ॥ నఱుకఁజాలవు కత్తు లె♦న్నండు నాత్మఁ
గాల్పఁజాలదు తుదముట్టఁ ♦ గాను నగ్ని
ముంపఁజాలదు స ప్త స♦ముద్రజలము
వట్టి యెండింపఁ జాలదు ♦ వాయు వేని. ౨౩

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ
మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్యః సర్వగతః స్థాణు
రచలోఽయం సనాతనః.

తే॥ గీ॥ పడదు నఱుకంగఁ గాల్పంగఁ • బడదు తడుపఁ
బడదు నెండింపఁ బడదు, ని•ల్కడను నెల్ల
యెడల వ్యాపించి, కదలక • యెట్టిమార్పుఁ
గనక పాఁతదియై యెప్డు • కాఁలు నాత్మ. ౨౪

శ్లో॥ అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నాఽనుశోచితు మర్హసి.

తే॥ గీ॥ కన్ను మొదలైనవానికిఁ • గానఁబడదు
తలఁపునం దిట్టి దని యెంచ • నలవిగాదు
నే వికారము వొంద దం • చెఱిగి నపుడ
దానిని గుఱించి శోకింపఁ • గాను దగదు. ౨౫

శ్లో॥ అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాఽపి త్వం మహాబాహో! నైవం శోచితు మర్హసి

తే॥ గీ॥ ఆత్మ యెప్పుడు పుట్టున • దందు వేని
దాని చావును నిజమని • తలతు వేని
యింక నటులైన నీ విప్పు • డీ పగిదిని
శోకమున కర్హుఁడవు కావు • లోకవినుత. ౨౬

శ్లో॥ జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి.

తే॥ గీ॥ పుట్టునటువంటి దానికి • గిట్టుటయును
గిట్టునటువంటి దానికిఁ • బుట్టుటయును
దప్ప నటువంటి వానిగఁ • దలఁతు వేని
తప్పనట్టి విధికి నేడ్వఁ • దగదు నీకు. ౨౭

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా.

తే॥ గీ॥ మొదలు గనుపడ నటువంటి • భూతగణము
నడుమఁ గనుపడునటువంటి • నడక నడరి
తుదయుఁ గనుపడ కరుగు నే•త్రోవ నెటకో
అట్టిదాని విషయ మేడ్వ • నర్హమగునె. ౨౮

శ్లో॥ ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చి దేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్య వచ్చైన మన్యః శృణోతి
శ్రుత్వా ప్యేనం వేద నచైవ కశ్చిత్.

తే॥ గీ॥ కనును నొక్కఁడు వింతగా • గ్రాలు నాత్మ
ననును నొక్కఁడు వింతయౌ • నాత్మఁ గూర్చి
వినును నొక్కఁడు నట్టి యా•త్మను గుఱించి
చనును నెవ్వండుఁ దత్వంబుఁ • గనఁగలేక. ౨౯

శ్లో॥ దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి.
తే॥ గీ॥ సర్వదేహంబు లందుండు • సత్యశాశ్వ
తాత్మ చంపంగఁ బడఁ దగ • నట్టిదె కద?
అట్టి కారణమున సర్వ•మైన ప్రాణి
హరణముం గూర్చి శోకింప • నర్హ మగునె? 30

శ్లో॥ స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే.
తే॥ గీ॥ నీదు క్షత్రియ ధర్మంబు • నీ వెఱింగి
తేని ననికిఁ జలించుట • కీవు తగవు,
యుద్ధమునకంటె నీఁక క్షత్రి•యునకు మేలు
గూర్చు ధర్మంబు వేఱు నొ•కొండు లేదు. 31

శ్లో॥ యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్.
తే॥ గీ॥ పార్థ! తనయంతఁ దా సమీ•పమునఁ దెఱువఁ
బడిన స్వర్గపురీవర • ద్వారమైన
యట్టి యుద్ధంబు సుఖులైన • యట్టి పార్థి
వోత్తముల్ పొందుదురు కాదె? • యోగ్యరీతి. 32

శ్లో॥ అథ చే త్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి.
తే॥ గీ॥ కడఁకతో నీవు ధర్మ్య సం•గ్రామ మిపుడు
సేయవేని స్వధర్మంబు • సేయ నందు
వలనఁ గీర్తిని జెందంగ • వలను గాదు
పాప మీ రూపమున నొంద•వలయు నిన్ను. 33

శ్లో॥ అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్,
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే.

తే॥ గీ॥ అవలఁ బ్రాణులు తఱుఁగని • యపయశమ్ము
వాకొనుచునుండు; గౌరవిం•పంగఁ బడిన
మనుజుఁ డపకీర్తిచేతను • మనుట కంటె
మహిని బ్రదెల్లుటయే చాల • మంచి దాను. 3౪

శ్లో॥ భయా ద్రణా దుపరతం
మంస్యన్తే త్వాం మహారథాః,
యేషాం చ త్వం బహుమతో
భూత్వా యాస్యసి లాఘవమ్.

తే॥ గీ॥ ఏ మహాత్ములచేత నీ•వింతవఱకు
గౌరవింపంగఁబడితి వ•వ్వారి నడుమఁ
జుల్కఁదన మొందెదవు నిను•జూచి భీతి
యుద్ధమున నోడి చనె నంద్రు • యోధవరులు. 3౫

శ్లో॥ అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యంతి తవాహితాః
నిందన్త స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్.

తే॥ గీ॥ నీదు సామర్థ్యముంగూర్చి • నీ పగతురు
నిందసేయుటకుం గడు • పొందికైన
కాల మేతెంచె; ననరాని • కాఋమాట
లందు రద్దాని కంటెఁ గీఁ•డైన దేది. 3౬

శ్లో॥ హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మా దు త్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః.
తే॥ గీ॥ పగఱచేఁ జంపఁబడితివా ♦ స్వర్గ మబ్బు
కాక గెల్చిన రాజ్యభోగములఁ గనెదు
రెండువిధములఁ గౌంతేయ ♦ నిండుమేలు
కాన ననిసేయ సిద్ధమ్మ ♦ గమ్ము లెమ్ము. 32

శ్లో॥ సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి.
తే॥ గీ॥ జంటయగు మేలుకీడుల ♦ సమతఁగాంచి
జంట యగు లాభనష్టాల ♦ సమతఁగాంచి
జంట యగు గెల్పుటోడుల ♦ సమతఁగాంచి
బవరమున కూను మీవు పాపంబుఁగనవు. 38

శ్లో॥ ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబంధం ప్రహాస్యసి.
తే॥ గీ॥ పార్థ! నే సాంఖ్యతత్త్వంబుఁ బల్కినాఁడ
ఎట్టి బుద్ధియుక్తుడనైన ♦ యెడల నీవు
కర్మబంధవిముక్తిని ♦ గాంచగలవొ
అట్టి యోగంబు చెప్పెద ♦ నాలకింపు. 39

శ్లో॥ నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.
తే॥ గీ॥ కర్మయోగంబు నందభిక్రమవినాశ
మడరఁజాలదు ప్రత్యవాయమ్ము లేదు
కొంక కీ ధర్మ మెంత తక్కువగఁ జల్ప
బడిన రక్షించు గొప్పదౌ ♦ భయమ్ము నుండి. ४०

శ్లో॥ వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్

తే॥ గీ॥ కురుకుమారక! నిల్కడఁ • గూడుబుద్ధి
కర్మయోగంబునందు నొ•క్కండు గలదు
అట్టి నిల్కడయే లేని • యట్టి వారి
బుద్ధులు ననంతములు పలు•పోక లగును. ౪౧

శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ! నాన్య దస్తీతి వాదినః.

తే॥ గీ॥ పార్థ! లోకంబులోన న•ల్పమగు జ్ఞాన
ముగలవారలు శ్రుతివాక్య•ములను నిష్ట
ముంచి స్వర్గాది ఫలముల • నూహసేసి
యంతకంటెఁ బొందునది లే•దండ్రు వారు. ౪౨

శ్లో॥ కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి.

తే॥ గీ॥ స్వర్గ కామాత్ములై నట్టి • వారలెల్ల
జన్మకర్మ ఫలంబు లొ•సంగగల క్రి
యాతి బహుళంబులై యొప్పు • నఖిల భోగ
సంపదలఁగూర్చి పలుకంగ జాలి•యుండ్రు. ౪౩

శ్లో॥ భోగైశ్వర్యప్రసక్తానాం తయాఽపహృతచేతసామ్
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే.

తే॥ గీ॥ పామరత్వాన భోగ•సంపదలఁ బొందు
టే ప్రధానముగాగ • నటించి వాని
వలన నపహృత చిత్తులై • యలరు వారి
బుద్ధి నిశ్చలప్రసమాధి • బొందఁబోదు. ౪౪

శ్లో॥ త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్.

తే॥ గీ॥ వేదములు వల్కు త్రైగుణ్య • విషయములను
ద్రిగుణముల కీవు నందక • తిరుగఁదగును
నరుస యోగంబు క్షేమంబు • ద్వంద్వభావ
ములను విడి సత్వమున నాత్మ•మూల మెఱుఁగు. ౪౫

శ్లో॥ యావా నర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః.

తే॥ గీ॥ బావినీటి ఫలంబు ప్ర•వాహజలము
నందు లీనంబునై యున్న • యట్లు శ్రుతుల
నొసరఁగల్గెడు నట్టి ప్ర•యోజనంబు
జ్ఞాని జ్ఞానంబునందు లీ•నమయియుండు. ౪౬

శ్లో॥ కర్మ ణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతు ర్భూ ర్మా తే సంగోఽస్త్వకర్మణి.

తే॥ గీ॥ కర్మలను జేయుటకు నధి•కారి వీవు
కాని తత్ఫలముంగోరఁ • గాదు నీకు
కర్మఫలకారణుండవు • గాకు మీవు
కర్మలను జేయ ననుమాట • గాదు నీకు. ౪౭

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే.

తే॥ గీ॥ సిద్ధిఁ బొందినఁ బొందక • చెడినఁగాని
యొక్కటిగ నుండి, సంగముల్ • దిక్కువీడి
యోగమందుండి కర్మంబు • లొనరుపు మిఁక
సర్వ సమబుద్ధియే యోగ•సంజ్ఞ బరఁగు. ౪౮

శ్లో॥ దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ,
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః
తే॥ గీ॥ ఓ ధనంజయ! సమబుద్ధి ♦ యోగమునకు
వేఱయిన కర్మ తక్కువై ♦ వెలయుఁ గాన
బుద్ధినే శరణంబుగాఁ ♦ బొందు మెపుడు
పృథులఫలకాంక్షు లగువారు ♦ కృపణు లగుట. ౪౯
శ్లో॥ బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్
తే॥ గీ॥ బుద్ధియోగము కలవాడు ♦ పుణ్యపాప
ములను వీడు నిచట యోగ♦మునకు సిద్ధ
పడుము యోగంబు కర్మల ♦ ప్రక్రియందుఁ
గౌశలముగా నెఱుంగుము ♦ కవ్వడి! యిఁక. ౫౦
శ్లో॥ కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛ న్త్యనామయమ్.
తే॥ గీ॥ బుద్ధియోగంబుతోఁ గూడు ♦ బుద్ధిశాలు
లలరఁ గర్మ లొనర్చుట ♦ వలనఁ గలుగు
ఫలము గోరరు; గావున ♦ వారు జనన
మంద కే మోక్షసామ్రాజ్య ♦ మందఁ గలరు. ౫౧
శ్లో॥ యదా తే మోహకలిలం బుద్ధి ర్వ్యతితరిష్యతి
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ.
తే॥ గీ॥ ఎపుడు మోహంపు మాలిన్య ♦ మీవు దాట
గలిగియుండితివో? విన♦వలసినట్టి
దానినిం గూర్చి విన్నట్టి ♦ దాని గూర్చి
వేదనను జెందవే కద ♦ వినయధుర్య. ౫౨

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా
సమాధా వచలా బుద్ధి స్తదా యోగ మవాప్స్యసి.

తే॥ గీ॥ వేదవాక్యంబులఁ గలంత • పెట్టఁబడిన
దైన బుద్ధి సమాధియం • దంతయేని
కదలక స్థిరంబుగా నుండఁ • గలిగెనేని
యప్పుడే యోగమును నీవు • నందఁగలవు. ౫౩

అర్జున ఉవాచ—

శ్లో॥ స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ,
స్థితధీః కిం ప్రభాషేత కి మాసీత వ్రజేత కిమ్.

తే॥ గీ॥ కేశవ! సమాధి నిల్చిన • కౌశలమతి
యెట్టి దగు భాషతోఁగూడ • నెసఁగుచుండు
నెట్టి సంభాషణముల భా•షించుచుండు
నెట్లు గూర్చుండుఁ దిరుగునో • యెఱుఁగఁబలుకు. ౫౪

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ ప్రజహాతి యదా కామా న్సర్వా న్పార్థ! మనోగతాన్
ఆత్మ న్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే.

తే॥ గీ॥ అర్జునా! యెప్పు డీ నరుఁ•డాత్మయందు
ననుభవించు నాత్మానంద • మన్యము విడి
యెదఁబొడలు కామములఁ • జేరనీనివాఁడు
క్షితి "స్థితప్రజ్ఞుఁ" డంచును • జెప్పఁబడును. ౫౫

శ్లో॥ దుఃఖే ష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః,
వీతరాగభయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే.

తే॥ గీ॥ దుఃఖములఁ గల్త పడని చే♦తోబలుండు
వరుస సుఖములయం దాశ ♦ పడనివాఁడు
వీతరాగ, భయ, క్రోధ ♦ విలసితుండు
నైనవాఁడు "స్థితప్రజ్ఞుఁ"♦డనఁగఁ బడును. ౫౬

శ్లో॥ యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తే॥ గీ॥ దేనితోడ సంబంధంబు ♦ లేనివాఁడు
భద్రములు పొంది సంతోష ♦ పడనివాఁడు
కీఁడు పొందు నపుడు లేని ♦ కిన్కవాఁడు
నెవ్వఁ డవ్వాఁడు స్థిరబుద్ధి ♦ నెసఁగువాఁడు. ౫౭

శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తే॥ గీ॥ పూని కూర్మంబు నవయవ♦ములను లోన
ముడుచుకొన్నట్లు నింద్రియం♦బులను విషయ
గణమునం దుండి మరలించు♦కొనునో యతని
యొక్క బుద్ధి స్థిరంబుగా ♦ నుండు భువిని. ౫౮

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే.

తే॥ గీ॥ వివిధశబ్దాది విషయాళి ♦ వీడినట్టి
దేహి తద్రాగమెల్ల గు♦ర్తెఱిగి మరలు
బ్రహ్మమే తానని యెఱుంగ♦బడినవాఁడు
రాగమును గూడ విడు బీజ♦రహితముగను. ౫౯

శ్లో॥ యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః.

తే॥ గీ॥ అలవిగానట్టి యింద్రియ ♦ బలము ఘనము
వాని వశపర్చుకొనుచున్న ♦ వరవివేక
శాలి యగువాని శిక్షకుఁ ♦ జాలియున్న
మానసము నేని హరియింపఁ ♦ బూను సుమ్ము. ౬౦

శ్లో॥ తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తే॥ గీ॥ అట్టి బలమును గల యింద్రి♦యములఁ గెల్చి
వరసమాధిని గను స్థిత♦ప్రజ్ఞుఁ డెపుడు
నిరతమును భక్తి నన్ను ధ్యా♦నించుచుండు
కాన నవ్వాని ప్రజ్ఞ ని♦ల్కడను గాంచు. ౬౧

శ్లో॥ ధ్యాయతో విషయాన్పుంసః
సంగ స్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోఽభిజాయతే.

తే॥ గీ॥ ఇంద్రియార్థంబు లందున ♦ దృష్టి నిలుపు
పురుషునకు విషయములందుఁ ♦ బుట్టు సక్తి
సక్తివలనను కామంబు ♦ సంభవించుఁ
గోర్కి యొనగూడకున్న క్రో♦ధోద్భవము. ౬౨

శ్లో॥ క్రోధా ద్భవతి సంమోహః సంమోహా త్స్మృతివిభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.

తే॥ గీ॥ క్రోధమునఁ నవివేకమ్ము • రూపమందు
నట్టి యవివేకమున మఱ • పావరించు
మఱపువలనను, నశియించుఁ • బరమబుద్ధి
పరమబుద్ధి నశింపంగ • మరణమందు. ౬౩.

శ్లో॥ రాగద్వేషవియుక్తై స్తు విషయా నిందిృయై శ్చరన్
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి.

తే॥ గీ॥ నమ్రతం బొందినట్టి మ • నస్సు వశము
జేసికొని, రాగవైరముల్ • చెందకుండ
విషయములఁ జెరలాడు వి • వేకశాలి
నిర్మలంబైన భావంబు • నెఱిని గాంచు. ౬౪

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హాని ర స్యోపజాయతే
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే.

తే॥ గీ॥ నిర్మలంబైన తలఁపుతో • నిండినట్టి
వాని సర్వస్వదుఃఖముల్ • హాని జెందుఁ
దేఁట యైనట్టి మదితోడఁ • దిరుగువాని
బుద్ధియుం గుదురుం జెంది • పొదలుచుండు. ౬౫

శ్లో॥ నా స్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చాభావయతః శా న్తి రశాంతస్య కుత స్సుఖమ్.

తే॥ గీ॥ పొరి నయుక్తునకును స్థిర • బుద్ధిలేదు
వాని కామీద నాత్మ భా • వనయులేదు
సరసభావన లేకున్న • శాంతిలేదు
ప్రబలశాంతము లేని • సౌఖ్యంబు లేదు. ౬౬

శ్లో॥ ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయు ర్నావ మివాఽంభసి.

తే॥ గీ॥ ఇంద్రియంబులు విషయంబు ♦ లందుఁ దిరుగు
చుండ వాని ననుసరించు ♦ చుండు మనసు
నీటిమీద పడవ గాలి ♦ నిలువకుండ
వే రెడకు నీడ్చుగతి బ్రజ్ఞ ♦ పెడకు నీడ్చు. ౬౭

శ్లో॥ తస్మా ద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

తే॥ గీ॥ కడిఁది కేలుగలాఁడ! యా ♦ కారణమున
నెవని యింద్రియములు విష ♦ యేచ్ఛనుండి
తిరుగఁ గొట్టంగఁబడునో యా ♦ ధీరు బుద్ధి
తప్పకుండగ నిల్కడఁ ♦ దగిలియుండు. ౬౮

శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః

తే॥ గీ॥ *అఖిలభూతములకు రాత్రి ♦ యైన యప్పు
డదియ మౌనికి జాగ్రత ♦ యై తనర్చు
నన్ని భూతములకుఁ బగ ♦ లైన యపుడు
బ్రహ్మతత్వజ్ఞునకు నది ♦ రాత్రి యగును. ౬౯

* తే॥ గీ॥ తెలివి మఱచని వాని, క ♦ దియె పవ లగుఁ
తెలివిమాలినవాని క ♦ దియె రేయి యగుఁ
తెలివిగలవాఁడు మోక్ష క ♦ ర్మలను జేయుఁ
తెలివి మఱచినఁ గామ్యక ♦ ర్మలను జేయు.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వ త్కామా యం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి న కామకామీ.

తే॥ గీ॥ నిడుద లగు నేటి నీటిచే ♦ నిండియున్న
కడలి కదలని లాఁగునఁ ♦ గడిదిజోగి
యన్నివిషయంబులుం దన ♦ యందుఁజొరిన
కదల కుండును లోలుండు ♦ కదలుచుండు. ౭౦

శ్లో॥ విహాయ కామా న్యః సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః స శాంతి మధిగచ్ఛతి.

తే॥ గీ॥ శాంతి సంపదఁగలయట్టి ♦ సౌఖ్యభాగ్య
మెప్పటికిగాని కోర్కులు ♦ నీ మమతయు
నహము బోనాడి విషయాళి ♦ యందు రక్తి
వీడు ధన్యుం డనుభవించు ♦ వీరవర్య!. ౭౧

శ్లో॥ ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి.

తే॥ గీ॥ బ్రహ్మ మందలి యునికిని ♦ బడయుగోరి
సంగదూరనిష్కామకర్మ ♦ జలుపు యోగి
పొందఁడెప్పుడు మోహమ్ము ♦ బొంది వీడు
సమయమున నట్టు లుండి మోక్షంబునొందు. ౭౨

ఇది ద్వితీయాధ్యాయము

ఓ మ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ హ ను మ ద్భ గ వ ద్గీ త

## తృ తీ యా ధ్యా య ము

### క ర్మ యో గ ము

అర్జున ఉవాచ—

శ్లో॥ జ్యాయసీ చే త్కర్మణ స్తే మతా బుద్ధి ర్జనార్దన
త త్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ.

తే॥ గీ॥ అచ్యుతా! యోగబుద్ధియె ♦ యన్నియెడల
హారు వగును గర్మమునకంటె ♦ నందువేని
శక్తి కొలది భయదకర్మ ♦ సలుపు మంచు
విడువకయ పల్కెదేలొకో ♦ వినుచు మయ్య.

శ్లో॥ వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయ సీవ మే
తదేకం వదనిశ్చిత్య యేన శ్రేయో౽హ మాప్నుయామ్.

తే॥ గీ॥ రెండభిప్రాయములచేత ♦ నిందువాక్య
ములను బుద్ధి మోహింపంగ ♦ జలుపుచుంటి
దేనిచేతను మేలు పొం♦దెదనో? నీవ
యేరుపరచి యొక్కటి వచి♦యింపు మయ్య.

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
మయా ప్రోక్తా పురాఽనఘ !
జ్ఞానయోగేన సాంఖ్యానామ్
కర్మయోగేన యోగినామ్.

తే॥ గీ॥ అనఘ ! యాత్మ సనాత్మను ♦ సరయు సాంఖ్య
గణమునకు జ్ఞానయోగంబు; ♦ కర్మయోగి
గణమునకుఁ గర్మయోగంబుఁ; ♦ గలుగఁజేసి
పెట్టియుంచితి సృష్ట్యాది ♦ ద్వివిధముగను. 3

శ్లో॥ న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
న చ సన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి.

తే॥ గీ॥ పురుషుఁడు స్వకర్మ లూనక ♦ పోయినంత
మాత్రమునను నైష్కర్మ్య సం♦భవము కాదు
కర్మ లన్ని త్యజింపఁగాఁ ♦ గలుగు నట్టి
గడుసరికి నెందు సిద్ధియుఁ ♦ గలుగఁ బోదు. ౪

శ్లో॥ న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః.

తే॥ గీ॥ క్షణముగూడ నెవండును ♦ గర్మఁజేయ
కుండఁ జాలండు; ప్రకృతిచే ♦ నుదయమైన
గుణములను బ్రాణితతి తిరు♦గుడును బడుచు
సకల కర్మల నొనరింపఁ ♦ జాలియుండు. ౫

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే.

తే॥ గీ॥ *నోరు కాల్సేతులును మల♦ద్వారము నల
మూత్రమును వీడుచోటును ♦ మూసిపట్టి
మనము నందున విషయముల్ ♦ స్మరణసేయు
నట్టి యవివేకి మిథ్యక♦ర్మాచరితుఁడు. ౬

శ్లో॥ యస్త్వింద్రియాణి మనసా నియమ్యాఽఽరభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్త స్స విశిష్యతే.

తే॥ గీ. తోలు గన్నును జెవి ముక్కు ♦ నాలుకలను
మనసుచే నరికట్టి వా♦క్కునను బాణి
పాదముల మలమూత్రింపు ♦ ద్వారములను
బనులు సేయించును వివేకి ♦ ఫలముగోనక. ౭

శ్లో॥ నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః.

తే॥ గీ॥ నియతకర్మను జేయుట ♦ నీకు మేలు
చేయకుండుట కంటెను ♦ జేత మేలు
కర్మ యెటు సేయ కుండుట ♦ కాదు నీకు
నడువదు శరీరయాత్ర యె♦న్నటికి దాన. ౮

*తే॥ గీ॥ నింగి గాలియు నగ్గియు ♦ నీరు నేల
చప్పుడును దాకుడును రూప ♦ సార వాస
నల నొసంగు; నివే గుణ♦ములని విషయ
ములని పల్కుదు రార్యులు ♦ ముఖ్యముగను.

శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర.

తే॥ గీ॥ గొంతి కొమరుఁడ! యజ్ఞముకొఱకుఁగాని
ఇతరకర్మలు బంధముల్ • సృష్టిచేయు
అందుకొఱకయి కర్మంబు • నాచరింపు
సంగరహితుడవై ఫల•సంధి వీడి. ౯

శ్లో॥ సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వో స్త్విష్టకామధుక్.

తే॥ గీ॥ బ్రహ్మదేవుండు సృష్టి ప్రా•రంభవేళ
శిష్టయజ్ఞాళితోఁ బ్రజా•సృష్టిఁజేసి
యజ్ఞములచేత నభివృద్ధి • నందఁగలరు
పిదప నది కోరు కోర్కులఁ • బితుకు ననియె. ౧౦

శ్లో॥ దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ.

తే॥ గీ॥ యజ్ఞముల హవ్యముల నిచ్చి • యమరవరుల
పెక్కు విత్తముల సంతోష • పెట్టిరేని
వారు వానలు కురిపించి • పంటపైర్లు
పెంచి మిమ్ముల సంతోష • పెట్టఁగలరు. ౧౧

శ్లో॥ ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః
తై ర్దత్తా నప్రదా యైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః.

తే॥ గీ॥ జన్నములుసేయ వేల్పులు • సంతసించి
* యిష్టభోగంబులను మీకు • నిచ్చుచుంద్రు;
వార లిచ్చిన వానిని • వారి కిడక
యనుభవించు నతఁడు దొంగ • యౌను గాదె? ౧౨

* దారసుం బుత్రులం బశు•తతి నిడెదరు.

శ్లో॥ యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపా యే పచం త్యాత్మకారణాత్.

తే॥ గీ॥ *యజ్ఞములు సేసి మిగిలిన • దైన యన్న
శాకములు దిన్నఁబాపముల్ • సడలిపోవు
ధరణి యజ్ఞార్థముగఁ గాక • తమకొఱకని
వండుకొనువారు పాపమ్ముఁ • బడయఁగలరు. ౧౩

శ్లో॥ అన్నా ద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః.

తే॥ గీ॥ కలుగుఁ బ్రాణులు నన్నంబు • వలన, నద్ది
వర్షపతియగు పర్జన్యు • వలన, వాఁడు
యజ్ఞములచేత, నయ్యవి • యఖిలకర్మ
జాతమున భూతలమ్మున • జాత మౌను. ౧౪

---

*పంచమహాయజ్ఞములు తే॥గీ॥ దేవయజ్ఞంబు హవ్యముల్ • తీర్చుటండ్రు
పితృమఖము తర్పణంబుల • విడుచు టండ్రు
మనుజయజ్ఞ మతిథి పూజ • బ్రహ్మయజ్ఞ
మాగమాధ్యయనము భూత•యజ్ఞము బలి.

పంచసూనములు శ్లో॥ ఖండినీ, పేషిణీ, చుల్లీ, ఉదకుంభీ చ, మార్జనీ;—

తే॥ గీ॥ నరుఁడు కోయుట, నూరుట, • విఱుచుట, లను
గాలుచుట తుడుచుటలను • గలుగునైదు
విధములగుహింసలం జేసి • విలుచు పాప
పరిహారము నకు వైశ్వదే•వంబు జేసి
పంచయజ్ఞములను జేయ•వలయుఁ జుమ్ము.

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవం
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్.

తే॥ గీ॥ * కర్మ వేదంబువలనను ♦ గలుగు, బ్రహ్మ
మక్షరుని వలనను గల్గు ♦ నట్లుగాన
నెల్లెడల వ్యాప్త మగు బ్రహ్మ ♦ మెల్లయపుడు
యజ్ఞమున యందు వెలైడు ♦ సంచెలుంగు. ౧౫

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయ తీహ యః
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి.

తే॥ గీ॥ పార్థ యెవఁ డీ జగచ్చక్ర♦వర్తనంబు
ననుసరించి ప్రవర్తింపఁ ♦ డతఁడు పాప
కార్యములుఁ జేసి విషయ స♦క్త హృదయుండు
పనికిమాలి బ్రతుకునట్టి ♦ వాఁడు నగును. ౧౬

శ్లో॥ య స్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్త శ్చ మానవః
ఆత్మ న్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే.

తే॥ గీ॥ విషయలోలుండు గాకుండ ♦ విమలమైన
యాత్మయందె మహానంద ♦ మందె తృప్తి
యందె సంతోష పడునట్టి ♦ యాతఁ డెవఁడు
వాని కిఁకఁ జేయదగినట్టి ♦ పనియ లేదు. ౧౭

*తే॥ గీ॥ భువన సృష్టికి నేనియు ♦ ముక్తి కేని
మూల మైనట్టి యీ యజ్ఞ♦ము జగమునకు
నాదియును నంత్యమును తాన♦యౌనుగాన
జక్కనది యజ్ఞ పరిణామ♦చక్ర మాను
భూతములు కర్మలను యజ్ఞ♦ములను జేయు
యజ్ఞములచేతఁ బర్జన్యుఁ డా♦త్మఁబొంగి
యన్న మిడు దాన భూతమ్ము ♦ లన్నికలిగి
యజ్ఞము శ్రేయ నిటు చక్ర ♦ మట్లు దిరుగు.

శ్లో॥ నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః.

తే॥ గీ॥ ఆత్మనిష్ఠాపరుండైన • యతఁడు గర్మ
సలుపుచుండిన నే ప్రయో•జనము లేదు
సలుపకుండుట నిందు న•ష్టంబు లేదు
వాని కీ భూతములతోడఁ • బనియులేదు. ౧౮

శ్లో॥ తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః.

తే॥ గీ॥ ఫలము గోరక నియత క•ర్మలను జేయ
వలయు నీ వర్జునా! దాని • వలన నీకు
గలుగు మోక్షంబు నేవేళ • కర్మయోగి
కిదియమార్గంబ టంచు నీ•వెఱుగు మయ్య. ౧౯

శ్లో॥ కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాఽపి సంపశ్య న్కర్తు మర్హసి.

తే॥ గీ॥ జనకముఖ్యు లొనర్చ, ని•ష్కామకర్మ
మోక్షసిద్ధి లభించె నా•పక్ష మూని
ప్రజలు తప్పైనదారులు • పట్టకుండఁ
జేయుకొఱకైన గర్మలు • సేయవలయు. ౨౦

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దే వేతరో జనః
స య త్ప్రమాణం కురుతే లోక స్త దనువర్తతే.

తే॥ గీ॥ శ్రేష్ఠుఁ డగు పరమజ్ఞాని • సేయుదేని
దాని నితరజనము సేయఁ • దలచుఁ జేయు
వాని కేది ప్రమాణమో • వారి కదియె
ప్రబలమైన ప్రమాణమై • పరగుచుండు. ౨౧

శ్లో॥ న మే పార్థాఽస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన
నాఽనవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి.

తే॥ గీ॥ పార్థ! ముజ్జగముల సలు♦పంగ నైన
పనియు బొందనిదియుఁ బొందఁ ♦ వలసినదియు
లేదు నాకు; నట్లైనను ♦ లేశమైన
కర్మ సేయని కాలమ్ము ♦ కానబడదు. ౨౨

శ్లో॥ యది హ్యహం నవర్తేయం జాతు కర్మ ణ్యతంద్రితః
మమ వర్త్మాఽనువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.

తే॥ గీ॥ పార్థ! నే నెల్లపుడు శ్రద్ధఁ♦బట్టి కర్మ
సలుపకే యుండితిన యేని ♦ సకలజనము
అన్ని విధముల నా మార్గ ♦ మనుసరించి
కర్మలను జేయకుందురు ♦ గాదె చెపుమ. ౨౩

శ్లో॥ ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహం
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః.

తే॥ గీ॥ నేను కర్మల నొనరింప♦నేని జగము
సేయుటే మాను బ్రజయు న♦శించు నవల
సంకరమునకు హేతువై ♦ సకలజనము
జెఱిచి నటువంటివాఁడనౌ ♦ దరసిచూడ. ౨౪

శ్లో॥ సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత!
కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్.

తే॥ గీ॥ భరతకులదీప! యజ్ఞులు ♦ ఫలము గోరి
యెట్లు కర్మలు సేసెద ♦ రట్లుగాను
ప్రాజ్ఞులు ఫలంబుఁ గోరక ♦ యజ్ఞజనుల
క్షేమమునకయి కర్మలు ♦ సేయుచుండ్రు. ౨౫

శ్లో॥ న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణి విద్వాన్ యు_క్త స్సమాచరన్.
తే॥ గీ॥ జ్ఞానికర్మ ఫలాస_క్తు ♦ లైన తెలివి
లేనివారలు కర్మలు ♦ మానివేయు
తలఁపు గలుగంగఁజేయక ♦ తాను సేసి
వారిచేతను జేయింప ♦ వలయు సుమ్మ. ౨౬

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకారవిమూఢాత్మా కర్తాఽహ మితి మన్యతే.
తే॥ గీ॥ ప్రకృతిజన్యములగు గుణ♦త్రియము నన్ని
కర్మలకుఁ గారణంబయి ♦ కాల్చుచుండ
మూఢుఁడగుచు నహంకార♦మున నొకండు
తాను సేసితి నని మెదఁ ♦ దలఁచుచుండు. ౨౭

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః
గుణా గుణేషు వ_ర్తంత ఇతి మత్వా న సజ్జతే.
తే॥ గీ॥ గొప్పచేతులు గలవాఁడ! ♦ గుణము లల్ల
గుణములంగల్గు కర్మల ♦ గు_ర్తెఱుంగు
వాఁడు గుణములు తత్కర్మ ♦ వ_ర్త లయ్యె
నంచుఁ గర్మల సంగంబు ♦ లంటకుండు. ౨౮

శ్లో॥ ప్రకృతే ర్గుణసమ్మూఢా స్సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందాన్ కృత్స్నవి న్నవిచాలయేత్.
తే॥ గీ॥ ప్రకృతిజన్యం బయిన గుణ♦త్రియమువలన
మోహ మందుచుఁ గర్మలు ♦ పూనిసేయు
మఱుగు కర్మఫలాస_క్త ♦ మందమతులఁ
[illegible] ♦ మరల్పఁ దగఁడు. ౨౯

శ్లో॥ మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాఽధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.

తే॥ గీ॥ ఆత్మవిషయికబుద్ధిచే ♦ నన్నికర్మ
లా పరేశుఁడ నగు నాకు ♦ నర్పణంబు
నేసి యాశామమత్వముల్ ♦ త్రోసి వేసి
చింతలను మాని యుద్ధమ్ము ♦ నేయు మయ్య. 30

శ్లో॥ యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః.

తే॥ గీ॥ ఎవ్వ రశ్రద్ధయు నసూయ ♦ యింతలేక
పైని జెప్పిన నా యభి♦ప్రాయ మూని
యెపుడు వర్తింతురో వార ♦లెనఁగాని
కర్మబంధంబు వదలంగఁ ♦ గలరు పార్థ! 3౧

శ్లో॥ యే త్వేత దభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతం
సర్వజ్ఞానవిమూఢాం స్తాన్ విద్ధి నష్టా నచేతసః.

తే॥ గీ॥ ఎప్పు డశ్రద్ధయు నసూయ ♦ యెసఁగఁ గలిగి
యీ యెడల నా నుడువు నభి♦ప్రాయ మూన
కున్న వారలు నజ్ఞాను ♦ లన్న వారు
బుద్ధిహీనులునుం జెడి ♦ పోవువారు. 3౨

శ్లో॥ సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్ జ్ఞానవా నపి
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి.

తే॥ గీ॥ జ్ఞానవంతుఁడు తన పూర్వ♦జన్మ కర్మఁ
బట్టి యేర్పా టయిన స్వభా♦వమునకు దగి
నట్టి కర్మలు నేయును; ♦ నట్లె ప్రాణు
లూను ప్రకృతిని; నిగ్రహం ♦ బొప్పు నెట్లు? 33

శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగ ద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్నవశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ.

తే॥ గీ॥ ద్వేషమును రాగ మింద్రియ ♦ విషయములను
బ్రికటముగ నుండుఁ గారాదు ♦ వాని వశము
తెరువుగొట్టెడు దొంగల ♦ కరణి నవ్వి
గెలువగా రాని వగు; శత్రు♦వులుగఁ గనుము. 38

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

తే॥ గీ॥ *ఫలసహితమైన పరధర్మ ♦ పరతకంటె
ఫలరహితమై తగు స్వధర్మ ♦ పరత మేలు
పరవిధిం బూని సల్పుట ♦ భయద మగుట
విధి నొనర్చుచుఁ బ్రాణముల్ ♦ విడుట మేలు. 39

---

*ధర్మ భావములు— తే॥గీ॥ కర్మ లరసి యొనర్చుట ♦ ధర్మమౌను
కర్మ లనపేక్ష సేయుట ♦ ధర్మమౌను
తాను నిత్యముల్ సల్పుట ♦ ధర్మమౌను
తనను దాను దెలిసికొంట ♦ ధర్మమౌను
దేని ధర్మంబు దానికిఁ ♦ దీర్చియుండె
నెవరి ధర్మంబు వారూను ♦ టెసగ నుండె
నొకరి ధర్మంబు నొక రూను ♦ టొప్పకుండెఁ
బరుల ధర్మంబు గొనివీడఁ ♦ బాప ముండె.

అర్జున ఉవాచ—

శ్లో॥ అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః
అనిచ్ఛ న్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః.

తే॥ గీ॥ దేవ! వార్ష్ణేయ! స్వీయమా • భావ మేమి
లేకయున్న బలాత్కార • లీలవలన
నేని నియమితుఁడుం బోలె • దేనిచేతఁ
జేయునో పాపకార్యంబు • సెప్పు మయ్య. 36

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

తే॥ గీ॥ క్రోధకామము లా రజో•గుణము వలన
గలిగి పెంపొందినవిగాఁగ • దలపు మయ్య
తనివి లేకుండి పాపమ్మ • దార్చునట్టి
కామమును బద్ధ శత్రువు•గా నెఱుంగు. 37

శ్లో॥ ధూమే నావ్రియతే వహ్ని ర్యథాఽఽదర్శో మలేనచ
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్.

తే॥ గీ॥ పొగవలన నగ్నిహోత్రము, • ముఱికివలన
నద్దమును, మావిచే గర్భ • మందు శిశువు
కప్పబడియున్న లాగు నీ • కామమునను
జ్ఞాన మావృతమై పైకిఁ • గానబడదు. 38

 

శ్లో॥ ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా
కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేనచ.

తే॥ గీ॥ అర్జునా! నింపుటకును శ♦క్యంబుగాని
దగ్నితుల్యంబు నిరతారి ♦ యనగఁబరగు
కామమున జ్ఞాని జ్ఞానంబు ♦ కప్పబడిన
దానిగా నీవు మదిలోన ♦ దలపు మయ్య. ౩౯

శ్లో॥ ఇంద్రియాణి మనోబుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్.

తే॥ గీ॥ కామమున కింద్రియంబులు ♦ శేముషీ మ
నంబు లాశ్రియ మౌను, ని♦త్యంబువాని
వలన జ్ఞానమ్ము గప్పగా ♦ బడియుఁ దేహి
గలచి మోహంబునను ముంచు ♦ కామమెపుడు. ౪౦

శ్లో॥ తస్మా త్త్వ మింద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్.

తే॥ గీ॥ భరతకులవర్య! విను మందు♦వలన నీవు
ముందుగా నింద్రియమ్ముల ♦ పొందుఁదెగడి
జ్ఞాన విజ్ఞానములను నా♦శంబు సేయు
పాప రూపంపుఁ గామమ్ము ♦ బాయు మయ్య. ౪౧

శ్లో॥ ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనస స్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరత స్తు సః.

తే॥ గీ॥ పెద్ద లింద్రియములు చాల ♦ పెద్దవండ్రు
వానికంటె మనస్సును ♦ దానికంటె
బుద్ధి గొప్పదియగును నా ♦ బుద్ధికంటె
గొప్పవాఁడగు పరమాత్మ ♦ కురుకులేశ! ౪౨

శ్లో॥ ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాఽఽత్మాన మాత్మనా
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్.

తే॥ గీ॥ గొప్పచేతులుగలవాఁడ! ♦ గొప్పబుద్ధి
కంటెఁ బరుఁడగు నీశ్వరు ♦ కడఁకఁ దెలిసి
యాత్మచే నాత్మ నరికట్టి ♦ యవల కామ
రూపిని దురాసదంపు శ♦త్రువును జంపు. ౪౩

ఇది తృతీయాధ్యాయము



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ హనుమద్భగవద్గీత

## చతుర్థాధ్యాయము



### జ్ఞానయోగము

శ్రీభగవానువాచ—

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్.

తే॥ గీ॥ అవ్యయంబైన యీ యోగ ◆ మర్కునకును
పాదువుగాఁ జెప్పితిని నేను; ◆ నతఁడు మనువు
శ మనునకుఁ జెప్పె, నాతఁ డి◆క్ష్వాకునకును
విశదముగ వచియించె ని◆వ్విధముగాను. ౧

శ్లో॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప!

తే॥ గీ॥ పగఱఁ దపియింపఁ జేసెడు ◆ పార్థ! యిట్టు
లొక్క రొక్కరినిం జేరు◆చున్న యోగ
రాజము నెఱుంగఁ గల్గిరి ◆ రాజఋషులు
అద్ది చెడిపోయెఁ జిరకాల ◆ మగుటవలన. ౨

శ్లో॥ స ఏవాఽయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్.

తే॥ గీ॥ ఆచరణ లేక యొకమూల ♦ నడఁగియుండు
మొదటిదగు జ్ఞానయోగంబు ♦ మొద లెఱుంగు;
భక్తుఁడవు స్నేహితుఁడ వని ♦ పల్కుచుంటి
నతిరహస్యంబు నుత్తమం ♦ బైన దీని. 3

అర్జున ఉవాచ—

శ్లో॥ అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయామ్ త్వ మాదౌ ప్రోక్తవా నితి.

తే॥ గీ॥ పుట్టితివి నీ విపుడు, రవి ♦ మున్నె పుట్టె
సృష్టికిని ముందె రవి కెట్లు ♦ సెప్పి తో కొ ?
నాకుఁ దెల్పుము తెలియంగ ♦ రాకయుండె
లోకనాయక! కని కృపా♦లోకనమున. ४

శ్రీభగవా నువాచ—

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున !
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప !

తే॥ గీ॥ అరిదమన ! నీకు నాకు న♦నంతములగు
ఘనతరము లగు జన్మముల్ ♦ గడచిపోయె
నేను నవ్వాని నన్నింటి ♦ నెఱిఁగియుంటి
నీవు నవ్వాని నొకఁడైన ♦ నెఱుఁగకుంటి. ౫

శ్లో॥ అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా.

తే॥ గీ॥ పుట్టుట యెఱుంగనట్టి పె•న్మ్మదుక నయ్యుఁ
జచ్చుట యెఱుంగనట్టి శా•శ్వతుఁడ నయ్యుఁ
బంచి సర్వంబు నియమించు•వాఁడ నయ్యుఁ
బూని ప్రకృతి స్వమాయచేఁ • బుట్టుచుందు. ౬

శ్లో॥ యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్.

తే॥ గీ ధర్మ మె య్యెయ్యెడలయందుఁ • దగ్గుచుండు
నెప్పు డెప్పు డధర్మంబు • వృద్ధిఁజెందు
నప్పు డప్పుడు ధర్మంబు • నడరు కొఱకుఁ
బుట్టుచుందుదు నాయంతఁ • బుడమియందు. ౭

శ్లో॥ పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.

తే॥ గీ॥ సాధుజనములయొక్క ర•క్షణము కొఱకు
ఖలజనమ్ములయొక్క శి•క్షణముకొఱకుఁ
బ్రబలవర్ణాశ్రమముల స్థా•పనము కొఱకు
నన్నియుగముల నవతార • మందుచుందు. ౮

శ్లో॥ జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున.

తే॥ గీ॥ అర్జునా! జన్మ కర్మ ర•హస్యములను
నా వలనఁ బల్కఁ బడునట్లు • నమ్మి తెలిసి
నట్టివాఁడు త్యజించి దే•హమ్ము మఱలఁ
బుట్టు వొందఁడు మఱి నన్నుఁ • బొందుచుండు. ౯

శ్లో॥ వీతరాగ భయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః.

తే॥ గీ॥ విడువఁబడుకోర్కి కిన్కలు • జడుపు గలుగు
వారు నన్నాని నేనైన•వారు నన్నె
కావు మనువారు నెఱుకమైఁ • గలుగు తపము
చేతను బవిత్రులై నన్నుఁ • జెందఁగలరు. ౧౦

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్
మమ వర్త్మాఽనువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.

తే॥ గీ॥ ఎవ్వ రెవ్వరు నన్నెట్టు • లెట్టుగొల్త్రు
వారివారిని నా లాఁగు • గూరిమిఁ గని
ప్రోచుచుందును; బలువిత•ములను నెల్ల
మానవులు నాదు దారుల • నూనుచుంద్రు. ౧౧

శ్లో॥ కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా.

తే॥ గీ. కర్మములఁగల్గు ఫలమును • గాంక్ష సేయు
వార లీ లోకమునను దే•వతలఁ గొల్త్రు
మనుజలోకము నందుఁ గ•ర్మములవలన
ఫలము వేగమ కలుగుట • ప్రకటమ కద. ౧౨

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
తస్య కర్తార మపి మాం వి ద్ధ్యకర్తార మవ్యయమ్.

తే॥ గీ॥ *త్రిగుణ కర్మవిభాగముల్ • తెలుఁగు ననుస
రించి నాలుగు జాతుల్ సృజించ నయ్యె;
వానిక ర్తను నేనయ్యుఁ • బ్రకృతివశుఁడఁ
గామిఁ దెలియు మకర్తను • గాగ నన్ను. ౧౩

శ్లో॥ న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే.

తే॥ గీ॥ అర్జునా! నన్ను కర్మలు • నంటఁ బోవు,
కర్మఫలముల నాకెట్టి • కాంక్ష లేదు;
ఏను నిటువంటివాఁడ నం • చెవ్వఁ డెఱుఁగు
వాఁడు కర్మంపు బంధముల్ • వంకఁ గనఁడు. ౧౪

శ్లో॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః
కురు కర్మైవ తస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.

తే॥ గీ॥ నేను సేసితి నను నభి•మానము ఫల
కాంక్ష లేని ముముక్షులే • కర్మ లాచ
రించి; రా జనకాదుల • మంచిదారిఁ
జేరి నీవు స్వకర్మలఁ • జేయు మయ్య. ౧౫

---

వివరణము*తే॥గీ॥ ప్రకృతిఁ బుట్టెను సత్వమ్ము • రజము తమసు;
రజము సత్వతమమ్ములఁ • గ్రిమతఁ గలిసి
సత్వమును, సత్వరజము, రజ స్తమమ్ము
తమము...ై ... • ...

శ్లో॥ కిం కర్మ కి మకర్మేతి కవయో ఒప్యత్ర మోహితాః
తత్తే కర్మ ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మోక్ష్యసే ఒశుభాత్.

తే॥ గీ॥ కర్మమనఁగ నదేద్ది? య కర్మమెద్ది?
యను విషయమందుఁ గవులె మోహంబు గందు;
రశుభమును వీడి ముక్తిని విశదముగను
దేన నందగలవో దానిఁ దెలుపఁ గలను. ౧౬

శ్లో॥ కర్మణో హ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః.

తే॥ గీ॥ శాస్త్రసమ్మత మగుకర్మ సరణి నెఱుఁగు
శాస్త్రవిమతంబునగు కర్మ సార మెఱుఁగు
కర్మ రహితత్వ మెట్టిదో కలయఁ దెలియు
కర్మతత్త్వంబు దెలియ, దుష్కరము సుమ్ము. ౧౭

శ్లో॥ కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః
స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్.

తే॥ గీ॥ చేయలే, దేను గర్మలు; చేసె నింద్రి
యంబు, లనుచును దాఁ గర్మ యం దకర్మ;
నా యకర్మను గర్మంబు నట్లు కనిన
ఘనుఁడు మతిశాలి యోగియుఁ గర్మవిదుఁడు. ౧౮

శ్లో॥ యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం త మాహుః పండితం బుధాః.

తే॥ గీ॥ కోరికలు పెట్టికొనకుండఁ గొలఁదిమీఱ
కెతఁడు కర్మలు సేయునో యతఁడు జ్ఞాన
వహ్నిచే దహియింపంగఁ బడినకర్మ
గల్గు పండితుఁ డని బుధుల్ పలుకుచుందు్రు. ౧౯

శ్లో॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః.

తే॥ గీ॥ నిరత తృప్తుండు స్వాశ్రియ • విరహితుండు
కర్మఫల సంగరహితుండు•గాఁ, గలిగిన
వాఁడు, కర్మల చేసిన • వాఁడు నైనఁ
జేయ నటువంటి వాఁడుగాఁ • జెప్పనౌను. ౨౦

శ్లో॥ నిరాశీ ర్యతచిత్తాఽఽత్మా త్యక్తసర్వపరిగ్రహః
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాఽఽప్నోతి కిల్బిషమ్.

తే॥ గీ॥ స్వాంతమును నాత్మనుం దన • వశముచేసి
యన్నియుం గొంటమాని యే • యాశ లేక
కేవల శరీర పోషణ•కే పనులను
జేయువాఁడెట్టి దోషంబు • జెందఁబోడు. ౨౧

శ్లో॥ యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే.

తే॥ గీ॥ తలఁపు లేక దొరకుదానఁ • దనివిఁ జెంది
జంట లన్నింటివీడి మ•చ్చరము దొలఁగి
కలుగుటకుఁ గల్గకుంటకుఁ • గలఁగకుండి
పనులఁ జేసెడు నాతండు • పట్టువడఁడు. ౨౨

శ్లో॥ గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే.

తే॥ గీ॥ అడఁగినటువంటి యాశలు • నుడిగినట్టి
బంధములు జ్ఞాననిశ్చల • ప్రజ్ఞ గలుగు
ప్రాజ్ఞుఁ డగువాని యజ్ఞార్థ•మైన కర్మ
శేష మేమియు లేక న•శించి పోవు. ౨౩

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా.

తే॥ గీ॥ అర్పణమ్ము హవిస్సు హో•మాగ్ని హోమ
కర్తృ కర్మాదికము బ్రహ్మ•గా నెఱుంగు
బ్రహ్మకర్మసమాధిస్థు • వలనఁ జెందఁ
బడిన యజ్ఞఫలముగూడ • బ్రహ్మమౌను. ౨४

శ్లో॥ దైవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞే నై వోపజుహ్వతి.

తే॥ గీ॥ కొంద అగు యోగివర్యులు • కొల్తు్రి దైవ
యజ్ఞమును, బ్రహ్మమను వహ్ని•యందు; యజ్ఞ
రూప మగు నాత్మ యజ్ఞ స్వ•రూపముననె
గొందఱు లయించుచుందురు • కురువరేణ్య! ౨౫

శ్లో॥ శ్రోత్రాదీ నీంద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి.

తే॥ గీ॥ సంయమాగ్నిని గొందఱు • చక్షువు మొద
లైన యింద్రియముల నెల్ల • నణఁచుచుందు్రి
వే అయినవారు శబ్దాది • విషయములను
నింద్రియాగ్నిని వేల్చుచు • నుందు రెపుడు. ౨౬

శ్లో॥ సర్వా ణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాऽపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే.

తే॥ గీ॥ క్రిమతఁగొందఱు నింద్రియ • కర్మములను
బ్రాణకర్మల నెఱుకచేఁ బ్రజ్వరిల్లు
నాత్మ నరికట్టు టనెడు యోగాగ్నియందు
లయము గావించి భావింతు్రి • లక్ష్యదృష్టి. ౨౭

శ్లో॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః.

తే॥ గీ॥ కొందఱు తపోమఖంబును • గొంద ఱాగ
మాధ్యయనయోగయజ్ఞంబు • న ప్పదార్థ
దానయజ్ఞంబు గొందఱు • జ్ఞానయజ్ఞ
మన్యులు శితవ్రతాధ్వరం • బాచరింత్రు. ౨౮

శ్లో॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః.

తే॥ గీ॥ ఇంకఁ గొందఱు కుడిముక్కు • వంకగాలిఁ
బీల్చియుంచియు, డావంక • విడిచి యట్లె
యెడమముక్కునఁ బీలిచి • విడి కుడిదెస
రెంటి బిగియించి యొక్కఁడౌ • రీతినుంత్రు. ౨౯

శ్లో॥ అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః.

తే॥ గీ॥ బైటిగాడ్పుల వానిలో • నాటియుంచి
లోనిగాడ్పుల నవ్వాని • లో లయించి
నియమితాహారు లగువారు • నిఖిలయజ్ఞ
కర్మము లెఱింగి కలుషమ్ము • గడచుచుంద్రు. ౩౦

శ్లో॥ యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనం
నాయం లోకో స్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ.

తే॥ గీ॥ అర్జునా! యజ్ఞము లొనర్చి • యజ్ఞశేష
మైన యమృతాన్నముం దిను • నట్టివాఁడు
ఆ సనాతన బ్రహ్మంబు • నం దయజ్ఞు
నకు నిహమె లేదు నెట్టు ల • పరములు గలుగు. ౩౧

శ్లో॥ ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజాన్ విద్ధి తాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే.

తే॥ గీ॥ ఇట్లు బ్రహ్మముఖమున న • నేక యజ్ఞ
వర్గములు విస్తరింపంగ • బడిన వయ్యో
వానినిం గర్మజములైన • వానిఁగాఁగఁ
దెలిసికొని ముక్తుఁడవు కమ్మ • ధీరవర్య! ౩౨

శ్లో॥ శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఽఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే.

తే॥ గీ॥ పగఱఁ దపియింపఁ గలిగిన • పార్థ! ద్రవ్య
సాధ్యమగు యజ్ఞమునకంటె • జ్ఞానసాధ్య
మైన యజ్ఞంబు శ్రేష్ఠమౌ • సద్దులేక
యన్ని కర్మలు జ్ఞానమం • దణఁగియుంట. 33

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః.

తే॥ గీ॥ బ్రహ్మమం దనుభవ మున్న • వారలైన
జ్ఞానులకు సేవసేసియు • సాగిలిపడి
మ్రొక్కి కావలసిన ప్రశ్న • ములను వేసి
వారి జ్ఞానోపదేశమ్ముఁ • బడయు పార్థ! 3౪

శ్లో॥ యద్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి.

తే॥ గీ॥ దేనిఁ దెలిసికొనిన నీవు • తిరిగి మోహ
మందవో? దేనిచేత భూ • తావళులను
సారిది నీయందు నాయందుఁ జూడఁగలవో?
తేటఁగా జ్ఞానమది యని • తెలియు పార్థ! 3౫

శ్లో॥ అపిచే దసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి.

తే॥ గీ॥ పాపములఁ జేసినటువంటి ♦ వారికంటె
బాపుఁడవు నైన సకలమౌ ♦ పాపపంక్తి
సాగరంబును దాటింపఁ ♦ జాలినయది
జ్ఞాన మను తెప్పయేకాద ♦ మానవేంద్ర.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున!
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.

తే॥ గీ॥ రగులఁ జేయంగఁబడు నగ్నిఁ ♦ బొగిలియున్న
కట్టియల భస్మముం జేయు ♦ కరణి నెపుడు
జ్ఞాన మనియెడు వహ్నియు ♦ సర్వకర్మ
సంతతుల భస్మముం జేయఁ ♦ జాలుపార్థ.

శ్లో॥ న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి.

తే॥ గీ॥ జ్ఞాన సదృశం బగు పవిత్ర ♦ మైన యద్ది
గానఁగా నెందు లేదు; యో ♦ గంబువలన
సిద్ధిఁ బడసినవాఁడు ప్ర ♦ సిద్ధకాల
వశముననను బొందు నాత్మలో ♦ స్వయముగాను.

శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాఽధిగచ్ఛతి.

తే॥ గీ॥ జ్ఞానమును బొందు నాసక్తిఁ ♦ గల్గువాఁడు
ప్రబల మగు నింద్రియములఁ గె ♦ ల్వంగఁ ♦ జాలు
నట్టివాఁడును శ్రద్ధచే ♦ నలరువాఁడు
జ్ఞానియై శీఘ్రముననను మో ♦ క్షంబునందు.

శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్దధాన శ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకో ౽స్తి న పరో న సుఖం సంశయాత్మనః.

తే॥ గీ॥ జ్ఞానమును శ్రద్ధ లేకుండి ♦ సంశయాత్ముఁ
డై నవాఁడు నశించును ♦ నాత్మయందు
సంశయము గల్గు వాని కీ ♦ జగములేదు
పరము లేదు సుఖంబును ♦ పరగ లేదు. ౪౦

శ్లో॥ యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ.

తే॥ గీ॥ పరమయోగంబునను వీడఁ ♦ బడినయట్టి
కర్మములు జ్ఞానమున వీడఁ♦గాను బడిన
సంశయంబులు గల జ్ఞాని ♦ సర్వకర్మ
సంతతులు నెట్లు బంధింపఁ ♦ జాల వనుము. ౪౧

శ్లో॥ తస్మా దజ్ఞానసంభూతం హృత్థ్సం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత.

తే॥ గీ॥ భారతా! తెల్వితక్కువ ♦ వలన గలుగు
నట్టి సంశయలతల నీ♦యాత్మగలుగు
జ్ఞానమను కత్తిచేతను ♦ సంహరించి
కర్మయోగంబు బూని వే♦గంబ లెమ్ము. ౪౨

ఇది చతుర్థాధ్యాయము.



ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

# శ్రీహానుమద్భగవద్గీత

## పంచమాధ్యాయము

## కర్మసన్న్యాసయోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పున ర్యోగం చ శంససి
య చ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితం.

తే॥ గీ॥ అచ్యుతా! కర్మలను వీడు మంటివి, కోర్కె
హరణ మొనరించి యోగంబు జరుపుమంటివి,
కనఁగ రెంటను నెది చేయఁగాఁ దగినదో?
వివరముగఁ దెల్పఁగదవయ్య వేడ్కతోడ.

భగవా నువాచ—

శ్లో॥ సన్న్యాసః కర్మయోగ శ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయో స్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే.

తే॥ గీ॥ *కర్మసన్న్యాసమేగాని, కర్మయోగ
మేని రెండును మోక్షంబు నియ్యఁగలవు;
వాని రెంటను గర్మలు మూని యుంట
కంటెఁ గర్మలు సేయుటే కరము మేలు.

*తే॥గీ॥ కామ్యకర్మంబులను వీడఁగాను వలయు
నైన నిష్కామ కర్మ చేయంగ వలయుఁ
గర్మ లంటక యుండు నకర్త నైనఁ
గర్మ సేయఁ బ్రకృతిచేతఁ గరవటి.

శ్లో॥ జ్ఞేయ స్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో! సుఖం బంధా త్ప్రముచ్యతే.

తే॥ గీ॥ గొప్పచేతులు గలవాఁడ! ♦ కోర్కెలేక
పగతనము లేక యుండెడి ♦ వాఁడు నిత్య
యోగియగు నట్టి నిర్ద్వంద్వ ♦ యుక్తుఁ డెపుడు
సులభముగ బంధములనుండి ♦ తొలఁగ గలఁడు. 3

శ్లో॥ సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలమ్.

తే॥ గీ॥ జ్ఞానహీనులు *సాంఖ్యయోగములు రెండు
వే ఱనఁగ జ్ఞానవంతు ల ♦ భేద మండ్రు
వాని రెంటను నొక్కండ ♦ తాను సేయు
వాఁడు రెంటి ఫలంబును ♦ బడయుచుండు. ౪

శ్లో॥ య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి.

తే॥ గీ॥ జ్ఞాననిష్ఠులు నే యాత్మఁ ♦ గాంచఁగలరొ?
కర్మయోగులు నా యాత్మఁ ♦ గాంచఁగలరు
జ్ఞానకర్మయోగంబు లొ ♦ క్కటి యటంచు
గాంచువాఁడు మోక్షంబును ♦ గాంచువాఁడు. ౫

* తే॥గీ॥ తన నెఱుఁగు తెల్వితోఁ గోర్కె ♦ దగులకుండ
సలుపనటువంటి పని నెనూ ♦ సాంఖ్య మండ్రు
జంట లన్ని యొకటి సేయఁ ♦ జాలు బుద్ధి
[illegible] ♦ యోగ మండ్రు.

శ్లో॥ సన్న్యాస స్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః
యోగయుక్తో ముని ర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి.

తే॥ గీ॥ గొప్పచేతులు గలవాఁడ! ♦ కోర్కి లేని
పనులు సేయక సన్న్యాస♦మును బడయుట
కష్టతర మగు; కర్మయో♦గంబుఁ గూడు
వాఁడచిరకాలమున బ్రహ్మ♦పదముగాంచు. ౬

శ్లో॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వ న్నపి న లిప్యతే.

తే॥ గీ॥ కర్మయోగంబు వీడక ♦ గడపువాఁడు
విమలచిత్తుండు నిర్జిత ♦ విషయ దేహు
డంతరాత్మయుఁ దానయి ♦ యఖిలకర్మ
లాచరించిన వానికి ♦ నంట కుండు. ౭

శ్లో॥ నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శ్రుణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్
గచ్ఛన్ స్వపన్ శ్వసన్.

తే॥ గీ॥ మఱియు దననిజమును దాను ♦ నెఱుగువాఁడు
తాను గనుచున్న, వినుచున్నఁ ♦ దాకుచున్న,
మూరుకొనుచున్నఁ దినుచున్నఁ ♦ బోవుచున్నఁ
గునుకుచున్నను నూపిరిఁ ♦ గొనుచు నున్న
నించుకయుఁ జేయలేదంచు ♦ నెంచుచుండు. ౮

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి
ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్.

తే॥ గీ॥ మాటలాడుచు నుండిన ♦ మలము మూత్ర
మును విడుచుచున్న నాహార♦ములను గొనుచు
నున్నఁ గనుమూయఁ దెఱచిన ♦ నన్నియింద్రి
యములు విషయంబులఁ జరించు ♦ నని తలంచు. ౯

శ్లో॥ బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్ర మి వాంభసా.

తే॥ గీ॥ ఎవడు తాఁజేయు కర్మల ♦ నీశున కిడి
ఫలముఁ గోరక చేయునో? ♦ వరఁగవానిఁ
బాపజాలంబు లంటక ♦ పాఱిపోవుఁ
దామరాకునకును నీరు ♦ తాకనట్లు. ౧౦

శ్లో॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాऽత్మశుద్ధయే.

తే॥ గీ॥ కర్మయోగు లాత్మకు శుద్ధి ♦ గలుగుకొఱకు
మమతను ఫలంబులను వీడి ♦ మనసుచేత
నొడలిచే బుద్ధిచేతను ♦ యుక్తకర్మ
లింద్రియంబులచే నొన♦రించుచుంద్రు. ౧౧

శ్లో॥ యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే.

తే॥ గీ॥ కర్మ లీశు కొఱకుగాని ♦ కావు నాకు
ననెడు నాతండు తత్ఫలం♦బును త్యజించి
కాంచు నైష్ఠిక శాంతినిఁ ♦ గామవశత
ఫలము గోరి యయుక్తుండు ♦ బంధితుఁడగు. ౧౨

శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్నకారయన్.

తే॥ గీ॥ మూఁడు మూఁడులు వాకిండ్ల • తోడనుండు
నొడలు నందు మనసుచేత • విడిచి కర్మ
లేది చేయక చేయింప • కిందిరియముల
వశముచేసి కొనినవాఁడు • పడయు సుఖము. ౧౩

శ్లో॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే.

తే॥ గీ॥ ప్రభువు లోకంబునకును గ•ర్మములుచేయు
బాధ్యతయుఁ గర్మఫలముల • వలన దగుల
మును సృజింపఁడు కర్తృత్వ•మును ఘటింపఁ
డెంచగ స్వభావమే ప్రవ•ర్తించుచుండు. ౧౪

శ్లో॥ నాదత్తే కస్యచి త్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః.

తే॥ గీ॥ ప్రభువుజనముల పుణ్యపా•పములఁ గొనఁడు
జ్ఞానమును గప్పివేయు న•జ్ఞానమెపుడు
నందుచేతను సంసార • మందు మునుగు
ప్రాణికోటియు మోహంబు • నూను చుండు. ౧౫

శ్లో॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్.

తే॥ గీ॥ జ్ఞానసంపద నెవరి య•జ్ఞాన మడఁగి
పోవునో వారి, సూర్యునిఁ • బోలజాలు
తత్పరంబైన జ్ఞానంబు • తనకుఁ దెలియఁ
దగినవస్తుల వెలిగింపఁ • దనరియుండు. ౧౬

శ్లో॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః

తే॥ గీ॥ జ్ఞానమునఁ బాపము లడంపఁ • జాలువారు
బ్రహ్మమున బుద్ధి గల్గిన • వార లగుచు
యదియె తామయి యద్దాని•యందు నిలిచి
యది గతిగ నెంచి పుట్టుక • లందకుందురు. ౧౭

శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.

తే॥ గీ॥ *విద్య వినయంబుఁగల్గిన • విప్రు నావు
హస్తినిం గుక్క నద్దాని • నారగించు
మాలవానిని సమముగ • బ్రహ్మవేత్త
యైన వాఁ డాత్మయే యని • యాత్మనెంచు. ౧౮

శ్లో॥ ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః.

తే॥ గీ॥ ఎవరి మది సమభావంబు • నెసఁగుచుండు
వార లీ లోకమున జన్మ • వదలువారు
అట్టి సమతయె నిర్గు•ణంబైన బ్రహ్మ
దాన వారలు బ్రహ్మంబు • దవిలియుందురు. ౧౯

శం. భా. * తే॥గీ॥ బ్రాహ్మణుఁడు సత్వగుణుఁడైన • ప్రబలగోవు
లా రజోగుణమైనను • హస్తిశునక
శునకమాంసాశనులు తమో•జనితులైన
బ్రహ్మదృష్టిని [illegible] • [illegible] బుధులు.

శ్లో॥ న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః.

తే॥ గీ॥ నిరతబుద్ధి యుతుఁడు మోహ • నిరసనుఁడగు
బ్రహ్మవేత్త ప్రియంబంది • ప్రమదమందఁ
డప్రియం బంది దుఃఖింపఁ • డాత్మయందు
నవ్యయానంద సంపూర్ణుఁ • డగుచునుండు. ౨౦

శ్లో॥ బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే.

తే॥ గీ॥ ఆత్మయందున వెలుఁగు • నన్నివిషయ
ములను గోర్కుల వీడినఁ • బొందు సుఖము
అతఁడు బ్రహ్మానుసంధాన • మనవరతము
నక్షయంబైన దానిగా • ననుభవించు. ౨౧

శ్లో॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః.

తే॥ గీ॥ కుంతికొమరుఁడ! యింద్రియ • కులము వలనఁ
గలుగు భోగంబు లాద్యంత • ములను గల్గి
నట్టివౌటను దుఃఖంబు • నందఁజేయు
నందుచే జ్ఞాని వాని యం • దాసగొనఁడు. ౨౨

శ్లో॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః.

తే॥ గీ॥ మేను విడుచుటకు న్ముందు • మిక్కిలిగను
గామమునఁ గోపమునఁ గల్గు • కలుషరూప
వేగము సహించుటకుఁ జాలు • వెరవుగన్న
వాఁడు యోగియు సుఖియగు • వాఁడె సుమ్మ. 33

శ్లో॥ యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతి రేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మ భూతోఽధిగచ్ఛతి.

తే॥ గీ॥ ఆత్మయందు సుఖము గాంచు • నట్టివాఁడు
ఆత్మయందు రమించెడు • నట్టివాఁడు
ఆత్మయందుఁ బ్రకాశించు • నట్టియోగి
బ్రహ్మభూతుఁడై మోక్షమ్ముఁ • బడయఁగలఁడు. ౨౪

శ్లో॥ లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః.

తే॥ గీ॥ క్షీణమగు పాపము గలారు • ఛిన్నమైన
సంశయమును గలారు ని•శ్చలమునైన
చిత్తముంగలవారు మ•హత్తరమగు
భూతహితు లగు జ్ఞానులు • ముక్తిగాంతురు! ౨౫

శ్లో॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనామ్.

తే॥ గీ॥ గెలిచినటువంటి కోర్కెయుఁ • గినుకఁగలుగు
వారు నిలుకడ యుండిన • స్వాంతముగల
వారు నగు నాత్మవేత్తలు • నారయంగ
నిందునందును మోక్షంబు • నందఁగలరు. ౨౬

శ్లో॥ స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం
శ్చక్షు శ్చైవాన్తరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా
నాసాభ్యంతరచారిణౌ.

తే॥ గీ॥ ఎవ్వఁ డొడలికి వెలిఁబుట్టి • యెదను దూరు
నట్టి చప్పుడు తాకుడు • లైదుబైల
నొక్కి చూపు బొమల నడు•చక్కి నిల్పి
ముక్కు గాడ్పుల నడఁజేసి • యొక్కటిగను. ౨౭

శ్లో॥ యతేంద్రియమనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః.

తే॥ గీ॥ ఇంద్రియ మనోమనీషల • నెల్లగెల్చి
కామక్రోప భయాదులఁ • గడకుఁద్రోచి
మోక్షమున సక్తుడై ధ్యాన•మున వెలుంగు
వాఁడు నిత్యము ముక్తుఁడౌ • వాఁడు సుమ్ము. ౨౮

శ్లో॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి.

తే॥ గీ॥ ఘనతపోయజ్ఞ ఫలముల • ననుభవించు
నతనిఁగా సర్వలోకని•యామకునిగ
సకలభూతోపకారిగా • జగతి నన్నుఁ
దెలియు నాతండు శాంతిని • నొలయువాఁడు. ౨౯

ఇది పంచమాధ్యాయము.

ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్భగవద్గీత

## షష్ఠాధ్యాయము

### ఆత్మసంయమయోగము

శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః.

తే॥ గీ॥ అఖిల కర్మఫలంబుల • యంటుఁ గొనక
పార్థ విధ్యుక్త కర్మ చే • యంగలాఁడు
కఠిన సన్న్యాసి, యోగియై • కాలువాఁడు,
నిష్క్రియుండు, నిరగ్ని యెం • తేని గాఁడు. ౧

శ్లో॥ యం సన్న్యాసమితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన.

తే॥ గీ॥ పార్థ! సన్న్యాస మని యేది • పల్కఁబడెనో?
అదియ యోగమటంచు నీ • వాత్మఁ దెలియు
పో విడని యట్టి సంకల్ప • ములను గల్గు
వాఁడు నెవ్వఁడయిన యోగి • గాఁడు సుమ్ము. ౨

శ్లో॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే.

తే॥ గీ॥ యోగమున ముక్తిఁ గాంచఁగా ♦ నూహ చేయు
మునికిఁ గర్మంబె సాధన♦ము నగు నట్టి
యోగ మందినవాని క♦త్యుత్తమ మగు
శమము సాధన మని పల్కఁ♦జనును సుమ్ము. 3

శ్లో॥ యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్యతే
సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే.

తే॥ గీ॥ ఎప్పు డన్ని తలంపుల ♦ నెసఁగ వదలి
కనులచూపు చెవుల చప్పు♦డును పనులను
బొడము తగులము వీడు న♦ప్పుడు గదయ్య
జనుల చేత యోగారూఢుఁ ♦ డనఁగఁబడును. ౪

శ్లో॥ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః

తే॥ గీ॥ తాను దనశక్తిఁ దనను నె♦త్తంగవలయుఁ
దాను గ్రిందఁ దనను ద్రోయఁ ♦దలఁపరాదు
తనను నెత్తంగఁ బడఁద్రోయ ♦ దానె కుదురు
తనకుఁ జుట్టము పగవాఁడు ♦ తానసుమ్ము. ౫

శ్లో॥ బంధు రాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః
అనాత్మన స్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్.

తే॥ గీ॥ తన మదిని వశముగఁ జేసి♦కొనినవాఁడు
తనకుఁ దాఁ జుట్టమై సాయ♦మును నొనర్చుఁ
దన మదినిఁ గెల్వఁ జాలని ♦ పనికిమాలు
వాఁడు దనకును దాఁ బగ♦వాఁడు నగును. ౬

శ్లో॥ జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః.

తే॥ గీ॥ చలికి వేడికి మేలు కీ•డులకు నట్లె
మానమునకును నయ్యవ•మానమునకుఁ
గలఁతఁబడక జితాత్ముఁడై • యలరు నట్టి
పరమశాంతున కాత్మాను•భవము గలుఁగు. ౭

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః.

తే॥ గీ॥ జ్ఞానవిజ్ఞాన సంతృప్తుఁ•డైనవాఁడు
కనక మృచ్ఛిలల సమతఁ • గాంచువాఁడు
నిర్వికారుండు నిర్జితేం•ద్రియుఁడు నైన
నిశ్చలాత్ముండు యోగియై • నివ్వటిల్లు. ౮

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బంధుషు
సాధుష్వపిచ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥

తే॥ గీ॥ మిత్రులందు సుహృదులందు • శత్రులందు
సాధు బంధు ప్రియాప్రియ • జనములందుఁ
బాపులఁ దటస్థులను హిత•వాదులందు
సమతఁ గనువాఁడు శ్రేష్ఠుండు • శాంతతముఁడు ౯

శ్లో॥ యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః.

తే॥ గీ॥ యోగియగువాఁడు గుట్టుగా • నొంటినుండి
యింద్రియ మనశ్శరీరంబు • లెలమిఁ గెల్చి
కోర్కెలను వీడి దేనిఁ గై•కొనక యుండి
నిరతమును యోగమున నాత్మ•నిల్పవలయు. ౧౦

శ్లో॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాఽజిన కుశోత్తరమ్.

తే॥ గీ॥ దివ్యమును శుద్ధమైన ప్రదేశమందుఁ
గరము నెత్తును బల్లంబు ♦ గానియట్టి
కుశల నజినవసనములం ♦ గూర్చినట్టి
చక్కఁ గదలక యుండు నా♦సనము పఱచి. ౧౧

శ్లో॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే.

తే॥ గీ॥ పఱచు చిత్తేంద్రియముల వ్యా♦పారములను
నడఁచి వశముగఁ జేసి బా♦హ్యప్రపంచ
వృత్తులను వీడి నిశ్చల ♦ చిత్తుఁ డగుచు
నాత్మ శుద్ధికొఱకు యోగ ♦ మభ్యసించు. ౧౨

శ్లో॥ సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చాఽనవలోకయన్.

తే॥ గీ॥ తలయు మెడయు నొడలును గ♦దలక పట్టి
చూపు బొమలకు నడుమను ♦ సూటిగాను
ముక్కు కొన నుండునట్టుగా ♦ నిక్కఁ జేసి
దెసలఁజూడక మిగుల శాం♦తిని దలిర్చి. ౧౩

శ్లో॥ ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః

తే॥ గీ॥ బ్రహ్మచర్యంబుతో భీతిఁ ♦ బడయకుండ
మదినిఁ గుదియించి నా యందు ♦ మనసునిలిపి
యాత్మశాంతముఁ బొందెడు ♦ నట్లుచేసి
యుక్తుఁడును మత్పరుండును ♦ యుండవలయు. ౧౪

శ్లో॥ యుంజ న్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి.

తే॥ గీ॥ అలర నిట్లెప్పుడు మనో ని•యమము గలిగి
యాత్మ నిత్యయోగాభ్యాస • మందు నిల్పి
యోగి మదధీన మగుచు మ•దుక్తమైన
మోక్షనిష్ఠను గల శాంతిఁ • బొందుఁబార్థ! ౧౫

శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంత మనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున.

తే॥ గీ॥ అమితముగఁ దినువానికి • నబ్బఁబోదు
మొదలె తిననట్టి వానికిఁ • గుదురఁబోదు
నిదురలేనట్టి వానికి • నిదురబోతు
నకును యోగంబు నిలువ ద•నంగవలయు. ౧౬

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా.

తే॥ గీ॥ తగిన తిండియుఁ దగునిద్రఁ • దగిన నడక
తగిన మెలకువఁ జేయంగఁ • దగినకర్మ
లాచరింపంగలానికే • యనవరతము
నార్తిహర మగు నీ యోగ • మబ్బుసుమ్ము. ౧౭

శ్లో॥ యదా వినియతం చిత్త మాత్మ న్యేవావతిష్ఠతే
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా.

తే॥ గీ॥ ఎపుడు తన మది వశమయి • యెసఁగు నాత్మ
యందు లగ్నం బగుచు నుండు • నపుడు సకల
కామములయందు నభిలాష • కడకుఁ ద్రోయ
యోగయుక్తుం డనుచుఁ బల్కు•చుందు రవ్వాని. ౧౮

శ్లో॥ యథా దీపో నివాతస్థో నేఽఙ్గతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః.
తే॥ గీ॥ గాలి లేనట్టి చోటునఁ ♦ గదలకుండ
వెలుఁగుచుండిన దీపమ్ము ♦ విధముగాను
నాత్మను సమాధి నిల్పెడు ♦ నట్టి నియత
చిత్తుఁడగు యోగి కదలక ♦ చెలఁగుచుండు. ౧౯
శ్లో॥ యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మని తుష్యతి.
తే॥ గీ॥ యోగ మభ్యాసముం జేయు♦చున్న వాని
వశమయిన చిత్తమునకును ♦ విశదమైన
శాంతి యెపుడు లభించునో ♦ స్వాంతమునను
ఆత్మసందర్శనం బాత్మ ♦ నపుడు గాంచు. ౨౦
శ్లో॥ సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియం
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః.
తే॥ గీ॥ ఇంద్రి యాతీతమై బుద్ధి ♦ నెఱుఁగఁబడిన
నిరతిశయమగు సుఖమును ♦ గుఱుతెఱిఁగిన
యట్టి యోగి తత్త్వ స్థితుఁ♦డగుచు నుండి
చలన మిసుమంత యొందక ♦ యలరుచుండు. ౨౧
శ్లో॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాఽపి విచాల్యతే.
తే॥ గీ॥ ఎవఁడు దేనిని బొందియుఁ ♦ నింతకంటె
గొప్పదగు నన్య లాభంబుఁ ♦ గోరకుండు
దేని యందున సంస్థితుఁ♦డైన పిదప
నెప్పు డధిక దుఃఖమునఁ జలి♦యింపకుండు. ౨౨

శ్లో॥ తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా.

తే॥ గీ॥ దానినే దుఃఖసంబంధ•మైన సంగ
మును దొలంగించు ఘనయోగ•ముగ నెఱింగి
అట్టియోగ మనిర్వేద • మైన మదిని
నిశ్చయమ్ముగ సతతము • నెఱపఁదగును. ౨౩

శ్లో॥ సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమం తతః

తే॥ గీ॥ నిమిష నిమిషము సంకల్ప•నివహమునను
గలుగు కోర్కుల నెల్ల మి•గులక యుండ
విడిచి; మదిచేత నింద్రియ • విస్తరమును
నిరతరాభ్యాసమున యందు • నిగ్రహించి. ౨౪

శ్లో॥ శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించి దపి చింతయేత్.

తే॥ గీ॥ ధృతివశం బగు నిశిత బు•ద్ధిం దలిర్చి
విషయములనుండి తిన్నఁగా• విరతిఁ జేర్చి
ఆత్మను మనంబు నిలుచు న•ట్లట్టె తీర్చి
వేరుచింతల నన్నింటి • వీడవలయు. ౨౫

శ్లో॥ యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్.

తే॥ గీ॥ చిత్త మస్థిరముగ యోగ•సిద్ధి నిలక
చంచలంబుగ నందందు • సంచరించు
దాని నాయాయి విషయాళిఁ•దాకకుండ
మరలిచియు నాత్మవశముగాఁ • జరుపవలయు. ౨౬

శ్లో॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్.
తే॥ గీ॥ బ్రహ్మభూతుండు పాపవి◆వర్జితుండు
ప్రశమితరజోమనస్కుఁడై ◆ పరగువాఁడు
నైనయోగీశ్వరుండు ని◆రంతరంబు
నుత్తమంబైన సుఖమును ◆ నొందుచుండు. ౨౭

శ్లో॥ యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే.
తే॥ గీ॥ అనవరత మిట్లు యోగంబు ◆ నందు నాత్మ
నిలిపి గతకల్మషుండయి ◆ యలరుయోగి
బ్రహ్మ సంబంధమైనట్టి ◆ పరమ సుఖము
కష్ట మించుక లేకయ ◆ కాంచుచుండు. ౨౮

శ్లో॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః.
తే॥ గీ॥ అన్నిఁటను సమదర్శనుఁ◆డైనవాఁడు
యోగయుక్తాత్ముఁడైనట్టి ◆ భాగవతుఁడు
ఆత్మనే యన్నిభూతాల ◆ యందుఁ గాంచు
నన్నిభూతాల నా యాత్మ ◆ యందుఁగాంచు. ౨౯

శ్లో॥ యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి
తే॥ గీ॥ భూతములయందు నన్నును ◆ భూతములను
బరగ నా యందు నెవ్వాఁడు ◆ పాఱఁజూచు
వానికిని నేను లేనట్టి◆ వాఁడగాను
వాఁడు నాకును గానట్టి◆వాఁడుగాఁడు. 30

శ్లో॥ సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే.

తే॥ గీ॥ ఎవ్వఁ డేకత్వమును బొంది ♦ యెల్లభూత
ములను గల నన్ను భావించి ♦ పొందుచుండు;
అట్టియోగి సమస్తంబు ♦ లైనపనుల
యందు వర్తించినను నన్నుఁ ♦ బొందుచుండు. ౩౧

శ్లో॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా? యదివా దుఃఖం? స యోగీ పరమో మతః

తే॥ గీ॥ అర్జునా ! సుఖమైనను ♦ దుర్జయమగు
దుఃఖమైన భూతంబులం♦దుఁ దనయందు
సర్వ సమభావముగఁ జూడఁ ♦ జాలు యోగి
యుత్తమోత్తముఁ డని పల్క ♦ నొప్పువాఁడు. ౩౨

అర్జున ఉవాచ—

శ్లో॥ యోఽయం యోగ స్త్వయా ప్రోక్త
స్సామ్యేన మధుసూదన
ఏత స్యాహం న పశ్యామి
చంచలత్వాత్ స్థితిం స్థిరామ్.

తే॥ గీ॥ మధు వనెడువాని దుమ్రించిన ♦ మాధవుండ!
సర్వ సమభావమున యోగ♦సరణిఁ దెలియఁ
బలికితివి నా మనమ్ము చం♦చలము నగుట 33
కనఁగలేకుంటి తిరమైన ♦ యునికి నేను.

శ్లో॥ చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢం
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్.

నిరోష్ఠ్యము॥ కృష్ణ! నాయెద చంచల ♦ క్లేశకారి
ఘనశరీరేంద్రియాళిని ♦ గలచఁ గలది
నిగ్రహించంగ నేరక ♦ నిల్చినాఁడ
గాలి నరికట్టరానట్టి ♦ కష్టరీతి. ౩౪

శ్రీభగవా నువాచ—

శ్లో॥ అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.

తే॥ గీ॥ గొప్పచేతులుగలవాఁడ! ♦ గొంతికొడుక!
చంచలంబును గెలువంగఁ ♦ జాలనిదియు
మదియనుట సందియమ్ము లే ♦ దదియు నడఁగ
వలయు నభ్యాస వైరాగ్య♦ముల నిజముగ. ౩౫

శ్లో॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః

తే॥ గీ॥ మనసు నిల్కడలేనట్టి ♦ మానవుండు
యోగమును బొందుటకు నశ♦క్యుండు సుమ్మ
మనసు స్వాధీనముగఁ జేసి♦కొనినవాఁడు
యోగము నుపాయమువలన దా ♦ నొందఁగలఁడు. ౩౬

అర్జున ఉవాచ—

శ్లో॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి.

తే॥ గీ॥ కృష్ణ! యే మాత్రము ప్రయత్న • మెఱుఁగనట్టి
శ్రద్ధఁగలవాఁడు యోగసం•చలితమైన
మనముననుయోగసంసిద్ధిఁ • గనఁగలేక
యేగతిని బొందునో నాకు • నెఱుఁగఁ బల్కు. 3౭

శ్లో॥ కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి.

తే॥ గీ॥ పరమపూరుష! యాశ్రియ•బలములేక
బ్రహ్మమును దెలియఁ గలట్టి • పథ మెఱుఁగక
జ్ఞానయోగములకుఁ జెడి • సంచలనము
పొందు మేఘంబు గతి చెడి • పోవ డొక్కొ?. 3౮

శ్లో॥ ఏ తన్మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్య శేషతః
త్వ దన్య స్సంశయ స్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే.

తే॥ గీ॥ కృష్ణ! నాకు గలుగునట్టి • హృదయ సంశ
యంబు దీర్ప సమర్థుండ • వగుదు వీవు
నీవు గాకుండ నాదు సందేహ మెవఁడు
దీర్చుటకుఁ జాలు నీ జగ•తీ స్థలమున. 3౯

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ పార్థ నైవేహ నాఽముత్ర వినాశ స్తస్య విద్యతే
సహి కళ్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి.

తే॥ గీ॥ ఓపృథాసుత! తాత! యీ•యుర్వియందు
జ్ఞాన కర్మయోగంబుల • గతికిఁ జెడిన
వాని కొదవదు చెడు గిహ•పరములందు
దుర్గతిని శుభకరుఁ డెట్లు • దొరయఁగలఁడు. ౪౦

శ్లో॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే.

తే॥ గీ॥ యోగసంసిద్ధిఁ గాంచక • యున్నవాఁడు
పుణ్యవంతుల లోకముల్ • పొంది యందు
బహుళవత్సరములు సుఖ•పరత నిల్చి
యవలఁ బరిశుద్ధ ధనిక గే•హమునఁ బొడము. ౪౧

శ్లో॥ అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్.

తే॥ గీ॥ అట్లు గాకున్న ధీమంతు•లైన యట్టి
యోగుల కులంబు లందేని • యుద్భవించు
శుద్ధుఁ డర్థేశుఁ డగువాని • సుతుఁడు నగుట
కంటె మేల్ ధీరుఁడగు యోగి • కదఁ గలుగు ట.౪౨

శ్లో॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురు నందన.
తే॥ గీ॥ అర్జునా! యోగికులమున • నవతరించి
పూర్వతనుబుద్ధియోగంబు • బొందుచుండు
యట్లు పొంది యనేకంబు•లైన రెట్లు
యోగ సిద్ధికి యత్నంబు • లూని సల్పు. ౪౩
శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోపి సః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే.
తే॥ గీ॥ పూర్వజన్మంబునం జేయు • పుణ్యయోగ
మునన బలవంతమున యోగ•మునను జేరు;
యోగ మభ్యాసముగఁ జేయు•చుండి కూడఁ
గడునఁ గలఁడు శబ్ద బ్రహ్మ•గతిని పార్థ! ౪౪
శ్లో॥ ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్.
తే॥ గీ॥ ఇట్టు లగు పూన్కి యత్నించు•నట్టి యోగి
పాపములఁ బాసి పరిశుద్ధిఁ • బడసి పిదప
సకల జన్మార్జిత జ్ఞాన • సమితిచేతఁ
బరమ మైనట్టి సద్గతిఁ • బడయఁ గలఁడు. ౪౫
శ్లో॥ తపస్విభ్యో ఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవాఽర్జున.
తే॥ గీ॥ భూరితప మొనరించెడు • మునులకంటె
శాస్త్ర పరిచితు లగు జ్ఞాని•చయముకంటె
భక్తిమైఁ జేయఁగల కర్మ•పరుల కంటె
యోగి యధికుం డగుం గాన • యోగి వగుము. ౪౬

శ్లో॥ యోగినా మపి సర్వేషామ్ మద్గ తే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యో మామ్ స మే యుక్త తమో మతః.
తే॥ గీ॥ సకలయోగుల నాయందు • సంగత మగు
నంతరాత్మను గల్గి శ్రద్ధాన్వితుఁ డయి
యెవఁడు నన్నుఁ గొల్చునో యాతఁ • డెక్కుఁడైన
శ్రేష్ఠతముఁడని పల్కంగఁ • జెల్లు సుమ్ము. ४२

ఇది షష్ఠాధ్యాయము.



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ హానుమద్భగవద్గీత

## సప్తమాధ్యాయము

### విజ్ఞానయోగము

శ్రీభగవానువాచ—

శ్లో॥ మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మామ్ యథా జ్ఞాస్యసి తచ్ఛృణు.

తే॥ గీ॥ అర్జునా! నా యెడల లగ్న • మైన మదిని
హార్షమున యోగపరుఁడవై • యాశ్రయించి
శక్తిసంపన్ను నన్ను ని•స్సంశయముగ
నిల్చి కను జ్ఞానమును విను • నెఱిఁబలికెద. ౧

శ్లో॥ జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యా మ్యశేషతః
యద్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే

తే॥ గీ॥ స్వానుభవయుక్తమైన యా • జ్ఞానమేను
నీకొఱకుఁ బల్కుచుంటి దీ•నిని దెలియగ
నింకనొక్కటి దెలిసికో • నేది యుండ
దది వినుతు నీకు తద్జ్ఞాన • మాలకింపు. ౨

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః

తే॥ గీ॥ వేనవేలు జనంబుల•లోన నొకఁడు
నాత్మసిద్ధికి యత్నంబు • నాచరించు
యత్నమును జేయు సిద్ధజ•నాళియందు
కడఁక నాదగు తత్త్వమొ•క్కఁ డెఱుంగు. 3

శ్లో॥ భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా.

తే॥ గీ॥ నేల నీరును నగ్గియు • గాలి, నింగి
మనసు బుద్ధి యహంకార • మనగ నిట్టి
నా ప్రకృతి యష్టవిధముల • నడచుచుండు
నంచుఁ దెలియంగదయ్యా యో• యర్జునుండ. ౪

శ్లో॥ అపరేఽయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్.

తే॥ గీ॥ ఇద్ది యపరప్రకృతి మఱి • యింతకంటె
పరమగుచు జీవరూపమౌ • ప్రకృతి యొకటి
కలదు; లోకమ్ము ధరియించి • వెలుగు నద్ది
పరగ నద్దాని దెలియుము • పార్థ! నీవు. ౫

శ్లో॥ ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా

*తే॥ గీ ఈ పరాపర ప్రకృతులే • యెల్ల భూత
జననమునకును హేతువై • తనరుచుండు
నేను సకల జగమ్ముల • సృష్టి కేని
విలయమున కేని కర్తనై • వెలయుచుండు. ౬

* యతో వా ఇమాని భూతాని జాయంతే.

శ్లో॥ మ_త్తః పరతరం నాన్య త్కించి ద_స్తి ధనంజయ
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ.
తే॥ గీ॥ విను ధనంజయ! నాకంటె ♦ వేరుమిన్న
యైన దొక్కింతయేనియుఁ ♦ గానరాదు
దారమున మానికము లుండు ♦ తీరుగాను
అఖిలజగములు నా యందు ♦ నడరుచుండు. ౭
శ్లో॥ రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాఽస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు.
తే॥ గీ॥ కుంతికొమరుడ! నీళ్ళను ♦ గొరలు రసము
చంద్రసూర్యులఁ గల ప్రకా♦శంబు వేద
ములను నోంకార మాకాశ♦మునను శబ్ద
మును నరులయందు బురుష ల♦క్షణము నేన. ౮
శ్లో॥ పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు.
తే॥ గీ॥ భూమియందుండు నటువంటి ♦ పుణ్యగంధ
మగ్నియందుండు తేజము ♦ నగుదునేను
ప్రాణులం దాయువు మహా త♦పఃప్రభావు
లందు నుండు తపంబును ♦ నగుదు నేను. ౯
శ్లో॥ బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ _స్తేజస్వినా మహం.
తే॥ గీ॥ అర్జునా! నీ వెఱుంగుము ♦ నఖిలభూత
ములకుఁ జిరతరమగు బీజ♦ముగను నన్ను
నధిక తేజము గలవారి ♦ ద్రైన తేజ
మటుల ధీమంతులందు ధీ♦పటిమ నేన. ౧౦

శ్లో॥ బలం బలవతాం చాహం కామరాగవివర్జితం
ధర్మావిరుద్ధో భూతేషు కామోऽస్మి భరతర్షభ.

తే॥ గీ॥ బలయుతుల కామరాగ వి♦వర్జితమగు
బలము నేనని యెఱుగుము ♦ భరతవర్య!
అఖిలభూతమ్ములందు ♦ ధర్మావిరుద్ధ
మైన కామమ్ము నేనని ♦ యాత్మ నెంచు. ౧౧

శ్లో॥ యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చ యే
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషు తే మయి.

తే॥ గీ॥ సత్వగుణ జాతమైనట్టి ♦ శమదమాదు
లా రజోగుణ జాతమౌ ♦ సహము దర్ప
ములు తమోగుణజాతమౌ ♦ మోహశోక
ములును మజ్జనితములుగా ♦ బుద్ధిఁ దెలియు
నశమగును నాకు నే వాని ♦ వశముగాను. ౧౨

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభిస్సర్వ మిదం జగత్
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్

తే॥ గీ॥ *గుణవికారంబు లగు భావ♦కోటిచేత
మోహమునను దగుల్కొన్న ♦ భువనమున ద
దీయభావాళికంటె నెం♦తేని పరుఁడు
నవ్యయుం డగు నను దెలి♦యంగలేరు. ౧౩

*తే॥ గీ॥ పుట్టుటయు బెంపుగాంచుట ♦ గిట్టుటయును
మార్పుఁ జెందుట తగ్గుట ♦ మఱి ముదియుట
నాఱగు వికారములు భువ♦నావళి కగు
కాని బ్రహ్మంబు నం దవి♦ కానరావు.

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే.

తే॥ గీ॥ దైవసంబంధమును గుణ • భావయుక్త
మైన నా మాయ దాట శ • క్యంబుగాదు
నన్ను గురుభక్తిమై శర • ణన్నవారు
దాటఁగలుగుదు రీ మాయఁ దప్పకుండ.   ౧౪

శ్లో॥ న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాఽపహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః.

తే॥ గీ॥ పాపములు సేసినటువంటి • వారు బుద్ధి
హీనులగువారు నీచులౌ • మానవులును
మన్మహామాయఁ దస్కరిం • పంగబడిన
జ్ఞానముగలారలై రాక్ష • సస్వభావ
మంది ననుఁజేరి శరణంబు • నొందలేరు.   ౧౫

శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనాః సుకృతి నోర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ.

తే॥ గీ॥ భరతకులవర్య! యర్జునా! • భక్తి వినుము
నలువురగు భక్తు లెప్పుడు • నన్నుగొల్తు
రార్తుఁడుం దెలియఁగఁ గోరు • నట్టివాఁడు
అర్థకాంక్షుఁడు జ్ఞానియు • నైనవాఁడు.   ౧౬

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం స చ మమ ప్రియః.

తే॥ గీ॥ కాన వారలలో యోగ•మానసుండు
నా యెడ ననన్యభక్తిమై • నడచునట్టి
జ్ఞానియగు వాఁడు నధికుండు • జ్ఞాని కేను
నిష్టుఁడను నాకు నాతండు • నిష్టుఁడగును.

శ్లో॥ ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్
ఆస్థిత స్సహి యుక్తాత్మా మా మేవానుత్తమాం గతిః

తే॥ గీ॥ వీర లందఱును గొప్ప • వా రగుదురు
నైన నవ్వారిలో జ్ఞాని • నాదు నేను
ఏల నన జ్ఞాని నాకంటె • నితరమైన
దేది లే దని నను జేర • నెదను గోరు.

శ్లో॥ బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః

తే॥ గీ॥ ఇలను బెక్కులు జన్మంబు • లెత్తి యెత్తి
పొందు నను జ్ఞాని వాసుదే•వుండె సర్వ
మంచెఱింగి పరేశు న•న్నెంచుచుండు
దొడ్డమదిగలవాఁ డెందు • దొరకబోఁడు.

తే॥ కామై స్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽ న్యదేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా

తే॥ గీ॥ నెఱఁ దమ ప్రభావములచేత • నియతులగుచు
నట్టికోర్కెలచే జ్ఞాన • మడఁగిపోవ
వానికిం దగునటువంటి • వ్రతము లూని
వేఱు వేల్పులఁ బొందెదరు • వా రగుదురు.

శ్లో॥ యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితుమిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్.

తే॥ గీ॥ ఎవ్వఁ డెవ్వఁడు భక్తుండు ♦ నెట్టియెట్టి
వేలుపుల శ్రద్ధ నర్చింప ♦ వేడ్కపడునో
అట్టివారికి నచలమా ♦ నట్టి శ్రద్ధ
ననవరత మేను బలపడు♦నటు లొనర్తు. ౨౧

శ్లో॥ స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామా న్మయైవ విహితాన్ హితాన్.

తే॥ గీ॥ అట్టిదగు శ్రద్ధతో♦గూడి నట్టిభక్తుఁ
డట్టివేల్పుల పూజఁ♦జేయంగఁ గోరు
నక్కతమ్మున నాచేత ♦ నప్పనులకు
దగినఫలములు పొందు ♦ నాతండు మెండు. ౨౨

శ్లో॥ అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్పమేధసామ్
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి.

తే॥ గీ॥ అల్పబుద్ధిని గల్గిన ♦ యట్టివార
లెంచు కర్మఫలము నశి♦యించునదియె
సురల గొల్చెడు వారలు ♦ సురలఁగాంతు
రాత్మభక్తులు మోక్షంబు ♦ నందఁగలరు. ౨౩

శ్లో॥ అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మమావ్యయ మనుత్తమం.

తే॥ గీ॥ అణగ కవ్యక్త ముత్తం ♦ బైన నాదు
పరమమైనట్టి భావమ్ము ♦ పడయలేని
మతివిహీనులు సామాన్య♦మానవునిగ
నన్ను మదిలోన తలపోయు ♦చున్నవారు. ౨౪

శ్లో॥ నాహం ప్రకాశ స్సర్వస్య యోగమాయాసమావృతః
మూఢో౽యం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్

తే॥ గీ॥ యోగమాయావృతుండనై ♦ యున్న నేను
నఖిలమున కప్రకాశుండ ♦ నగుచు నుందు
నవ్యయుండ మనుజుఁడనై ♦ నట్టి నన్ను
మూఢలోకమ్ము తెలియంగఁ ♦ బోదు సుమ్ము. ౨౫

శ్లో॥ వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన.

తే॥ గీ॥ జరిగి నటువంటి కాలాన ♦ జరుగుచున్న
కాలమున, జరుగ గలట్టి ♦ కాలమునను
గలుగు భూతములను గూర్చి ♦ తెలియు నాకు
నందొకండును నను దెలియంగలేదు. ౨౬

శ్లో॥ ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత
సర్వభూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప.

తే॥ గీ॥ పగఱఁ దపియింపజేసెడు ♦ భరత వర్య
కామమున గ్రోధమున యందు ♦ గలుగు ద్వంద్వ
ములను మోహమ్మునందుచు ♦ భూతగణము
పుట్టుతటి నవివేకమ్ము ♦ పొందుచుండు. ౨౭

శ్లో॥ యేషాం త్వంత గతం పాపం జనానాం పుణ్యకర్మణాః
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః

తే॥ గీ॥ పుణ్యకర్మలు నేసిన ♦ పురుష వరులు
తమ కలుష మెల్ల నశియించుఁ ♦ దదుపరి సుఖ
దుఃఖకారణ మోహంబు ♦ దోలివేసి ౨౮
సరళ స్వచ్ఛల భక్తిస న్నెభజింతురు.

శ్లో॥ జరామరణ మోక్షాయ మా మాశ్రిత్య యతంతి యే
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలం.

తే॥ గీ॥ ఎవరు ముదిమిని జావు జ • యించ నెంచి
చేరి నన్నుఁ బ్రయత్నంబు • జేయగలరొ
వారు బ్రహ్మంబుఁ బూర్ణాత్మ • వస్తు సర్వ
కర్మలం దెలిసికొనంగఁ • గలరు సుమ్ము. ౨౯

శ్లో॥ సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదు ర్యుక్తచేతసః.

తే॥ గీ॥ ఎవ్వ రధి భూత మధిదైవ • మవ్వల నధి
యజ్ఞములతోడఁ గూడిన • యట్టినన్ను
నెఱుఁగుదురొ వారు నిలిచిన • యెడను నంత్య
కాలమున నన్నుఁ దెలియంగ • గలరు సుమ్ము. ౩౦

ఇది సప్తమాధ్యాయము.



ఓం

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ హా ను మ ద్భ గ వ ద్గీ త



## అ ష్ట మా ధ్యా య ము



## అ క్ష ర ప ర బ్ర హ్మ యో గ ము

అర్జున ఉవాచ—

శ్లో॥ కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే.

తే॥ గీ॥ అప్పరబ్రహ్మ మేది? య◆ధ్యాత్మ మేది?
హారువయిన కర్మ మధిభూత ◆ మనఁగనేమి?
శస్తమగు నధి దైవము ◆ సరణి యేదొ!
కృపను వచియింపు మయ్య శ్రీ◆కృష్ణ! శౌరి!.

శ్లో॥ అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః

తే॥ గీ॥ మాధవా! పల్కు మీ దేహ ◆ మధ్యమందు
నుండు నధియజ్ఞుఁ డనఁగ నె◆వ్వండొ? యాత్మ
బట్టి నిల్పినవారలు ◆ ప్రాణములను
పీడపట్టువారి నెట్లు ◆ నీవు గనఁగ ?

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే
భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః.

తే॥ గీ॥ పరమ మగు బ్రహ్మ మొప్పు న•క్షర మనంగ
ఆ స్వభావమ్ము నధ్యాత్మ • మనఁగఁ దనరు
నలు తెగల భూతసృష్టిని•గలుగఁజేయు
యజ్ఞమే కర్మమని తెలి•యంగదయ్య. 3

శ్లో॥ అధిభూతం క్షరోభావః పురుష శ్చాధిదైవతం
అధియజ్ఞోఽహ మేవాఽత్ర దేహే దేహభృతాంవర.

తే॥ గీ॥ అడఁగిపోవు చరాచర • మంతయు నధి
భూత, మధిదైవతంబనఁ • బురుషుఁడు నగు
నేన యధి యజ్ఞుఁ డగుదు నీ•మేనియందు
దేహధారుల మేటివై • తిరుగుతేఁడ!. ౪

శ్లో॥ అంతకాలే చ మా మేవ స్మర న్ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః.

తే॥ గీ॥ మరణకాలంబునను నన్ను • మఱువ కెవఁడు
స్మరణ సేయుచు దేహంబు • జారవిడునో?
వాఁడు నిస్సంశయముగ నా•భావ మొందు
చున్నవాఁడని తెలియు మో • యుగ్రతేజ. ౫

శ్లో॥ యం యం వాపి స్మర౯ భావం త్యజ త్యంతే కళేబరం
తం త మేవైతి కౌంతేయ సదా తద్భావభావితః. ౫

తే॥ గీ॥ *కుంతి కొమరుండ! యెవఁడు తాఁ ♦ గూలునపుడు
దేని దేనిఁ దలంచుచు ♦ మేను వీడు
వాఁడు దాని నెపుడు దల్చు ♦ వాఁడు నగుచు
నా తలంచిన తలపునే ♦ యందుచుండు. ౬

శ్లో॥ తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ
మయ్యర్పిత మనోబుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః.

తే॥ గీ॥ అట్లుగావున కాలత్రి♦యంబు నందు
నన్నె తలఁచుము యుద్ధమ్ము ♦ సడపు మిపుడు
నీ మనసు బుద్ధి నా యందు ♦ నిల్పియున్న
నీవు నను జెందఁ గలవు సందేహ మేల?. ౭

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్.

తే॥ గీ॥ పార్థ! యభ్యాసయోగానఁ ♦ బ్రకృతిపైకిఁ
బోని మదిచేతను బురాణ♦పురుషుఁ బరముఁ
బ్రత్యహంబును దలఁచెడు ♦ వాఁడు తుదకు
సూర్యమండల మధ్యస్థుఁ ♦ జూడఁ గొనును. ౮

---

* 1తే॥ గీ॥ బ్రతికి యున్నప్పు డెద్ది లో♦పలఁ దలంచు
దానినే కూలునప్పుడు ♦ తలఁచు మేను
పడునపుడు దేనిఁదలచంగ ♦ వలయు నన్న
బ్రతుకు దినముల నదె తల్పఁ♦బడఁగవలయు.

2 తే॥ గీ॥ ముగురు మతకర్త లిద్దియే ♦ పోలనిరి
నడచె నిటు తైత్తిరీయ కా♦నందవల్లి
భ్రమర కీటక న్యాయంబు ♦ పరగు నట్లు
జడభరత ముఖ్యభక్తు లీ♦సరణిఁజనిరి.

శ్లో॥ కవింపురాణమనుశాసితార మణోరణీయాంస మనుస్మరేద్యః
సర్వస్యధాతారమచింత్యరూపమాదిత్యవర్ణంతమసః పరస్తాత్.

తే॥ గీ॥ ప్రాతవాఁ డన్నియు నెఱుంగు • వాఁడు నూహ
సేయఁ జిక్కనివాఁ డన్ని • చేయువాఁడు
శాసితుఁడు సూక్ష్మసూక్ష్ముఁ డ • జ్ఞానతిమిర
హారి యాదిత్య వర్ణుండు • నైనవానిఁ
దలఁచువాఁడాతనిం జెందఁ • దగినవాఁడు. ౯

శ్లో॥ ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యం.

తే॥ గీ॥ ఉసురు గాడ్పులు విడువంగ • నున్నవేళ
భక్తిమై స్థిరమతి యోగ • బలము గల్గి
బొమల నడుమను ప్రాణంబు • బొందు పఱచు
నతఁడు పరు, దివ్య పురుషుని • నందఁగలఁడు. ౧౦

శ్లో॥ యదక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః
య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
త త్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే.

తే॥ గీ॥ అక్షరం బని దేని వే • దజ్ఞు లండ్రు
వీతరాగ యతులు నెందు • వేడ్కనుండ్రు
దేనికై బ్రహ్మచర్యంబు • నూనుచుండ్రు
దాని సంగ్రహముగఁ జెప్పఁ • దలఁతు వినుము. ౧౧

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ
మూర్ధ్న్యాధాఽఽయాత్మనః ప్రాణమాస్థితో యోగ ధారణామ్
తే॥ గీ॥ ఒడలి తొమ్మిది వాకిండ్లు • నొకట మూసి
మనసు హృదయాబ్జమున యందు • మసలఁజేసి
మూర్ధమధ్యంబునం బ్రాణ•మును గదించి
స్థిమిత యోగాచరణమును • జేయవలయు. ౧౨
శ్లో॥ ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్.
తే॥ గీ॥ అటు పరబ్రహ్మవాచకం • బైనయట్టి
ఓ మనెడు నొక్కయక్కర • ముచ్చరించు
చాత్మ నన్నెంచి మెయి వీడి • యరుఁగువాఁడు
నుత్తమంబైన మోక్షంబు • నొందఁ గలఁడు. ౧౩
శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః.
తే॥ గీ॥ ఇతరచింతలు లేకుండ • నెవఁడు నన్ను
సర్వకాలంబు లందును • సర్వమగు న
వస్థలందు స్మరించు ప్ర•శస్తయోగి
కేను సులభముగాఁ జిక్కు • దిది నిజంబు. ౧౪
శ్లో॥ మా ముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః
తే॥ గీ॥ నన్నుఁబొందు మహాత్ములు • సన్నుతికిని
బాత్రమా మోక్షమున నుండి • బహుళదుఃఖ
భాజన మశాశ్వతంబును • బరమ నీచ
మగు పునర్జన్మ మెప్పటి • కందఁ బోరు. ౧౫

శ్లో॥ ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే.

తే॥ గీ॥ బ్రహ్మలోకాది లోకముల్ • పడయువారు
తిరిగి జన్మింప భూమికిం • దిగెడువారె
యద్వితీయుండ నగు నన్ను • నందువారు
మరలఁ బుట్టంగఁ బోరని • యెఱుఁగు మీవు. ౧౬

శ్లో॥ సహస్రయుగపర్యంత మహ ర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగసహస్రాం తాం తేఽహోరాత్రవిదో జనాః

తే॥ గీ॥ పగలు రాతి రెఱుఁగువారు • బ్రహ్మయొక్క-
పగటి కాలంబు నొకవేయి•యుగము లంచు
రాత్రి వేయియుగంబులు • మాత్ర మంచుఁ
దాని మేర యిదంచు లోఁ • దలఁచుచుంద్రు. ౧౭

శ్లో॥ అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవం త్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రై వావ్యక్తసంజ్ఞకే.

తే॥ గీ॥ బ్రహ్మదేవుని పగలు ప్రా•రంభమైన
యప్పు డవ్యక్తమున నుండి • వ్యక్తరూప
మగు చరాచరములు దోచు, • నతనిరాత్రి
యరుఁగుదెంచిన నవ్యక్త • మందుఁ గలియు. ౧౮

శ్లో॥ భూతగ్రామ స్సఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే.
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవ త్యహరాగమే.

తే॥ గీ॥ పార్థ! బ్రహ్మకుఁ బగలైన • బహుళ భూత
జాలము జనించు రేయైనఁ • గూలిపోవు
జనన మరణము లిటు లవ•శంబు లగుచు
మఱల మఱల యుగంబుల • మార్పులందు. ౧౯

శ్లో॥ పర స్తస్మాత్తు భావో౽న్యో౽వ్యక్తో౽వ్యక్తా త్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి.
తే॥ గీ॥ సకల భూతంబులు నశింపఁ ♦ జాలినపుడు
యెద్ది నశియింపకుండునో ♦ యద్ది మొదల
గలిగియుండు నవ్యక్తంబు ♦ కంటె, వేఱు
పరమును సనాతనంబు న♦వ్యక్త మౌను. ౨౦
శ్లో॥ అవ్యక్తో౽క్షర ఇత్యుక్త స్త మాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ.
తే॥ గీ॥ అట్టి యవ్యక్త మక్షర ♦ మనఁగఁబరగు
పలుకు చుందు రద్దానిని ♦ బరమగతిగ
దేనిఁబొందిన మఱలను ♦ దిరిగిరారొ?
నా పరమ ధామ మది యంచు ♦ నమ్మఁ దగును. ౨౧
శ్లో॥ పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా.
యస్యాంతస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్.
తే॥ గీ॥ పార్థ! భూతంబు లెవని లో♦పలను నుండు
బహుళజగ మేనిచే నిండి ♦ పరిబలుచుండు
నతఁడు పరుఁడగు పూరుషుఁ♦డగు; ననన్య
భక్తిచేతనె మిగుల ల♦భ్యమగు నతఁడు. ౨౨
శ్లో॥ యత్రకాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ!
తే॥ గీ॥ పరమ యోగులు దేహ మే♦పట్లఁబడిన
జన్మనెత్తుదు, రెపుడు వో ♦ జన్మలేదొ?
అట్టికాలవిశేషంబు ♦ లన్ని నీకుఁ
జెప్పఁదలఁచితి విను నీవు ♦ చింతమాని.

శ్లో॥ అగ్ని ర్జ్యోతి రహ శ్శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః.

తే॥ గీ॥ అగ్నిని నహస్సునను జ్యోతి ♦ నాఱుమాస
ముల పరిమితోత్తరాయణ ♦ మునను శుక్ల
పక్షమునఁ బోవునటువంటి ♦ బ్రహ్మవేత్త
లైనవారలు బ్రహ్మంబు ♦ నందగలరు. ౨౪

శ్లో॥ ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే.

తే॥ గీ॥ నక్తధూమమ్ములందు ష♦ణ్మాసయుక్త
దక్షిణాయనమున గృష్ణ ♦ పక్షమునను
జనెడువాఁడైన యా యోగి ♦ చంద్రుని దగు
తేజముంబొంది పిమ్మట ♦ తిరిగివచ్చు. ౨౫

శ్లో॥ శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శ్శాశ్వతే మతే
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః.

తే॥ గీ॥ ఈ సితాసిత మార్గంబు ♦ లీజగమున
కలరు శాశ్వతములుగనే ♦ పలుకఁ బడియె
శుక్లపథమున జన్మంబు ♦ సొరిది గనఁడు
కృష్ణమార్గంబునను జని♦యించుచుండు. ౨౬

శ్లో॥ నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!

తే॥ గీ॥ అర్జునా! పైని జెప్పిన ♦ యట్టి శుక్ల
కృష్ణమార్గంబు లెఱిఁగి వ♦ర్తించు యోగి
మోహమందఁ; డఖిల కాల♦ములను గర్మ
యోగమునఁ గూడువాఁడవై ♦ యుండు మయ్య. ౨౭

శ్లో॥ వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టం
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్.

తే॥ గీ॥ వేద దాన తపో యజ్ఞ • విధుల పుణ్య
ఫలము లన్నింటి నెఱిఁగిన • పరమయోగి
వాని నెల్లను వరుసగా • వదలివైచి
యాద్యమగు బ్రహ్మపదమును • నందఁగలఁడు. ౨౮

ఇది యష్టమాధ్యాయము



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమానుమద్భగవద్గీత

## నవమాధ్యాయము

### రాజవిద్యారాజగుహ్యయోగము

శ్రీభగవానువాచ—

శ్లో॥ ఇదం తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్.

తే॥ గీ॥ అర్జున! యసూయయే లేని • యట్టిఁడవు ర
హాస్యములలో రహస్యమై • నట్టిదియుఁ బ్ర
శస్తవిజ్ఞానయుతము నౌ • జ్ఞాన మిదియు
విను మెఱింగింతు నశుభంబు • వీడి చనఁగ. ౧

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్.

తే॥ గీ॥ ఈ పలుకఁ బోవు జ్ఞాన స్వ • రూప మన్ని
విద్యల రహస్యముల మేటి • పృథు పవిత్ర
మనుభవైక వేద్యంబు ధ • ర్మ్యంబు నగును
అతిసులభసాధ్య ముత్తమం • బవ్యయంబు. ౨

శ్లో॥ అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసార వర్త్మని.

తే॥ గీ॥ పగఱ దపియింపఁజేసెడు ♦ పార్థ! నేను
బ్రిమడమునఁ బల్కఁబోవు ధ♦ర్మంబునందు
శ్రద్ధలేనివారు నను జే♦రంగలేక
మృత్యుయుత సంసృతింబడి ♦ మెలఁగుచుండ్రు. ౩

శ్లో॥ మయా తత మిదం సర్వం జగ దవ్యక్త మూర్తినా
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః.

తే॥ గీ॥ ఈ సమస్తజగంబును ♦ నింద్రియముల
కగుపడనియట్టి నా చేత ♦ వ్యాప్తమయ్యె
నన్ని భూతంబు లుండు నా♦యందు నిల్చి
కాని నే వాని యందుండఁ♦గాను లేదు. ౪

శ్లో॥ నచ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః

తే॥ గీ॥ *ఐశ్వరంబగు నా యోగ ♦ మరసి చూడు
నిఖిల భూతాళి నాయందు ♦ నిలువలేదు
భూతభావన మగు నాత్మ ♦ భూతచయము
నూనగాఁ బోదు వానియం ♦ దుండఁబోదు. ౫

---

వివరము * తే॥ గీ॥ ఆత్మ యొక్కటియదియు దా ♦ నగుచునుండ
మించిపుట్టెడు వాఁడు పు♦ట్టించువాఁడు
లేక యొక్కటియగు గాన ♦ నీ కరణినిఁ
బలికె శ్రీకృష్ణపరమాత్మ ♦ పల్కుటమున.

శ్లో॥ యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్ స్థానీ త్యుపధారయ.

తే॥ గీ॥ అంతట మెలంగు పెనుగాలి ♦ యాకసమున
నిలిచి వ్యాపించి యెప్పుడు ♦ నిండియున్న
విధముగా నెల్లభూతముల్ ♦ వెలయుచుండు
నా యెడల నం చెఱుంగు ధ♦నంజయుండ! ౬

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాన్తి మామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్

తే॥ గీ॥ అర్జునా! భూతజాలంబు ♦ లన్ని ప్రళయ
కాలమున నా ప్రకృతియందు ♦ గలియుచుండు
సృష్టికాలంబునందు నా ♦ చేత మరల
గలుగఁజేయంగ బడునట్లు ♦ గా నెఱుంగు. ౭

శ్లో॥ ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునఃపునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృ తే ర్వశాత్

తే॥ గీ॥ ప్రకృతి మద్వశముగఁ జేసి ♦ ప్రభవ మొంద
జేతు నీ భూత జాలమ్ము ♦ నే తరుణము
నందు; సర్వప్రపంచమ్ము ♦ నవశమయ్యె
నట్టి ప్రకృతికి స్వాధీన ♦ మగుటవలన. ౮

శ్లో॥ న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ
ఉదాసీనవ దాసీన మసక్తం తేషు కర్మసు.

తే॥ గీ॥ ఓ ధనంజయ! యీ కర్మ ♦ యోగసృష్టి
కేను కర్తృత్వ మిడుకొన ♦ కే తటస్థుఁ
డగుచునుంట ననక్తుఁడ♦నైన నన్ను
నఖిలమగు కర్మచయము బం♦ధింపఁబోదు. ౯

శ్లో॥ మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునాఽనేన కౌంతేయ జగ ద్విపరివర్తతే.
తే॥ గీ॥ నాదు సధ్యక్షతం గాఁగ ♦ నాదుప్రకృతి
యీ చరాచర భూతాళి ♦ సృష్టిసేయు
చున్నయది యిక్కతమున ♦ చెన్నుమీఱు
చున్నయది పరివర్తించు ♦ చున్నయదియ. ౧౦

శ్లో॥ అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్.
తే॥ గీ॥ అఖిలభూత మహేశ్వర ♦ మైన నాదు
దివ్యపరమాత్మ తత్త్వంబుఁ ♦ దెలియలేని
మూఢులు మనుష్యదేహంబు ♦ బూనియున్న
నన్ను నవమానమును జేయు♦చున్నవారు. ౧౧

శ్లో॥ మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః
తే॥ గీ॥ అట్టివారలు రాక్షసి ♦ యాసురియును
మోహినియు నైన ప్రకృతిని ♦ బూని వ్యర్థ
కాంక్షు లజ్ఞానులును వ్యర్థ♦కర్ము లగుచు
బుద్ధిహీనులునై చెడి ♦ పోవువారు. ౧౨

శ్లో॥ మహాత్మాన స్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయం.
తే॥ గీ॥ పార్థ! దైవీప్రకృతి నొందు ♦ వారగుచు మ
హాత్ము లీ భూతతతి కాది ♦ మైనవాని
గాను నాశనమును లేని ♦ వానిగాను
దెలిసియు ననన్యమనమున ♦ గొల్చుచుందురి. ౧౩

శ్లో॥ సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

తే॥ గీ॥ భక్తిని దృఢవ్రతులు యత్న•పరులు నగుచు
నిత్యమును యోగయుక్తులై • నివ్వటిల్లి
నన్నుఁ గీర్తించి సతతంబు•న న్నుపాస
నంబుఁజేయుచు నుందురు • నాకు మ్రొక్కి. ౧౪

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్.

తే॥ గీ॥ అన్యులగువార లా జ్ఞాన•యజ్ఞమునను
నన్నుఁ బృథగ్భావమునను నిం•ద్రిముఖులైన
వేలుపులుగను భావించి • విశ్వముఖుడ
నైన, నన్నుఁ బెక్కురీతుల • నభినుతింత్రు. ౧౫

శ్లో॥ అహం క్రతు రహం యజ్ఞ స్స్వధాహ మహ మౌషధం
మన్త్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతం.

తే॥ గీ॥ నేన క్రతు వేన యజ్ఞంబు • నేన స్వధయు
నేన యాజ్యంబు నగ్నియు • నేన హుతము
నేన దివ్యౌషధంబును • నేన మంత్ర
మేన, యని నీవు భావించు • మెల్లమెపుడు. ౧౬

శ్లో॥ పితాఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవచ.

తే॥ గీ॥ తలపు, జగమునకుం దల్లి • తండ్రి తాత
ఋగ్యజుస్సామములు గూడ • నేనయంచు
ప్రాణులకుఁ గర్మఫలములఁ • బంచువాడు
పూతమును వేద్య మోంకార•ములును నేను. ౧౭

శ్లో॥ గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయం.

తే॥ గీ॥ నేన గతియు నిధానంబు ♦ నేన భర్త
నేన ప్రభువును సాక్షిని ♦ నేన గేహ
మేన శరణంబును సుహృత్తు ♦ నేన ప్రభవ
విలయ సంస్థితు లవ్యయ ♦ బీజములును. ౧౮

శ్లో॥ తపామ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామిచ
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున.

తే॥ గీ॥ నే దపింప జేయుచునుంటి ♦ నే గ్రహించు
చుంటి వర్షంబు, విడుచుచు ♦ నుంటి నేను
నేన యమృతంబు నగుదును ♦ నేన మృత్యు
వేన సత్తు నసత్తును ♦ నేన సుమ్ము. ౧౯

శ్లో॥ త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్.

తే॥ గీ॥ శ్రుతివిదులు సోమమును గ్రోలి ♦ తుష్టించి యఘము
యజ్ఞములఁగొల్చి స్వర్గతి ♦ నభిలషింతురు
పుణ్యయుత నాకలోకంబు ♦ పొంది వారు
దివ్యమగు దేవభోగముల్ ♦ దివిని గందురు. ౨౦

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే.

తే॥ గీ॥ అంతటను స్వర్గభోగము ♦ లనుభవించి
పుణ్యమంతయు క్షీణమై ♦ భువిఁజొఱెదరు
వేదధర్మావలంబులౌ ♦ వివిధకాము
లలరఁగాంతురు రాకపో♦కలను నెపుడు. ౨౧

శ్లో॥ అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్

తే॥ గీ॥ *ఎవ్వ రితరములను వీడి ♦ యేకదృష్టి
పఱఁగ నను గొల్తు రిస్వస్వరూ♦పముఁగఁ దలచి
నిరత విజ్ఞాన సంపన్న ♦ నిష్ఠ గలిగి
యెసఁగువారి యోగక్షేమ ♦ మే వహింతు. ౨౨

శ్లో॥ యేఽప్యన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకం.

తే॥ గీ॥ ఎవ్వరేనియు శ్రద్ధతో ♦ నితరమైన
వేల్పుల భక్తు లగుచు సే♦వింతురొక్కొ-
వారలెల్లరు నవిధిపూ♦ర్వకము గాగ
నన్నె పూజించుచున్నా ర♦నంగఁ దగును. ౨౩

* తే॥గీ॥ పొందలే నట్టి వానిని ♦ బొందునట్లు
చేయుటే యోగ మందురు ♦ సిద్ధజనులు
పొందినటువంటి వానిని ♦ బోక యుండఁ
గాచియుండుట క్షేమంబు♦గాఁ దలంతు రి

శ్లో॥ అహంహి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవ చ
నతు మా మభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తి తే.

తే॥ గీ॥ అన్నియజ్ఞంబులకుఁ గర్త•నగుచు దాని
భోక్తనుం గూడ నౌదునా • పొలుపెఱుఁగని
కారణంబున తత్త్వమా•ర్గమున నుండి
జారినటువంటి వారలై•నారు సుమ్ము. ౨౪

శ్లో॥ యాన్తి దేవవ్రతా దేవా
పితౄన్ యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యా
యాన్తి మద్యాజినోపి మామ్.

తే॥ గీ॥ సురలను భజించు వారలు • సురవరులను
పితరుల భజించువారలు • పితృగణముల
భూతములఁ గొల్చువారలు • భూతములను
నన్నుఁగొల్చిన వారలు • ననుఁ గనెదరు. ౨౫

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః

తే॥ గీ॥ భక్తినెవ్వఁడు నాకయి • ఫలమొ జలమొ
పత్రిమో పుష్పమో సమ•ర్పణము సేయు
నిర్మలస్వాంతుఁడగు వాఁడు • నిష్ఠనొసఁగు
దానినే స్వీకరింపంగ • దలఁచుచుందు. ౨౬

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం.

తే॥ గీ॥ గొంతికొమరుడ! యెప్పుడు ♦ కోర్కెచేత
సలుపు వానిని భుజియింప ♦ గలుగువాని
హోమములు చేయువాని నీ♦వొసగువానిఁ
జేయు తపమును నను జెందఁ ♦ జేయుమయ్య. ౨౭

శ్లో॥ శుభాశుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి.

తే॥ గీ॥ ఇట్టు నా కర్పణముజేసి ♦ నట్టులైన
తచ్ఛుభాశుభ కర్మబం♦ధములు వీడు
నవల సన్న్యాసయోగ యు♦క్తాత్ముఁడవయి
పొందఁగల్గుదు నన్ను వి♦ముక్తుఁడవయి ౨౮

శ్లో॥ సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్.

తే॥ గీ॥ సకల భూతంబులును నాకు ♦ సమము సుమ్ము
కొందఱం బ్రేమఁగనఁ బగఁ ♦ గొందఱఁగన
నెవరు భక్తిని సేవింతు ♦ రేను వారి
యందు నుందును వారు నా♦యందు నుండు౯. ౨౯

శ్లో॥ అపి చేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ సమన్తవ్య స్సమ్యగ్వ్యవసితోహి సః.

తే॥ గీ॥ ఎంచగ ననన్యభక్తి సే • వించువాఁడు
ఘన దురాచారుడైన నే • గారవింతు
సత్పురుషువలె నాతఁడు • సంతతంబు
మిగుల నిలుకడ గలుగువాఁ • డగుటవలన. ౩౦

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి.

తే॥ గీ॥ అట్టి యాతడు వేగ ధ • ర్మాత్ము డగును
వాఁడు శాశ్వతమగు శాంతిఁ • బడయఁగలఁడు
నాదు భక్తుండు చెడఁడు నె • న్నటి కటంచు
దిటముగఁ బ్రతిజ్ఞ సేతు కుం • తీకుమార. ౩౧

శ్లో॥ మాం హి పార్థ వ్యపాశ్రిత్య
యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా
స్తేఽపి యాన్తి పరాంగతిం.

తే॥ గీ॥ పార్థ! నన్నాశ్రయించిన • పాపజనులు
స్త్రీలు వైశ్యులు శూద్రులు • చెందగలరు
ముక్తిసంపద నాదైన • భక్తులెల్ల ౩౨
జాతి మత భేదములు • లేక సంతతంబు.

శ్లో॥ కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్.

తే॥ గీ॥ కాన పావనులై భక్తి • గల్గినట్టి
బ్రాహ్మణులు రాజు లందగ•రాని దేది ?
యస్థిరం బసుఖంబైన • యట్టి మర్త్య
భూమిఁ బుట్టితి నన్నుఁగొల్చి • ముక్తినొందు. 33

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః.

తే॥ గీ॥ నాయెడ మనస్సు నిల్పుము • నా యెడలను
భక్తుడవు కమ్ము పూజను • రక్తి సల్పు
నన్నుఁ గూరిచి మ్రొక్కుము • నన్ను మేటి
గతిగ నెంచియు మతి నిల్ప • నన్నె కందు. 3౪

ఇది నవమాధ్యాయము



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్భగవద్గీత



## దశమాధ్యాయము

### విభూతియోగము

శ్రీభగవానువాచ—

శ్లో॥ భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా.

తే॥ గీ॥ అధికమగు భుజబలమున ♦ నమరువాడ
వారువయిన ప్రీతిగల నీకుఁ ♦ దిరిగి నేను
శస్తహిత కామ్యముననుబ్రశంసఁజేతు
వినుము యుత్కృష్టమగు నాదు ♦ ఘనవచనము. ౧

శ్లో॥ న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాది ర్హి దేవానాం మహర్షీణాంచ సర్వశః.

తే॥ గీ॥ నాదు ప్రభవంబు దేవగ♦ణంబుగాని
ఋషిగణముగాని యెఱుఁగదు ♦ నించుకేని
దేవగణమునిగణముల ♦ కే విధముగ
గనిన నే మొదలై యుండు ♦ నని తలంపు

శ్లో॥ యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరం
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే.

తే॥ గీ॥ జన్మరహితుండు త్రిభువనే•శ్వరు డనాది
యైన వాడని నన్నెవ్వ•డాత్మ నెఱుఁగు
అట్టి మూఢత్వమును లేని • యట్టివాడు
జనులఁ బాపవిముక్తుడై • తనరుచుండు. 3

శ్లో॥ బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవచ.

తే॥ గీ॥ లోకమున భూతములకు న•నేకమైన
జ్ఞానమును మోహమును బుద్ధి • సత్యము క్షమ
శమము దమమును సుఖదుఃఖ • జననమరణ
భయము లభయము గల్గు నా•వలన నెపుడు. ౪

శ్లో॥ అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః
భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః.

తే॥ గీ॥ క్షమ యహింస సమత్వంబు • సంతసంబు
తపము కీర్తియు నపకీర్తి • దానగుణము
వివిధభావంబు లాయాయి • విషయములును
నావలనఁ గల్గునని నీమ•నమున దెలియు. ౫

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తదా
మద్భావా మానసా జాతా ఏషాం లోక ఇమాః ప్రజాః.

తే॥ గీ॥ జగమునం దుండినట్టి ప్ర•జాసమూహ
మే నలువురైన మనువులు • నేడ్వురైన
ఋషుల సంతతియో యట్టి • యల్ల మూల
పురుషులును నాత్మభావులై • పుట్టినారు. ౬

శ్లో॥ ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః.

తే॥ గీ॥ నా విభూతియోగంబు సద్భావమున నె
వండు నిజము నెఱుంగునో ♦ వాఁడు నిశ్చ
యంబయిన యోగమందఁగ♦లట్టివాఁడు
దీనఁగలుగదు సుంత సం♦దేహమైన. 7

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతిమత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః.

తే॥ గీ॥ లోకపతి నగు నే నెల్ల ♦ లోకములను
గలుగఁజేయుచు నడిపింపఁ ♦ గలిగితి నని
పండితులు పరమార్థంపు ♦ భావమునను
బొంది నను భజియించుచు ♦ నుందు రెలమి. 8

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతిచ రమంతిచ.

తే॥ గీ॥ అట్టివారలు నా యందు ♦ హత్తినట్టి
చిత్తమునఁ దమప్రాణముల్ ♦ చేర్చి నాకు
నొకరొకరు నన్నుఁగూర్చి చె♦ప్పుకొనుచుండి
తృప్తిఁ గ్రీడింతు రెపుడు ♦ వర్ణించి నన్ను. 9

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే.

తే॥ గీ॥ స్నేహపూర్వకముగ నాదు ♦ సేవసేయు
సతతయుక్తులు దేనిచే ♦ సంతతంబు
పొందెదరొ నన్ను నట్టిదా ♦ బుద్ధియోగ
మిచ్చుచుంటిని నీకు ♦ [illegible] 10

శ్లో॥ తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.

తే॥ గీ॥ నేను వారలపై దయఁ • బూనియుండి
వారి హృదయాబ్జ సీమల • గోరి నిలచి
భాసురంబగు జ్ఞాన దీ•పరుచి పర్వఁ
జేసి యజ్ఞాన తిమిరముం • జెండినైతు. ౧౧

అర్జున ఉవాచ—

శ్లో॥ పరంబ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్.

తే॥ గీ॥ నీవు నిత్యుండవును నాది• దేవుఁడవును
పరమపావనుఁడవు పర•బ్రహ్మ వజుడ
వధిక తేజుండవు విభుండ • వచ్యుతుఁడవు
దివ్యపురుషుడ వని మహాఋషుల్ • దెలియువారు. ౧౨

శ్లో॥ ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాసః స్వయం చైవ బ్రవీషి మే

తే॥ గీ॥ దేవఋషి నారదుండును • దేవలుండు
అసితుఁ డనుముని సత్యవ•త్యాత్మజుండు
చెప్పుచున్నారు తద్విధి • నిప్పు డీవు
నన్నుఁగూర్చి వచించుచు నున్న యట్లు. ౧౩

శ్లో॥ సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః.

తే॥ గీ॥ నాకు నెద్దాని చెప్పుచు•న్నావొ నీవు
అద్ది సర్వము సత్య మం•చాదరింతు
దేవతలు నీదు వ్యక్తిని • దెలియలేదు
దానవు లెఱుంగలేరు సుం•తైన గాని ౧౪

శ్లో॥ స్వయమే వాత్మ నాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ!
భూతభావన భూతేశ! దేవదేవ జగత్పతే.

తే॥ గీ॥ భూతభావన! భూతేశ! ♦ పురుషవర్య!
దేవదేవ! జగత్పతీ! ♦ ధీరముఖ్య
నిన్నునీవ యెఱుంగుదు ♦ నీ స్వరూప
మితరులకు వశమౌనొకో ♦ యెంచి చూడ? ౧౫

శ్లో॥ వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి

తే॥ గీ॥ నీవు నేయే విభూతుల ♦ చేవెలసియు
వివిధజగముల నెట్లు వ్యా♦పించియుంటి
విట్టి దివ్యవిభూతులు ♦ నెల్లనాకు
పూర్ణముగఁ దగియుంటి చె♦ప్పుటకు దేవ! ౧౬

శ్లో॥ కథం విద్యా మహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవ న్మయా.

తే॥ గీ॥ ఎట్లు నిను భక్తితోఁగూడి ♦ యెల్లయపుడు
ధ్యాన మొనరించు నేఁ దెలి♦యంగఁగలను
యోగి! భగవంతుడా! నాకు ♦ నుచ్చరింపు
మెల్లవస్తువు లందు ని♦న్నెటు భజింతు. ౧౭

శ్లో॥ విస్తరే ణాత్మనో యోగం విభూతిం చ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతం.

తే॥ గీ॥ ఓ జనార్దన! నీదైన ♦ యోగభూతు
లెలమి వివరించి తిరిగి నా ♦ కిపుడు సెప్పు
నీ యమృతవాక్కు విను చున్న ♦ నేఁడు నాకుఁ
దృప్తి జనియించ కున్నది ♦ తెలియ నెలియ. ౧౮

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే.

తే॥ గీ॥ ఓ కురుకులేశ ముఖ్యమై • యొప్పుచున్న
దివ్య మగు నా విభూతు లెం• తేని నెన్న
గా ననంతములై యుండెఁ • గాన వాని
నీకు నెఱింగింతు వినుము సం•దియము మాని. ౧౯

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవ చ.

తే॥ గీ॥ ఓ గుడాకేశ సర్వభూ•తోజ్జ్వల హృ
దయప్రదేశంబులందున్న • యాత్మ నేను
భూతజాలంబు లన్నింటి • మొదలు నేను
మధ్య మే సగు దంత్యంబు • మఱియు నేను. ౨౦

శ్లో॥ ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ.

తే॥ గీ॥ వినుము ద్వాదశాదిత్యుల • విష్ణు నేను
జ్యోతుల న్వెల్గు గల్గు సూ•ర్యుండు నేను
శ్రితమరుద్గణమునను మ•రీచి నేను
అఖిల నక్షత్రముల చంద్రు•డౌదు నేను ౨౧

శ్లో॥ వేదానాం సామవేదోస్మి దేవానా మస్మి వాసవః
ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానా మస్మి చేతనా

తే॥ గీ॥ వేదముల సామ మనునట్టి • వేద మేను
వేలుపుల వాసవుండను • వేల్పు నేను
ఇంద్రియంబుల మనమునా • నేదలిర్తు
భూతములయందు నే నౌదు • చేతనంబు. ౨౨

శ్లో॥ రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్.
తే గీ॥ రుద్రులగణంబునను శంక•రుండ నేను
రక్కసుల జక్కులను ధన•రాజు నేను
వసుగణంబులలోనఁ బా•వకుఁడ నేను
కొండలన్నింట బంగారు•కొండ నేను. ౨౩
శ్లో॥ పురోధసాంచ ముఖ్యం మా విద్ధి పార్థ బృహస్పతిమ్
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః.
తే॥ గీ॥ పార్థ! ముఖ్యపురోహిత • వర్గమందు
ప్రథముఁ డనఁగొన దగు బృహ•స్పతిని నేను
సకల సేనాధిపతులలో • స్కందుఁ డేను
సరసులన్నింటిలోన సా•గరము నేను. ౨౪
శ్లో॥ మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరం
యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః.
తే॥ గీ॥ ఋషివరేణ్యుల లోపల • భృగువు నేను
నక్షరంబుల నోంకార • మగుదు నేను
యజ్ఞములలోన జప మను • యజ్ఞ మేను
స్థావరముల హిమాలయ • శైల మేను. ౨౫
శ్లో॥ అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః.
తే॥ గీ॥ వృక్షములలోన నశ్వత్థ • వృక్ష మేను
ప్రథితు లగు దేవమునుల నా•రదుఁడ నేను
ప్రబల గంధర్వులను జిత్ర•రథుఁడ నేను
నిఖిల సిద్ధుల గపిలము•నియును నేను. ౨౬

శ్లో॥ ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్.

తే॥ గీ॥ వాజిగణమున నమృతోద్భ•వంబునైన
యట్టి యుచ్చైశ్శ్రవంబను • నశ్వ మేను
దంతిగణమున నైరావ•తంబు నేను
నరులలోపల నరపతి • నరయ నేను. ౨౭

శ్లో॥ ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణా మస్మి వాసుకిః.

తే॥ గీ॥ సర్వమా నాయుధముల వ•జ్రంబు నేను
ధేను సముదాయమునఁ గామ•ధేను వేను
మహిని నుత్పత్తికరుల మ•న్మథుడ నేను
సకల సర్పంబులందు వా•సుకిని నేను. ౨౮

శ్లో॥ అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్

తే॥ గీ॥ నాగసముదాయమందు న•నంతుఁ డేను
వారి దేవతలందున • వరుణుఁడేను
నఖిల పితృగణమునను న•ర్యముఁడ నేను
సమత శిక్షించువారిలో • యముఁడ నేను. ౨౯

శ్లో॥ ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాంచ మృగేంద్రోఽహం వైనతేయశ్చపక్షిణామ్

తే॥ గీ॥ అఖిల దైత్యులయందుఁ బ్ర•హ్లాదుఁడేను
గణితశాస్త్రవిదులయందుఁ • గాల మేను
మహిత మృగరాజియందు సిం•హంబు నేను
దివ్య మగు పక్షులను వైన• తేయుఁడేను. 30

శ్లో॥ పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృ తా మహమ్
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ
తే॥ గీ॥ పావనముచేయువారిలోఁ ♦ బవనుఁడేను
శస్త్రధారుల శ్రీరామ♦చంద్రుఁడేను
మహితజలజంతువులయందు ♦ మకర మేను
నదులయందున జాహ్నవీ ♦ నదిని నేను. ౩౧

శ్లో॥ సర్గాణా మాది రంత శ్చ మధ్యంచై వాహ మర్జున
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవద తా మహమ్.
తే॥ గీ॥ అర్జునా! సృష్టులన్నింటి ♦ యందు గూడ
జననపోషణ హరణ కా♦రణము నేను
వివిధవిద్యల నధ్యాత్మ ♦ విద్య యేను
వాద భేదంబులం దర్థ♦వాద మేను. ౩౨

శ్లో॥ అక్షరాణా మకారోస్మి ద్వంద్వ స్సామాసికస్య చ
అహమేవాఽక్షయః కాలో ధాతాఽహం విశ్వతోముఖః
తే॥ గీ॥ కరిమిత నక్షరములయం ద♦కార మేను
తగు సమాసములందు ద్వం♦ద్వంబు నేను
కాలములలోన నక్షయ ♦ కాలమేను
విశ్వతోముఖుడై నట్టి ♦ విధిని నేను. ౩౩

శ్లో॥ మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తి శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతి క్షమా॥
తే॥ గీ॥ తొలఁగ నన్నింటి నణఁచు మృ♦త్యువును నేను
భావి ఫలముయందు సం♦భవము నేను
స్త్రీలఁ గీర్తి సరస్వతి ♦ స్మృతియు లక్ష్మి
ధృతియు మేధయు క్షమయును ♦ దెలియుమేను. ౩౪

శ్లో॥ బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహం
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః.
తే॥ గీ॥ సామముల నన్నిట బృహ॰త్సామ మేను
అఖిలఛందమ్ములందు గా॰యత్రి నేను
చెలఁగు మాసంబులను మార్గ॰శీర్ష మేను
కారులాఱింటనుం బూల॰కారు నేను. ౩౫

శ్లో॥ ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహం
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్వం సత్వవతా మహం.
తే॥ గీ॥ జూద మాడెడువారల ॰ జూద మేను
తేజముం గల వారిలో ॰ తేజ మేను
విజయమును నొదు తద్వ్యయ॰సాయ మేను
సత్యవంతుల లోపల ॰ సత్య మేను. ౩౬

శ్లో॥ వృష్ణీనాం వాసుదేవోస్మి పాండవానాం ధనంజయః
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః.
తే॥ గీ॥ తెలియ వృష్ణికులుల వాసు॰దేవుఁడేను
పంచపాండవులందునఁ ॰ బార్థు డేను
మునివరేణ్యులలో వ్యాస ॰ మునిని నేను
కవులలో శుక్రుఁ డనియెడు ॰ కవిని నేను. ౩౭

శ్లో॥ దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్.
తే॥ గీ॥ దండనము సేయువారిలో ॰ దండ మేను
నిఖిలము జయింపఁగలవారి ॰ నీతి నేను
మఱియు గుహ్యాకులందున ॰ మౌనమేను
జ్ఞానవంతుల లోపల ॰ జ్ఞాన మేను. ౩౮

శ్లో॥ యచ్చాఽపి సర్వభూతానాం బీజం తదహ మర్జున
నతదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరం.

తే॥ గీ॥ ఈ సమస్త భూతంబుల • కేది బీజ
కారణం బౌనో యదియు న • న్గా దలంపు
తచ్చరాచరమైన భూ • తంబులందు
గనఁగ నే లేని దొక్కటి • కానరాదు. ౩౯

శ్లో॥ నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా.

తే॥ గీ॥ పగలఁ దపియింపఁ జేసెడు • పార్థ! దివ్య
మైన నా విభూతులకు లే • దంత మెందు
నెన్న విస్తరమైనట్టి • యీ విభూతి
పలుకఁబడె సంగ్రహముగ నా • వలన నీకు ౪౦

శ్లో॥ యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా
తత్తదే వావగచ్ఛ త్వం మమ తేజోంఽశ సంభవమ్.

తే॥ గీ॥ ఏది శ్రీమంతమైయుండు • నేది భూతి
మంతమై యుండు నూర్జిత • వంతమేది?
వానినెల్ల నా తేజస్సు • వలనఁ గలుగు
వానిఁగా నీవు తెలియంగ • వలయు పార్థ. ౪౧

శ్లో॥ అథవా బహు నైతేన కిం జ్ఞాతేన తవార్జున!
విష్టభ్యాఽహ మిదం కృత్స్న మేకాం•శేన స్థితో జగత్.

తే॥ గీ॥ ఈ వనేకవిధంబుల • నెఱుగవాని
వలనను ప్రయోజనం బేమి • కలుగ గలదు?
అఖిలమైన జగమ్ము నే • కాంశమున వి
శేషముగ నరికట్టి సు • స్థితిని నుంటి. ౪౨

## అచ్చ తెలుఁగు

*పుడమి నొక పాలుసిరి నెల్ల • భూతములను
బొలిచి, ముప్పాలుసిరి వేల్పు • పొలము గప్పి
యున్నవాడ నటంచును • మున్నుగాను
బొల్కఁబలుకు లందు • నాచేతఁ బలుకబడియె. ४३

---

*పాదోఽస్య విశ్వా భూతాని
త్రిపాదస్యాఽమృతం దివి.

ఇది దశమాధ్యాయము.



ఓమ్
శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ హనుమద్భగవద్గీత

## ఏకాదశాధ్యాయము

### విశ్వరూపసందర్శనయోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ.

తే॥ గీ॥ అఖిలరూపక ! నీవు నా • యందనుగ్ర
హమునఁ బల్కిన మేలైర • హస్యమై ప్ర
శస్త మైనట్టి యాత్మవి • షయిక వాక్కు
వినుట మోహమ్ము తొలఁగి వి • వేక మొదవె. ౧

శ్లో॥ భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్.

తే॥ గీ॥ నీ వలన భూతసృష్టియు • నిహతిగతియు
విస్తరంబుగ నా చేత • వినగనయ్యె
అవ్యయంబైన నీదు మా • హాత్మ్య మెల్ల
నాలకించితి కమలప • త్రాయతాక్ష. ౨

శ్లో॥ ఏవ మేత ద్యథాఽఽత్థ త్వ మాత్మానం పరమేశ్వర
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ.

తే॥ గీ॥ పురుషవర! పరమేశ్వర! ♦ కరుణఁబల్కి-
నట్టి నీ యాత్మతత్త్వంబు ♦ నట్టిద యగు
నైశ్వరంబై తనర్చు నీ ♦ యమలరూప
మిచ్ఛయించుచు నుంటి ♦ నెంతేనిఁ జూడ. 3

శ్లో॥ మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో
యోగేశ్వర! తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్.

తే॥ గీ॥ లోకనాయక! యోగేశ! ♦ నాకు నీదు
సత్త్వరూపముఁ జూడంగ ♦ శక్య మనుచు
నందువేని నీ యవ్యయం ♦ బైన యట్టి
యాత్మరూపంబుఁ జూపింపు ♦ మయ్య యిపుడు. ౪

శ్రీభగవా నువాచ—

శ్లో॥ పశ్య మే పార్థ! రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ.

తే॥ గీ॥ పార్థ! చూడుము దివ్యమై ♦ బహుళమైన
వర్ణములు నాకృతులు గల్గి ♦ బహుశతములు
బహుసహస్రంబు లయినట్టి ♦ ప్రకటమైన
యట్టి నాదు స్వరూపంబు ♦ లన్ని నేఁడు. ౫

శ్లో॥ ప శ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాఽశ్చర్యాణి భారత!

తే॥ గీ॥ భరతకులవర్య! యాదిత్య ♦ వసుగణముల
ఘనుల నశ్వినులను రుద్రగణము వాయు
గణము మున్నెన్నఁడును నీవు ♦ గనని వింత
లైన వానిని గమనింపు ♦ యధికముగను. ౬

శ్లో॥ ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ! య చ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి.

తే॥ గీ॥ ఓగుడాకేశ! నాయొక్క • యొడలునందు
పుష్కలము సచరాచర•మునగు జగము
దేని గనగోరు దింక న•ద్దాని నెల్ల
గాంచు మొకచోటఁ గలదానిఁ • గాఁగ నీవు. ౭

శ్లో॥ నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్.

తే॥ గీ కనగ శక్యముగాదు నీ•కనుల నన్ను
దివ్య దృష్టిని నేఁబ్రసా•దింతు నీకు
ఐశ్వరంబై ప్రకాశించు • నట్టి నాదు
యోగమును జూడుమా! నయ•నోత్సవముగ. ౮

సంజయ ఉవాచ—

శ్లో॥ ఏవ ముక్త్వా తతో రాజన్!మహా యోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరం.

తే॥ గీ॥ ఈ విధంబుగ ధృతరాష్ట్ర! • యెఱుగఁబలికి
యా మహాయోగపతి యగు • నచ్యుతుండు
ఐశ్వరంబును బరమంబు • నైన రూప
మనల దర్శింపజేసె న • య్యర్జునునకు. ౯

శ్లో॥ అనేక వక్త్ర నయన మనేకాద్భుతదర్శనమ్
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్.

తే॥ గీ॥ పెక్కులైనట్టి వింతలఁ • బెంచునదియు
పెక్కుమొగములు గన్నులు • పెక్కులైన
మేలిసొమ్ములు గలదియు • మెఱయ నెత్తి
బడిన వివిధాయుధములు ది•వ్యములు గలదియు ౧౦

శ్లో॥ దివ్య మాల్యాంబర ధరం దివ్య గన్ధానులేపనమ్
సర్వాశ్చర్య మయం దేవ మన న్తం విశ్వతో ముఖమ్.
తే॥ గీ॥ తావిదండలు వలువలు ♦ దాల్చినదియు
వలపుగంధంపుఁ బూతల ♦ నలమినదియు
పెక్కువింతలు గలదియు ♦ వెలుగునదియు
నన్ని దెసలను దుదిలేక ♦ యలరునదియు. ౧౧
శ్లో॥ దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా
యదిభా స్సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః.
తే॥ గీ॥ దివిని లెక్కకు మించి నా♦దిత్యులొక్క
మాఱు వెల్గిన నెట్టి ర♦మ్యంపు దీ ప్తి
యుట్టిపడ్డట్టు వెల్గునో ♦ యట్టికాంతి
యా మహాదేవు తేజంబు ♦ నంటి పోల్చు. ౧౨
శ్లో॥ త త్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభ క్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా.
తే॥ గీ॥ అర్జునుడు దేవదేవు దే♦హమ్మునందు
సర్వవిధముల విభజింపఁ ♦ జాలియున్న
యీ సమ స్త జగమ్మును ♦ నేకముగను
నొక్కచోటన యున్న♦ట్టు లొగిని గాంచె. ౧౩
శ్లో॥ తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత.
తే॥ గీ॥ అంతట ధనంజయుఁడు విస్మ♦యంబువలన
గలుగు పరవశతను మేను♦గగురుపాటుఁ
జెంది, విశ్వస్వరూపుఁడౌ ♦ చిన్మయు హరిఁ
గాంచి తలవంచి చేతులు♦గట్టి పలికె. ౧౪

అర్జున ఉవాచ—

శ్లో॥ పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్.

తే॥ గీ॥ దేవ! నీ దేహమున సర్వ ♦ దేవతలను
బద్మపీఠంబునం దున్న ♦ ప్రభువు బ్రహ్మఁ
బ్రాణికోట్లను ఋషుల నీ♦శ్వరుని దివ్య
సర్పములఁ జూచుచున్నాఁడ ♦ సంతసమున. ౧౫

శ్లో॥ అనేకబాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వా సర్వ తోఽన న్తరూపమ్
నా న్తం న మధ్యం నపున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప!

తే॥ గీ॥ విశ్వమును నియమించెడు ♦ విశ్వరూప!
పెక్కుచేతులు కడుపులు ♦ పెక్కునోళ్లు
పెక్కు కన్నులు గల నీదు ♦ విశ్వరూప
మాది మధ్యాంతములు లేక ♦ యలరఁ గంటి. ౧౬

శ్లో॥ కిరీటినం గదినం చక్రిణంచ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్.

తే॥ గీ॥ గదయును కిరీటచక్రముల్ ♦ గలుగువాని
నప్రమేయుఁ బ్రభారాశి ♦ నన్నియెడల
గాన శక్యముగాని దీ♦ప్తానలార్క
భాసితుని దీప్తిమంతుని ♦ నిన్నుఁ గంటి. ౧౭

శ్లో॥ త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే.

తే॥ గీ॥ ఎఱుగఁదగు పరమాక్షర ♦ మీ వటంచు
ఈ జగత్ప్రబలాధార ♦ మీవటంచు
నల సనాతన పురుషుండ ♦ వవ్యయుఁ డగు
నిత్యధర్మగోప్త వటంచు ♦ నేఁ దలంతు. ౧౮

శ్లో॥ అనాది మధ్యాన్త మనన్తవీర్య
మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్.

తే॥ గీ॥ ఆదిమధ్యాంతములు లేని ♦ యట్టి వాని
యపరిమిత వీర్యబాహుల ♦ నమరువాని
నా రవి శశాంక నేత్రు దీ♦ప్తాగ్నిముఖు స్వ
తేజమున జగమేర్చెడి ♦ దేవు గంటి ౧౯

శ్లో॥ ద్యావా పృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశ శ్చ సర్వాః
దృష్ట్వాఽద్భుతం రూప మిదం తవోగ్రం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్.

తే॥ గీ॥ ఒక్కఁడవు నింగినేలల ♦ యొక్క నడుమ
పిక్కటిలి యన్ని దిశల వ్యా♦పించినావు
గొప్పవాఁడ! జడుపు, వింత ♦ గొల్పు నీదు
విశ్వరూపముఁ గనుఁగొని ♦ వెఱచె జగము. ౨౦

శ్లో॥ అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి,
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః.

తే॥ గీ॥ వేలుపులగుంపు నీలోఁ బ్ర• వేశ మైరి
భయపడినవారు చేఁ•యొగ్గి ప్రణుతు లిడిరి
సిద్ధులు మహర్షులును శుభ • సిద్ధిఁగోరి
పుష్కలస్తోత్రముల నిను • బొగడఁగనిరి. ౨౧

శ్లో॥ రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపా శ్చ
గంధర్వయక్షాసుర సిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే.

తే॥ గీ॥ దివ్యవిశ్వేఽశ్వినులును నా • దిత్య వాయు
వులును సాధ్యులు నవ్వసు • వులును రుద్ర
యక్షగంధర్వ పితృసిద్ధ • రాక్షసులును
జూచుచున్నారు నాశ్చర్య • సూచకముగ. ౨౨

శ్లో॥ రూపం మహ త్తే బహువక్త్రనేత్రం
మహాబాహో! బహుబాహూరుపాదమ్
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్.

తే॥ గీ॥ పెక్కుమొగములు కన్నులు • పెక్కుతొడలు
పెక్కుకాళ్లును జేతులుఁ • బెనుకడుపులు
భయ మిడెడు కోఱ లుండు శ • శ్వత్స్వరూప
మిటుల గని వ్యథ నందితి • మేను జగము. ౨౩

శ్లో॥ నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో.

తే॥ గీ॥ ఆకసమునంటి వెలుఁగుచు • నఖిలవర్ణ
వికసితాననములు చాల • వెడదలైన
కన్నులుంగల నీరూపుఁ • గలయఁ గాంచి
భయపడితి ధైర్యశాంతు లే•ర్పడఁగ లేవు. ౨౪

శ్లో॥ దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ! జగన్నివాస.

తే॥ గీ॥ భయము నిడు కోఱలంగల్గి • ప్రళయవహ్ని
పగిదిఁ దీండ్రించు నీ ముఖ•పంక్తిఁగాంచి
కనను దెసలను సుఖమును • గాంచకుంటి
దేవదేవ! జగద్వాస! • దీనుఁ గనుము. ౨౫

శ్లో॥ అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవాఽవనిపాలసంఘైః
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాఽస్మదీయై రపి యోధముఖ్యైః.

తే॥ గీ॥ ఇందు ధృతరాష్ట్రసుతులు మి•న్నేటిసుతుఁడు
కడవపుట్టువు కర్ణుండు • కడమ భూమి
పాలకులు మనవారలై • పరఁగునట్టి
సకలయోధవరేణ్యుల•సమితి గూడ. ౨౬

శ్లో॥ వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాళాని భయానకాని
కేచి ద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః.

తే॥ గీ॥ భయ మిడెడు కోఱలుండు భ॰వన్ముఖములఁ
గొంద ఱతిగఁ బ్రవేశంబు ॰ నందినారు
తక్కువారలు పండ్లలోఁ ॰ జిక్కి తలలు
పొడియగుచు నుండగా కనం॰బడిరి నేఁడు. ౨౭

శ్లో॥ యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలన్తి.

తే॥ గీ॥ ఏఱులు సముద్రముంగూర్చి ॰ మెట్టు లేగి
వేగ నద్దానియందు ॰ బ్రవేశ మౌనో
అంతట వెలుంగు నీదు ము॰ఖాళియందుఁ
బడుచు నున్నారు నరవీర॰వరులు మెండు. ౨౮

శ్లో॥ యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః.

తే॥ గీ॥ చచ్చుటకు బిట్టువడి పోవ॰జాలు మిడుత
లడరి మండెడు నగ్నిలో॰బడిన లాగు
ప్రాణికోట్లు మహావేగ॰వంతము:లుగఁ
బజ్వరిలు నీదు నోళ్లలోఁ ॰ బడెద రిదిగో. ౨౯

శ్లో॥ లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకా న్సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతప న్తి విష్ణో.

తే॥ గీ॥ వెన్నుఁడా! మెండుగా మండు•చున్న నోళ్ల
నమలి మ్రింగుచు నిండు జ•నమును; మిగుల
చవిగొనుచునుంటి; నీదు తీ•క్ష్ణమగు కాంతి
కలఁచె లోకమ్ము తేజమ్ము • గలయ నలమి. 30

శ్లో॥ ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమో ఽస్తు తే దేవ వర ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవ న్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృ త్తిమ్.

తే॥ గీ॥ దేవవర! యాదిపురుషుండ•వీవు, నిన్నుఁ
దెలియఁగోరెద నీ చర్యఁ • దెలియ కేను
భయముగలిగించు నీవు నె•వ్వఁడవో నాకుఁ
బలుకు! మ్రొక్కెద, నను నెన•రొలుకఁ గనుము. 3౧

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ కాలో ఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకా న్సమాహ ర్తు మిహ ప్రవృ త్తః
ఋతే ఽపి త్వా నభవిష్య న్తి సర్వే
యే ఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః.

తే॥ గీ॥ లోకము నడంచు కాలస్వ•రూపమేను
లోకహరణ ప్రవృ త్తి వె•లుంగుదేను
పరులసేనల నే యోధ•వరులు గలరొ
నీవు లేకున్న వారలు • నిలువఁబోరు. 3౨

శ్లో॥ తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుజ్‌క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మ యైవైతే నిహతాః పూర్వ మేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్.

తే॥ గీ॥ అందుచే లెమ్ము నీ వందు ♦ మధికయశము
అరులగెల్చి సమృద్ధ రా♦జ్యమ్ముగొనుము
పూర్వమే వీరు నాచేతఁ ♦ బొలియనైరి
అర్జున! నిమిత్తమాతుఁడ♦వగుమునీవు. 33

శ్లో॥ ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యా నపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్.

తే॥ గీ॥ నా వలనఁ జంపబడిన శం♦తనుకుమార
కలశజన్మ జయద్రథ ♦ కర్ణముఖ్య
వీరులందఱఁ జంపుము ♦ వీరలనని
గెలువఁజాలుదు వెఱ వీడి ♦ సలుపు రణము. 34

సంజయ ఉవాచ—

శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య.

తే॥ గీ॥ కేశవుఁడు వల్కుమాటలఁ ♦ గ్రోడి, యాల
కించి గడగడ వణకుచుఁ ♦ గేలు మోడ్చి
పెక్కుసారులు బత్తినై ♦ మ్రొక్కులనిడి
గద్గదికఁ గృష్ణుతోఁ బల్కె ♦ గడిది భీతి. 35

అర్జున ఉవాచ—

శ్లో॥ స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః.

తే॥ గీ॥ నీదగుఁ బొగడ్త ముదమున • నిండె జగము
ప్రేమఁజూపెను, రాక్షసుల్ • భీతిఁగాంచి
దెసలఁబాఱె సిద్ధులెం • తేనమస్క-
రించి రది నీదు మహిమను • రెట్టిసేసె. 3౬

శ్లో॥ కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్
గరీయసే బ్రహ్మణో உప్యాదికర్త్రే
అనన్త! దేవేశ! జగన్నివాస
త్వ మక్షరం సదసత్తత్పరం యత్.

తే॥ గీ॥ సృష్టిఁ గావించు బ్రహ్మను • సృష్టిసేయు
మొదటి సర్వోత్తమున కేల • మ్రొక్కకుందు?;
క్రతుభుగీశ! యనంత! జ•గన్నివాస!
సత్తసత్తులు పరము న•క్షరము నీవ. 3౭

శ్లో॥ త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యఞ్చ పరఞ్చ ధామ
త్వయా తతం విశ్వ మనన్తరూప!

తే॥ గీ॥ ఈవు జగమున కాధార • మీవు వేత్త
వీవు వేద్యుండ వీ వాది• దేవుఁడగుదు
వీ వల పురాణపురుషుండ • వీవు పరమ
ధాముఁడ వనంతుఁడవు జగ•ద్వ్యాపకుఁడవు. 3౮

శ్లో॥ వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ
నమో నమ స్తేఽస్తు సహస్రకృత్వః
పున శ్చ భూయోఽపి నమో నమ స్తే.

తే॥ గీ॥ వాయు వగ్నియు యముఁడును ♦ వరుణుఁడు శశి
బ్రహ్మలందఱు నగుదువు ♦ బ్రహ్మ తండ్రి
వీ వగుదు నీకు జోతలు నే♦ను జేతు
మరల జోతలఁ జేతును ♦ మఱియుఁ జేతు. ౩౯

శ్లో॥ నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనన్త వీర్యాఽమితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః.

తే॥ గీ॥ ముందు వెనుకలఁ బ్రక్కల ♦ మ్రొక్కు దేను
బీరమున మగటిమితోడ ♦ వెలయు దీవు
నన్నిచోటులఁ జక్కగా ♦ నలమినావు
కాన నన్నింటి రూపులఁ ♦ గాంచినావు. ౪౦

శ్లో॥ సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాఽపి.

తే॥ గీ॥ ఆప్తుఁడని నీదు మహిమ మి♦ట్లని యెఱుఁగక
మాటికిని బ్రణయమునఁ బ్ర♦మాదమునను
ఓయి యాదవ! యో కృష్ణ! యోయి సఖుఁడ
యంచు నజ్ఞానమున వచి♦యించినాఁడ. ౪౧

శ్లో॥ య చ్చాపహాసార్థ మసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు
ఏకోఽథవా ప్యచ్యుత! తత్సమక్షం
తత్ క్షామయే త్వా మహ మప్రమేయమ్.

తే॥ గీ॥ ఆటలం దెగతాళికి ♦ నగుచుఁ బండి
నపుడు సరసను గూర్చుండి ♦ నపుడుఁ గుడుచు
నపుడు నెదుటను జాటున ♦ నాచరించఁ
బడు నగౌరవము క్షమింపఁ ♦ బ్రస్తుతింతు
నప్రమేయుండవై యుండి ♦ నట్టి నిన్ను. ౪౨

శ్లో॥ పితాఽసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్య శ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయే ప్యప్రతిమప్రభావ.

తే॥ గీ॥ పోల్పఁ గనురాని మహిమచే ♦ గ్రాలువాఁడ!
కదలి కదలని వస్తులఁ ♦ గన్నతండ్రి!
గొప్పవాఁడవు, గురుఁడవు ♦ కొలువఁదగిన
వాఁడవు, త్రిలోకముల నేఁడు ♦ జోడు లేఁడు
నిన్నుమించిన పరుఁడెవఁ♦డున్నవాఁడు. ౪౩

శ్లో॥ తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ! సోఢుమ్.

తే॥ గీ॥ కాన సాఁగిలి యిదె నమ • స్కారముఁ గొను
పొగడఁదగు దొర, వేఁడెదఁ • బ్రోచుటకును
జనకుఁడాత్మజు మగఁడాలి • సఖుఁడు సఖుని
తప్పు లోర్చినగతి నోర్వఁ • దగుదు వీవు. ౪౪

శ్లో॥ అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస.

తే॥ గీ॥ స్వామి! దేవేశ! త్రిజగన్ని • వాస యెపుడుఁ
గనని నీ విశ్వరూపమ్ము • గాంచి యిపుడు
సంతసించితి భయముచేఁ • జింత పడితి
నీ స్వభావాకృతినిఁ జూపి • నెమ్మినిఁ బ్రోవు. ౪౫

శ్లో॥ *కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే!

తే॥ గీ॥ వేయిచేతులు గలవాఁడ • విశ్వరూప!
మును కిరీటగదా చక్ర•ముల ధరించి
కనుపడిన రూపమును జూడ • మనసు పుట్టె
నిద్ది వదలి చతుర్భుజాకృతినిఁ • జూపు ౪౬

శ్రీ భగవా నువాచ—
శ్లో॥ మయా ప్రసన్నేన తవార్జు నేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనన్త మాద్యమ్
య న్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్.

తే॥ గీ॥ అర్జునా! నీవు దక్కఁగ • నన్యులు గన
నట్టి తేజోమయ మనంత • మాద్య మగుచు
శ్రేష్ఠమౌ విశ్వరూపంబు • ప్రేమచేత
నాత్మయోగాప్తిఁ జూపింప • నయ్యె నీకు. ౪౭

---

*వివరణము:—
హరిచతుర్భుజుఁ డేవని • యార్యులనిరి, పుట్టినప్పుడు తలిదండ్రు• లట్టె కనిరి
యాత్మభక్తులు మధ్యలో నట్టె కనిరి, కెరలు నప్పుడు నాల్గయ్యె కేలు లనిరి.

శ్లో॥ న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః
ఏవం రూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వ దన్యేన కురుప్రవీర.

తే॥ గీ॥ వేదయజ్ఞాధ్యయనముల • విస్తృతోగ్ర
తపములను హోమసత్క్రియా • దానములను
వేలు వారలు గనలేని • విశ్వరూప
మీ మహిని నీకుఁ జూపితిఁ • బ్రేమచేత. ౪౮

శ్లో॥ మా తే వ్యథా మాచ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మమేదం
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య.

తే॥ గీ॥ భయకరంబగు విశ్వరూ•పంబు వలన
మూఢభావంబు వ్యథయును • బుట్టకుండు
భయము వీడియుఁ బ్రీతహృ•దయుఁడ వగుచు
మఱల నాదగు రూపమ్ము • నరయు మీవు. ౪౯

సంజయ ఉవాచ—

శ్లో॥ ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా.

తే॥ గీ॥ వాసుదేవుండు నర్జును • పల్కినట్లు
పూర్వరూపంబుఁ జూపించె • భూరి సౌమ్య
దేహమును బొంది యా వసు•దేవ సుతుఁడు
భీతిఁ జెందిన నరుఁ దేర్చెఁ • బ్రీతి తోడ. ౫౦

అర్జున ఉవాచ—

శ్లో॥ దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతింగతః.

తే॥ గీ॥ ఓ జనార్దన! శాంతంబు • నొంది యున్న
నీ మనుష్య స్వరూపంబు • నేను జూడఁ
జిత్తవికలత్వ మడఁగి వ•చ్చినది తెల్వి
ప్రకృతిభావము నెంతయుఁ • బడసినాఁడ. ౫౧

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః.

తే॥ గీ॥ ఇట్టి నా విశ్వరూపంబు • నీవు గంటి
తొలఁగ కిద్దానిఁ గాంచుట • దుస్తరంబు
దేవతలుగూడ నిత్యంబు • దీనిఁ జూడఁ
గాంక్ష సేయుచు నుందురు • కనఁగలేరు. ౫౨

శ్లో॥ నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా.

తే॥ గీ॥ ఎట్టి నా విశ్వరూపంబు • నిపుడు గంటి
వట్టి నేను వేదాధ్యయ•నాదికముల
దానముల యజ్ఞములఁ దపో•నూనగరిమ
గూడఁ జూడఁబడుటకు శ•క్యుఁడను గాను. ౫౩

శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.

తే॥ గీ॥ పగలఁ దపియింపఁ జేసెదు ♦ పార్థ! వేఱు
చింత లేనట్టి స్థిరభక్తి ♦ చేత మాత్రి
మిట్టి నా విశ్వరూపంబు ♦ నెఱుఁగుటకును
గనుటకును దత్త్వమున నిల్వఁ ♦ గనుట కగును. ౫౪

శ్లో॥ మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాణ్డవ!

తే॥ గీ॥ పాండునందన! నా యందు ♦ భక్తిఁగల్గు
వాఁడు నేగతి యని యెంచు♦వాఁడు నన్నుఁ
గూర్చి కర్మలఁజేయంగ ♦ నేర్చువాఁడు
త్యక్తసంగుఁడు నద్వేషి ♦ యందు నన్ను. ౫౫

ఇది ఏకాదశాధ్యాయము.



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమానుమద్భగవద్గీత

## ద్వాదశాధ్యాయము

### భక్తియోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యేచా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః.

తే॥ గీ॥ అచ్యుతా! నిత్యయుక్తులై • యధికభక్తి
నా త్తికొల్చెడి వారో? య•వ్యక్తమై పరి
శిస్త మక్షరమగు బ్రహ్మ•మాస్తికతను
విధి నుపాసించు, వారొకో? • విదులు చెపుమ. ౧

శ్రీభగవా నువాచ—

శ్లో॥ మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః.

తే॥ గీ॥ నిలిపి నాయందు మనసును • నిత్య యుక్తు
లగు చతిశ్రద్ధతోడను • దగిలి కొల్చు
భక్తులే శ్రేష్ఠు లగు యోగి•వర్యు లగుదు
రనుచు నా మత మని నీవు • నాత్మ నెఱుఁగు. ౨

శ్లో॥ యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచిన్త్యఞ్చ కూటస్థ మచలం ధ్రువమ్.
తే॥ గీ॥ అక్షర మ్మనిర్దేశ్య మ•వ్యక్తమగుచు
అంతటను నిండి మదికంద • కచలమగుచుఁ
బ్రకృతి కధికారి యగుచు శా•శ్వతము నైన
బ్రహ్మముం గొల్చువారు న•న్నబడయ గలరు. 3
శ్లో॥ సన్నియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః.
తే॥ గీ॥ ఎవ్వ రిందిృయములను జ•యించి సకల
మైన వానిని సమబుద్ధి • నాదరించి
సర్వ భూతహితంబు ని•చ్చలు దలతురొ
వారలందఱు ననుఁ బొందు•వారు సుమ్ము. ४
శ్లో॥ క్లేశోధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహావద్భి రవాప్యతే.
తే॥ గీ॥ సగుణరూపక మగు నుపా•సనము కంటె
నిర్గుణోపాసనం బెంతొ • దుర్గమంబు
వపువుదాల్పులు నిర్గుణో•పాసనంబు
భూరి దుఃఖముచేఁ గాని • పొంద లేరు. ५
శ్లో॥ యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.
తే॥ గీ॥ సర్వకర్మలు నాకునై • సన్న్యసించి
నన్నె పరమంపుగతిగాగ • నమ్మి యుండి
యన్య మెఱుఁగని యోగంబు • నందు నుండి
నన్నుపాసింతు రెవరు ధ్యా•నం బొనర్చి. ६

శ్లో॥ తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరా త్పార్థ మయ్యావేశిత చేతసామ్.

తే॥ గీ॥ నెఱీని నాయందు చిత్తము • నిల్పినట్టి
వారలను మృత్యుయుక్త సం•సార జలధి
వలన శీఘ్రింబుగాను లే•వంగ నెత్తు
వాఁడ నగుచున్న వాఁడ నో • పార్థ! నిజము, ౭

శ్లో॥ మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

తే॥ గీ॥ నిలుపు నాయందె తిరముగా • నీదు మనము
వెసను నా యందె బుద్ధిఁ బ్రి•వేశపెట్టు
పిదప నాయందు నీవు ప్రి•వేశమౌదు
నిజ మనుచు దీని నమ్ము సం•దియము లేదు. ౮

శ్లో॥ అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనఞ్జయ.

తే॥ గీ॥ విను ధనంజయ! తిరముగ • విశ్వరూపుఁ
డైన నా యందు మదినిల్ప • నలవిగాద
యేని యభ్యాస యోగమ్ము • నేని పూని
నన్నుఁ బొందుటకై నెమ్మ•నమునఁ గోరు. ౯

శ్లో॥ అభ్యాసే ఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వ న్సిద్ధి మవాప్స్యసి

తే॥ గీ॥ అట్టి యభ్యాసయోగంబు • నందుఁగూడ
నీవు నసమర్థుఁడవయేని • నీ మనంబు
నాదు సంబంధకర్మలఁ • బాదుకొల్పి
చేయు మద్ధాన మోక్షంబుఁ • జెందఁ గలవు. ౧౦

శ్లో॥ అథైత దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.

తే॥ గీ॥ నాదు సంబంధకర్మ లొ◆నర్పఁజాల
వేని మద్యోగమును నాశ్ర◆యించి మిగుల
నియమమున యందు మనసును ◆ నిల్పి సకల
లౌక్యవైదిక కర్మఫ◆లముల వదలు. ౧౧

శ్లో॥ శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్.

తే॥ గీ॥ ఎఱుకలేని చేతలకంటె ◆ నెఱుక మేలు
ఎఱుకకంటెను ధ్యానత◆త్పరత మేలు
దానికంటె ఫలత్యాగ ◆ మాను మేలు
దానివలనను పిదప శాం◆తమ్ము గలుగు. ౧౨

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ.

తే॥ గీ॥ సర్వభూతంబులందు ద్వే◆షంబులేక
పరికటముంజేసి మిత్రభా◆వంబు దయయు
మమతయు నహంకరణమును ◆ మాపి వేసి
సమత సుఖదుఃఖముల గాంచి◆ క్షమను గల్గి. ౧౩

శ్లో॥ సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః.

తే॥ గీ॥ *ఎల్లెడల సంతసముతోడ ♦ నెసఁగుచుండు
యోగి, నియతాత్మ దృఢనిశ్చ♦యుండు నాకు
వదలిన మనంబు బుద్ధిని ♦ వరలు భక్త
వర్యుఁడే కడుఁ బ్రియమైన ♦ వాఁడు సుమ్ము. ౧౪

శ్లో॥ యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః.

తే॥ గీ॥ ఎవనిచే లోకము భయమ్ము ♦ నెనయఁబోదు
ఎవఁడు లోకముచే భీతి ♦ నెనయఁబోఁడు
భయము కోపమ్ము తొందర♦పాటు ముదము
లేనివాఁడు నా కిష్టు ♦ డైనవాఁడు. ౧౫

శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః.

తే॥ గీ॥ దేనియందును గోరిక ♦ లేనివాఁడు
శుద్ధుఁడు సమర్థుఁడు తటస్థ♦బుద్ధివాఁడు
నపగతవ్యథుఁడును త్యాగి ♦ యైనవాఁడు
నగును నా భక్తుఁడును బ్రియుం ♦ డైనవాఁడు. ౧౬

---

*తే॥గీ॥ దొరకుటకు దొరకమి కోర్పు ♦ తుష్టి యందుఁ
యుక్త మగుచోట మది నిల్ప ♦ యోగి యందుఁ
నాత్మ స్వాధీనమైన య♦తాత్మ డందుఁ
సరవిఁ దత్వస్థితుండు ని♦శ్చయుఁడటందుఁ.

శ్లో॥ యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమా న్య స్స మే ప్రియః.

తే॥ గీ॥ హర్షమును ద్వేషమును జెంద • నట్టివాఁడు
దుఃఖకాంక్షల రెంటికిఁ • దొలఁగువాఁడు
శుభము నశుభమ్ము వర్జించి • చూచువాఁడు
నగును నా భక్తుఁడుం బ్రియుఁ • డైనవాఁడు. ౧౭

శ్లో॥ సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః.

తే॥ గీ॥ మిత్రశత్రుల సమతచే • మెలఁగువాఁడు
గౌరవాగౌరవము లట్లె • కనెడువాఁడు
తులిత శీతోష్ణసుఖదుఃఖ • ములు గలాఁడు
నన్నిటను సంగవర్జితుం • డైనవాఁడు. ౧౮

శ్లో॥ తుల్యనిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః

తే॥ గీ॥ స్తుతియు నిందయు సమముగాఁ • జూచువాఁడు
మౌనియును దేననేఁ దృప్తి • నూనువాఁడు
స్థిరమతియు ననికేతుఁడై • తిరుగువాఁడు
నైన భక్తుండు నా కిష్టుఁ • డైనవాఁడు. ౧౯

శ్లో॥ యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాఽస్తేఽతీవ మే ప్రియాః.

తే॥ గీ॥ పరమధర్మ్యామృతంబు నే ♦ భక్తులేని
నుత్తమంబగు గతిగ య♦థోక్త సరణి
నెంచి శ్రద్ధాళులై యుపా♦సించుచుందు
రట్టివారలు నా కిష్టు♦లైన వారు.

ఇది ద్వాదశాధ్యాయము.



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ మా ను ష ద్భ గ వ ద్గీ త

## త్ర యో ద శా ధ్యా య ము

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ,
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయఞ్చ కేశవ.

తే॥ గీ॥ అనఘ! క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁ ♦ డనఁగ నేమొ?
హరి! ప్రకృతి యన నెట్టిది? ♦ పురుషుఁడెవరొ?
కడిది జ్ఞేయం బనగ నేది ♦ జ్ఞానమేది
విశదముగ దీని నెఱుఁగఁగ ♦ విశ్వసింతు. ౧

శ్రీభగవా నువాచ—

శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మి త్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః.

తే॥ గీ॥ గొంతిమూఁడవ కొమరుండ! ♦ కోర్కి వినుము
కేవలం బీ శరీరంబె ♦ క్షేత్ర మగును
దీనిఁ దెలిసిన క్షేత్రజ్ఞుఁ ♦ డౌ నటంచుఁ
దెలిసినటువంటి వారలే ♦ పలుకుచుంద్రు. ౨

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ.
తే॥ గీ॥ భరతకులవర్య! విను క్షేత్ర•వర్గ మందు
నెనసియుండిన క్షేత్రజ్ఞుఁ•డేన సుమ్ము
నిద్ది క్షేత్రంబు క్షేత్రజ్ఞుఁ•డీతఁడంచుఁ
దెలిసికొనుటయె జ్ఞానంబు • తేటగాను. 3
శ్లో॥ తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు.
తే॥ గీ॥ ఎట్టిదో క్షేత్ర మా ధర్మ•మెట్టిదానో?
ఏ వికారమ్ము లున్నవో • యెచటనుండి
తాను గల్గిన దొక్కో క్షే•త్రజ్ఞుఁ డెవఁడొ
ప్రతిభ యెట్టిదో దాని నా•వలన వినుము. ४
శ్లో॥ ఋషిభి ర్బహుధా గీతం ఛన్దోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః
తే॥ గీ॥ వివిధ మగు వేదములచేత • వేఱువేఱ
పలుతెఱంగుల ఋషులచేఁ • బలుకఁబడియు
ప్రకటకారణనిశ్చిత • బ్రహ్మసూత్ర
వాక్యములచేత నది స్థిర•పఱుపఁబడియె. ౫
శ్లో॥ మహాభూతా న్యహఙ్కారో బుద్ధి రవ్యక్త మేవ చ
ఇన్ద్రియాణి దశైకఞ్చ పఞ్చ చేంద్రియగోచరాః.
తే॥ గీ॥ నింగి గాలియు నగ్గియు • నీరు నేల
నా యహంకార బుద్ధు ల•వ్యక్తము నెద
నెనసియుండిన పదునొకం•డింద్రియములు
వివిధరూపంపు శబ్దాది•విషయములును. ౬

శ్లో॥ ఇచ్ఛా ద్వేషం సుఖం దుఃఖం సఙ్ఘాత శ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతం.

తే॥ గీ॥ కాంక్ష ద్వేషంబు సుఖము దుః♦ఖంబు తనువి
శిష్ట మగు నింద్రియచయమ్ము ♦ చేతనమ్ము
ధృతియుఁగూడి వికార సం♦యుతమ్మునైన
క్షేత్ర మని నీ వెఱుఁగు సం♦క్షేపముగను ౭

శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః

తే॥ గీ॥ అనభిమాన మదంభంబు ♦ నయ్యహింస
శౌచ మాచార్యసేవ యా♦ర్జవము నోర్పు
నిరుపమానం బయిన చిత్త♦నిశ్చలతయు
నిరతిశయ మగు నాత్మ వి♦నిగ్రహంబు. ౮

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మమృత్యుజరా వ్యాధి దుఃఖదోషానుదర్శనమ్.

తే॥ గీ॥ విషయములయందు వైరాగ్య ♦ విస్తరంబు
నేను ననెడు నహంకార ♦ నిగ్రహంబు
జన్మమృత్యువ్యథారోగ ♦ జరల వలని ౯
యెల్ల దోషంబులను గుఱు♦తెఱుఁగుటయును.

శ్లో॥ అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు.

తే॥ గీ॥ పుత్రదార గృహాదుల ♦ బుద్ధిలేమి
సకల విషయంబులందును ♦ సక్తిలేమి
మేలు కీడులు గలిగిన ♦ వేళ లందు ౧౦
నిత్యమగు సమచిత్తత ♦ నెఱపుటయును.

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది.

తే॥ గీ॥ నా యెడ ననన్యయోగంబు • నం దనర్చి
చలన మొందని భక్తిని • గలిగియుంట
జనరహితమైన దుర్గమ • స్థలి నిలుచుట
క్రమముగా పామరులయం ద • రక్తిఁ గనుట. ౧౧

శ్లో॥ అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యద తోఽన్యథా.

తే॥ గీ॥ ఆత్మవిషయక జ్ఞానంబు • నలవఱచుట
తత్త్వము నెఱుంగు నెఱుకను • దవిలియుంట
ఈ గుణంబులు జ్ఞానమై • యెసఁగు చుండు
అన్యమైనది యజ్ఞాన • మై తనర్చు. ౧౨

శ్లో॥ జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి
యద్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే
అనాదిమ త్పరం బ్రహ్మ
న సత్త న్నాస దుచ్యతే.

తే॥ గీ॥ పూని యెద్దానిఁ దెలిసిన • మోక్షమందు
నెద్ది జ్ఞేయంబొ దానిని • నెఱుకపఱతు
అది యనాది పరబ్రహ్మ • మయి తనర్చు
సత్తసత్తని నుడువంగఁ • జాలని దది. ౧౩

శ్లో॥ సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వతశ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి.

తే॥ గీ॥ అద్ది యంతటఁ గాల్సేతు ◆ లమరినదిగ
హత్తి యంతటఁ గనుచెవు ◆ లమరినదిగ
కడిది తలలును మోములు ◆ గలిగినదిగ
విరివి జగమంతటను నిండి ◆ వెలుఁగుచుండు. ౧౪

శ్లో॥ సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్
అసక్తం సర్వభృ చ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ.

తే॥ గీ॥ అన్ని యిందిరియ గుణముల ◆ నలరునదియు
నిందిరియము లన్నిటిని వీడి ◆ మెసఁగునదియు
దేని కంటక యన్నింటిఁ ◆ బూనినయది
గుణములే లేక యవ్వానిఁ ◆ గుడుచునదియు. ౧౫

శ్లో॥ బహి ర న్తశ్చ భూతానా మచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్.

తే॥ గీ॥ అద్ది భూతాళిలో వెలి◆నలరినయది
చిన్నదిగ నుంటఁ దెలియగాఁ ◆ జిక్కనియది
కదలనిదియును మఱియును ◆ గదలునదియు
దగ్గఱగ దూరముగఁగూడఁ ◆ దనరునదియు. ౧౬

శ్లో॥ అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్
భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ.

తే॥ గీ॥ అఖిలభూతంబుల విభక్త◆మైన యట్లు
తోఁచు చేవిభక్తమైనట్లు ◆ దోఁచునదియుఁ
బేర్మి భూతాళిఁ బుట్టించి ◆ పెంచునదియు
మ్రింగునది యదియ బ్రహ్మ◆మై యుండఁగనుము. ౧౭

శ్లో॥ జ్యోతిషా మపి తజ్జ్యోతి _స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్.

తే॥ గీ॥ వెలుఁగు లన్నింటిపై నది ♦ వెలుఁగు నదియుఁ
జీఁకటికిఁ జాల వేఱయి ♦ చెలఁగునదియు
నెఱుకయు నెఱుంగఁదగినది ♦ యెఱుకవలని
నిగ్గు నందఱి యెడఁదల ♦ నిలిచియుండు. ౧౭

శ్లో॥ ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చో _క్తం సమాసతః
మద్భ_క్త ఏత ద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే.

తే॥ గీ॥ క్షేత్ర మిది జ్ఞాన మిది యని ♦ జ్ఞేయ మిద్ది
యంచు సంక్షేపముగఁ జెప్పఁ♦నయ్యె నిట్లు
నాదుభ_క్తుం డిది యెఱింగి♦నం గడంక
మఱియు మోక్షంబునంద స♦మర్థుఁడగును. ౧౮

శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభా వపి
వికారాం శ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతిసంభవాౝ.

తే॥ గీ॥ ప్రకృతి పురుషు లనాదిగాఁ ♦ బరఁగి రంచుఁ
దెలియుము వికారములు గుణ♦ములును గూడ
బ్రకృతివలన జనించిన ♦ పగిదిఁ దెలియు
బుద్ధి ద్వంద్వాదులు వికార♦ములు గుణములు. ౨౦

శ్లో॥ కార్యకారణక_ర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖదుఃఖానాం భో_క్తృత్వే హేతు రుచ్యతే.

తే॥ గీ॥ కార్యకారణ క_ర్తృత్వ♦కముల యందుఁ
బ్రకృతి హేతువుగాఁ జెప్పఁ♦బడుచునుండె
సుఖము దుఃఖంబు ననుభవిం♦చు విషయమునఁ
బురుషుఁడే కారణంబుగా ♦ బుద్ధిఁ దెలియు. ౨౧

శ్లో॥ పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్
కారణం గుణసంగోఽస్య సదస ద్యోనిజన్మసు.

తే॥ గీ॥ పురుషుఁ డెప్డు ప్రకృతియందుఁ ♦ బొల్చియుండి
ప్రకృతి సంజనితగుణాను♦భవుఁడు నగును
గుణము లందలి సంగకా♦రణము వలన
ను త్తమము నీచమగు జన్మ ♦ లెత్తుచుండు. ౨౨

శ్లో॥ ఉపద్రష్టా ఽనుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాఽప్యుక్తో దేహేఽస్మిన్ పురుషః పరః

*తే॥ గీ॥ ఈ శరీరమునందుండి ♦ యెంతొ శ్రేష్ఠ
మగు పరబ్రహ్మ దరిఁ జూచు♦నట్టివాఁడు
ననుమతించెడువాఁడుగా ♦ ననుభవించు
వాఁడు భరియించువాఁడునుఁ ♦ బ్రభువును బర
మాత్మయనియును జెప్పఁగా ♦ నైనవాఁడు. ౨౩

శ్లో॥ య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే.

తే॥ గీ॥ ఎవఁడు పురుషుని ప్రకృతిని ♦ నివ్విధముగ
నెల్ల గుణములతోఁగూడ ♦ నెఱుఁగు నతఁడు
అన్ని తెఱఁగుల వర్తించు♦చున్నఁగాని
మరల జన్మింపఁడని నీదు ♦ మది నెఱుంగు. ౨౪

---

* తే॥ గీ॥ ప్రత్యగాత్మగఁ బరమాత్మ ♦ పరగు నంచు
నా మహేశ్వరుఁడే పర♦మాత్మయంచుఁ
బూని జీవేశ్వరైక్యంబు ♦ పొసఁగునంచు
[illegible] ♦ వాక్యములు

శ్లో॥ ధ్యానేఽ ఽనాత్మని పశ్యన్తి కేచి దాత్మాన మాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే.

తే॥ గీ॥ *ధ్యానమునఁ గొందరాత్మయం • దాత్మచేత
నాత్మఁజూచుచు నున్నారు • నన్యు లింక
సాంఖ్యయోగంబుచేఁ జూడఁ • జాలినారు
కర్మయోగంబుచేఁ జూడఁ • గలిగినారు. ౨౫

శ్లో॥ అన్యే త్వేవ మజానన్త శ్శ్రుత్వాన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః.

తే॥ గీ॥ పై విధంబు నెఱుంగని • వారు గురుల
వలన వినియు నుపాసించు • వారు గలరు
అట్టి శ్రవణ పరాయణు • లైనవారు
మున్నుగా మృత్యువు జయించు • చున్నవారు. ౨౬

శ్లో॥ యావ త్సంజాయతే కిఞ్చి త్సత్త్వం స్థావరజఙ్గమమ్
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగా త్తద్విద్ధి భరతర్షభ.

తే॥ గీ॥ కదలఁగలిగిన వస్తు సం • ఘమ్ముఁగాని
కదలలేనట్టి వస్తు సం • ఘమ్ముగాని
ప్రభవమొందెడి దేదైన • ప్రకృతిపురుష
యోగమునఁ బుట్టు నని తెలి • యుము కిరీటి! ౨౭

---

*ఆత్మశబ్దంబొసంగు మూఁ • డర్థములవి:
మనసు జీవాత్మయుం బర • మాత్మయంచు.

శ్లో॥ సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్
వినశ్య త్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి.
తే॥ గీ॥ సకలభూత వ్రజంబును ♦ సమయుచుండ
నాశనములేక సమత నుం♦డంగఁదగిన
యట్టి పరమేశు నిశ్చలు ♦ నరయు నెవ్వఁ
డతడు సమదృష్టిఁ గలిగిన ♦ యట్టివాఁడు. ౨౮

శ్లో॥ సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాంగతిమ్.
తే॥ గీ॥ అన్ని భూతంబులందున ♦ నడరునట్టి
యీశ్వరు సమానముగఁ గాంచు ♦ నెవఁడు వాఁడు
తన్నుఁ దా నట్టె హింసింపఁ ♦ దలఁపఁబోఁడు
గాన పిమ్మట మోక్షంబుఁ ♦ గాంచఁగలఁడు. ౨౯

శ్లో॥ ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః
యః పశ్యతి తథాఽఽత్మాన మకర్తారం స పశ్యతి.
తే॥ గీ॥ అన్నివిధములచేతను ♦ నఖిలకర్మ
నా ప్రకృతిమాయచేతఁ జే♦యబడునట్టు
లెవఁడు దలఁచు; నకర్తగా ♦ నెంచువాడు
నతడు లెస్సగ నెఱుకమై ♦ నలరువాఁడు. 30

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా.
తే॥ గీ॥ వేఱువేఱుగఁ గనఁబడు ♦ వివిధభూత
జాలముల నొక్కదానిలోఁ ♦ గ్రాలునట్టు
లెపుడు చూచునో యపుడు నీ ♦ యెల్లజగతి
వ్యాప్తమగు బ్రహ్మమును జెంద♦నగును వాఁడు. 30

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వాత్పరమాత్మాఽయ మవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే.

తే॥ గీ॥ *అవ్యయుఁడు నిర్గుణుండు న♦నాదియైన
యట్టి పరమాత్మ తనువునం ♦ దలరునట్టి
వాఁడయిన నే పనులసేయు♦వాఁడు గాని
దేనిచే నంటఁబడువాఁడు ♦ గాని కాఁడు. 3౨

శ్లో॥ యథా సర్వగతం సౌక్ష్మ్యా దాకాశం నోపలిప్యతే
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మా నోపలిప్యతే.

తే॥ గీ॥ సూక్ష్మమును సర్వగతమును ♦ శుభ్రమైన
యాకసము దేనినేనియు ♦ నంటనట్టు
లంతటను నిండియున్నట్టి ♦ యాత్మగూడ
దేహమందుండి యంటక ♦ తేజరిల్లు. 33

శ్లో॥ యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత.

తే॥ గీ॥ ఒక్కఁడైనట్టి సూర్యుండు ♦ పెక్కులగుచుఁ
జెలఁగు జగముల వెలిగింపఁ ♦ జేయునట్లు
క్షేత్రమున నిల్చినట్టి వి♦శిష్టమూర్తి
క్షేత్రముల నన్నిటిం బ్రకా♦శింపఁజేయు. 3౪

*ఆదిగుణములు లేకుంట ♦ నవ్యయుఁడగు

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా
భూతప్రకృతిమోక్షం చ యే విదు ర్యాన్తి తే పరం॥

తే॥ గీ॥ ఎవరు విజ్ఞానదృష్టిచే • నిట్లు క్షేత్ర
మునకు, క్షేత్రజ్ఞునకు భేద • మును సమస్త
భూతముల కుండు ప్రకృతి వి• మోచనంబు
దెలియుదురొ వారు బ్రహ్మంబుఁ • దెలియువారు. ౩౫

ఇది త్రయోదశాధ్యాయము



ఓమ్

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ మానుమద్భగవద్గీత



## చతుర్దశాధ్యాయము



## గుణత్రియ విభాగయోగము

శ్రీభగవా నువాచ—

శ్లో॥ పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమమ్
యద్ జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధిమితో గతాః

తే॥ గీ॥ అఖిలమానులు నే జ్ఞాన♦మనెడు నిధిని
హత్తి యుత్కృష్ట మోక్షమ్ము ♦ నందినారొ
శస్త ముత్తమ మైనట్టి ♦ జ్ఞాన మిపుడు
విశదముగఁ బల్కుచున్నాడ ♦ వినుము మరల.

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయేన వ్యథన్తిచ.

తే॥ గీ॥ ఇట్టి జ్ఞానంబుఁ దా మాశ్ర♦యించి మించి
నట్టివారలు నాత్మైక్య ♦ మందువారు
వారు సృష్ట్యాది జన్మించు♦వారుఁగారు
కాలగతి నొందువారలు గాని ♦ కారు. ౧

శ్లో॥ మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్
సమ్భవ స్సర్వ భూతానాం తతో భవతి భారత.

తే॥ గీ॥ నాదు ప్రకృతి మహద్బ్రహ్మ ♦ నాగఁబరగు
నేను బీజంబు నుంతు న♦ద్దానియందు
దానివలనను సర్వభూ♦తముల సృష్టి
సంభవించుచు నున్నది ♦ సవ్యసాచి ! 3

శ్లో॥ సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సమ్భవన్తి యాః
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా.

తే॥ గీ॥ అఖిల యోనుల నే మూర్తు ♦ లడరుచుండు
వానికిని బ్రకృతియె మహ♦ద్బ్రహ్మమగును
గొంతి కొమరుండ ! యాకృతి ♦ సంతతులకు
నగుదు బీజంబు నుంచెడు ♦ నట్టి పితను. ౪

శ్లో॥ సత్త్వం రజ స్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః
నిబధ్నన్తి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్.

తే॥ గీ॥ ప్రకట బాహు బలాన్విత! ♦ ప్రకృతివలన
సత్త్వము రజస్సును దమస్సు ♦ సంభవించి
యవ్యయాత్మను దేహంబు ♦ నందు నెపుడు
చుట్టి బంధించు చున్నవి ♦ సుమ్ము నమ్ము. ౫

శ్లో॥ తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్
సుఖ సంగేన బధ్నాతి జ్ఞాన సఙ్గేన చానఘ

తే॥ గీ॥ స్వచ్ఛమైన దగుట నందు ♦ సత్త్వగుణము
ఘనము నిరుపద్రవంబు ప్ర♦కాశకమయి
జ్ఞానసుఖములతోడి యా♦సక్తివలన
తగిలి జీవుని యటుల బం♦ధించుచుండు. ౬

శ్లో॥ రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గ సముద్భవమ్
తన్నిబధ్నాతి కౌన్తేయ కర్మ సఙ్గేన దేహినమ్.

తే॥ గీ॥ గొంతికొమరుండ! విను♦ రజోగుణము రాగ
రూపమయ్యు విషయవాంఛ ♦ దోపఁజేసి
సంగమొందించు దేహిని ♦ సకలకర్మ
సంచయంబున దించి బం♦ధించుచుండు. ౭

శ్లో॥ తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్
ప్రమా దాలస్య నిద్రాభి స్త న్నిబధ్నాతి భారత.

తే॥ గీ॥ అఖిలదేహుల మోహమ్ము ♦ నందఁజేయఁ
జాల్ తమోగుణ మజ్ఞాన ♦ జనిత మగును
అది ప్రమాదంబు నిద్ర మాం♦ద్యంబు లనెడు
త్రిగుణములచేత జీవు బం♦ధించుచుండు. ౮

శ్లో॥ సత్త్వం సుఖే సఞ్జయతి రజః కర్మణి భారత!
జ్ఞాన మావృత్య తు తమః ప్రమాదే సఞ్జయ త్యుత.

తే॥ గీ॥ భారతా! సత్త్వము సుఖంబుఁ ♦ బరఁగఁ జేర్చు
నల రజోగుణ మా కర్మ♦లందుఁ జేర్చు
మొగిని జ్ఞానంబుఁ జుట్టి త♦మోగుణంబు
నన్నివిధముల మఱపున ♦ యందుఁ జేర్చు. ౯

శ్లో॥ రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత!
రజ స్సత్త్వం తమశ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా.

తే॥ గీ॥ భారతా! దేహమున నొక్క♦మాఱు సత్వ
వృద్ధియౌ మిగిలినవాని ♦ రెంటికంటె
వృద్ధియౌను రజ స్సల ♦ రెంటికంటె
వృద్ధియౌను తమ స్సల ♦ రెంటికంటె. ౧౦

శ్లో॥ సర్వ ద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్వ మిత్యుత.
తే॥ గీ॥ ఎలమి జ్ఞానప్రకాశమ్ము ♦ లెప్పుడు దేహ
మంచు సర్వేంద్రియమ్ముల ♦ యందుఁ గలుగు
నప్పుడు రజస్తమస్సులు ♦ నణఁగిపోయి
సత్త్వగుణవృద్ధి యౌనని ♦ సరగఁ దెలియు. ౧౧
శ్లో॥ లోభః ప్రవృత్తి రారమ్భః కర్మణా మశమః స్పృహా
రజ స్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ.
తే॥ గీ॥ భరతకులవర్య! ద్రవ్యలో♦భత్వమును బ్ర
వృత్తి కర్మాచరణమును ♦ విషయతృష్ణ,
శాంతిలేమి; రజోగుణ ♦ జన్మవృద్ధి
సమయమున బుట్టునంచును ♦ జక్క నెఱుఁగు. ౧౨
శ్లో॥ అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ
తమ స్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన.
తే॥ గీ॥ మఱపు మొద్దుతనము మోహ♦పరత మెఱుక
కలుగకుండుట యనిమెదు ♦ పలు విధమ్ము
లైన యవగుణములు తమ♦స్సటై పుట్టి
వృద్ధి యగువేళ పుట్టునం ♦ చెఱుఁగు మయ్య. ౧౩
శ్లో॥ యదా సత్త్వే ప్రవృద్ధేతు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమ విదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే.
తే॥ గీ॥ సత్వగుణవృద్ధి యగునట్టి ♦ సమయమందు
జీవుఁ డొడలును విడఁ దట♦స్థించెనేని
యాతఁ డుత్తమ విదులొందు ♦ నట్టివైన
పుణ్యలోకంబు లొందెడి ♦ విధము నమ్మ ౧౪

శ్లో॥ రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే.

తే॥ గీ॥ దేహి మేను రజోవృద్ధిఁ ♦ దిగిచెనేని
కర్మసంగుల గృహములఁ ♦ గల్గుచుండు
దేహి మేనుఁ దమోవృద్ధిఁ ♦ దిగిచెనేని
మూఢయోనులయందుఁ దాఁ♦బుట్టుచుండు. ౧౫

శ్లో॥ కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్.

తే॥ గీ॥ *పుణ్యకార్యములకు సత్త్వ♦భూతమైన
నిర్మలత్వంబె ఫలమండ్రు ♦ నిఖిలబుధులు
నల్లె రాజసకృతులకు ♦ నార్తి ఫలము
సర్వతామసకృతుల క♦జ్ఞాన ఫలము. ౧౬

శ్లో॥ సత్త్వా త్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాదమోహౌ తమసో భవతోఽ జ్ఞాన మేవ చ.

తే॥ గీ॥ సత్త్వగుణమున జ్ఞానంబు ♦ సంభవించు
నల రజోగుణమున లోభ♦మంకురించు
మొగిఁ దమోగుణమున మఱ♦పును ఘటించు
నవల మోహాన నజ్ఞాన ♦ మంకురించు. ౧౭

తే॥గీ॥ * దుఃఖరాహిత్య మగుచు సం♦స్తుత్యమగుచు
రహి రజ స్తమో మాలిన్య ♦ రహితమైన
"సుఖము" నిర్మల శబ్దార్థ ♦ సూచక మని
శంకరులు మొదలగు మతా♦చార్యు లనిరి.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః.

తే॥ గీ॥ సాత్త్వికులు నూర్ధ్వగాములై • సంచరింతురు
రాజసులు మర్త్యలోకాప్తిఁ • బ్రబలుచుందురు
నీచకార్యపరతచేత • నెగడుచుంటఁ
దామసులు హీనయోనులఁ • దరలుచుందురు. ౧౮

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి.

తే॥ గీ॥ ద్రష్ట దేహేంద్రియ విషయ•ప్రకరమునకు
పరుడు జీవుడంచెవ్వా డే•ర్పడగఁ గనడొ
ఆత్మ తద్గుణములకు వే•ఱంచుఁ గనునొ
అతఁడు నా బ్రహ్మభావంబు • నందఁగలడు. ౧౯

శ్లో॥ గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మమృత్యుజరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే.

తే॥ గీ॥ తనువునకు హేతువగు గుణ•త్రియము దేహి
యెప్పుడు నతిక్రమించునో • యప్పుడెల్ల
జన్మమృత్యు జరాదుఃఖ • సంకటములఁ
బాసి సంసారమోక్షంబుఁ • బడయు సుమ్మ. ౨౦

అర్జున ఉవాచ—

శ్లో॥ కైర్లిఙ్గై స్త్రీన్ గుణానేతా నతీతో భవతి ప్రభో
కి మాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే

తే॥ గీ॥ దేహి యే చిహ్నములచేతఁ • ద్రిగుణములను
దాటఁగలుగునో వానిని • దాటువాఁడు
ఎట్టి యాచారమును గల్గి • యొసఁగుచుండు
త్రిగుణముల నెట్టులాతఁ డ•తిక్రమించు. ౨౧

శ్రీ భగవానువాచ—

శ్లో॥ ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాఙ్క్షతి.

తే॥ గీ॥ పాండవుఁడ! గుణముల దాటు♦వాఁడు నట్టి
త్రిగుణజాత ప్రకాశ ప్ర♦వృత్తిమోహ
సంగతుండైన యపుడు ద్వే♦షంబుఁగనఁడు
వాంఛ సేయండు నవి వీడు ♦ పట్టునందు. ౨౨

శ్లో॥ ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే.

తే॥ గీ॥ గుణవికారంబులఁ జలింప ♦ కొనరువాఁడు
మొగిఁదటస్థునివలె నుండి♦ముగ్గొనములు
వాని వ్యాపారముల నవి ♦ వఱలు ననుచు
నిశ్చయించి చలింపక ♦ నిలుచువాఁడు. ౨౩

శ్లో॥ సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాఞ్చనః
తుల్యప్రియాప్రియో ధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః

తే॥ గీ॥ ద్వంద్వసముడును ధీరుండు ♦ స్వస్థపరుఁడు,
కనకమృచ్ఛిల లొకటిగాఁ ♦ గాంచువాఁడు.
ప్రియము నప్రియ మొకటిగఁ ♦ బెంచువాఁడు
స్తుతిని నిందను నొకటిగాఁ ♦ జూచువాఁడు ౨౪

శ్లో॥ మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారమ్భపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే.

తే॥ గీ॥ మాన మవమాన మొకటిగా ♦ మార్చువాఁడు
మిత్రశత్రుల నొకటిగా ♦ మెలఁగువాఁడు
సకలకర్మలఁ ద్యజియింపఁ ♦ జాలువాఁడు
నతఁడు త్రిగుణంబుల కతీతు♦డైనవాఁడు. ౨౫

శ్లో॥ మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాంత్సమతీ త్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే.

తే॥ గీ॥ కదలకుండెడు భక్తియో•గమ్ము చేత
నన్ను నెవ్వడు సేవించు•చున్నవాఁడొ
అతడు త్రిగుణంబుల కతీతుఁ•డైనవాఁడు
మఱియు బ్రహ్మంబునంద స•మర్థుడగును. ౨౬

శ్లో॥ బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృత స్యావ్యయస్య చ,
శాశ్వతస్య చ ధర్మస్య సుఖ స్యైకాన్తికస్య చ.

తే॥ గీ॥ నాశరహితమ్ము, సంతతా•నందరూప
మవ్యయమ్మును శాశ్వతం•బైన యదియు,
ధర్మ మేకాంతికమ్మునై • తనరు బ్రహ్మ
మునకు నే నెప్పు డాధార•ముగను నుందు.

ఇది చతుర్దశాఽధ్యాయము.



ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమానుమద్భగవద్గీత

## పంచదశాధ్యాయము

## పురుషోత్తమప్రాప్తియోగము

శ్రీభగవానువాచ—

శ్లో॥ ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్
ఛన్దాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్.

తే॥ గీ॥ *ఆప్పరబ్రహ్మమూలం బహంకృతియు మ
హత్తు తన్మాత్రలా శాఖ • లవ్యయంబు
శ స్త్రవేదపర్ణంబు నశ్వత్థతరువు
విరివిగా నెఱిగినవాఁడు • వేదవిదుఁడు. ౧

*తే॥ గీ॥ తనను దెలియు నెఱుకగల్గు • తలయ మొదలు
నేను మొదలైన కొమ్మలు • మేను మారిన
నడగుప్రాతది ప్రాఁబల్కు • టాకులగమి
నెసఁగెడు కుటుంబపుంజెట్టు • నెఱుఁగువాఁడు
ప్రాఁబలుకు తేట నెఱిఁగిన • వాఁడు నౌను.

తే॥ గీ॥ ఆలమహాత్మ్యసూక్ష్మ హేతు నిత్యతల వలన
నురుతరావ్యక్త వస్తువు నూర్ధ్వమగును
మహదహంకార శబ్ద త • న్మాత్ర వర్గ
మగును శాఖలు నశ్వత్థ • మగు తరంబు.

శ్లో॥ అధ శ్చోర్ధ్వం పరిసృతా _స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః
అధ శ్చ మూలా న్యనుస_న్తతాని
కర్మానుబన్ధీని మనుష్యలోకే.

తే॥ గీ॥ దాని కొమ్మలు గుణవృద్ధిఁ దనరి ♦ విషయ
ములను చిగురుల; క్రిందు మీఁ♦దులను నలమె
మనుజలోకంబునందుఁ గ♦ర్మ పరిస_క్త
పరములై మూలములు క్రింద ♦ వ్యా_ప్తమయ్యె. ౨

శ్లో॥ న రూప మస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాది ర్నచ సంప్రతిష్ఠా
అశ్వత్థ మేనం సువిరూఢమూల
మసఙ్గశ_స్త్రేణ దృఢేన ఛిత్వా.

తే॥ గీ॥ దీని కిహమున రూపంబు ♦ తెలియఁ బడదు
మొదలు స్థితియుఁ గనఁగరాదు ♦ తుదయు లేదు
పాదుకొను మూలమైన య♦శ్వత్థ తరువు
దృఢతరాసంగ మను క_త్తిఁ ♦ దెగఁగ నఱికి. 3

తే॥ గీ॥ సాత్వికములగు కృత్యముల్ ♦ సల్పు కతన
స్వర్గ భోగంబు లంద నూ ♦ ర్ధ్వమునఁ గొన్ని
మనుజలోకానఁజేయు క♦ర్మముల వలనఁ
గ్రిందికిని గొన్నె కొమ్మలు ♦ క్రాలినాయి.

శ్లో॥ తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః
త మేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ.

తే॥ గీ॥ దేనిఁబొందినఁ బుట్టంగఁ • దిరిగిరారొ
తత్పదం బేనిచేఁ బురా•తనపుశక్తి
కలిగెనో దానికిని మూల•కారణ మగు
పురుషుఁబొందెద నని పూన్కి • నెఱపఁదగును. ४

శ్లో॥ నిర్మానమోహా జితసఙ్గదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖసంజ్ఞై
ర్గచ్ఛ న్త్యమూఢాః పద మవ్యయం తత్.

తే॥ గీ॥ సంగరహితు లాత్మజ్ఞాన • సంయుతులును
మాన మోహమ్ము లడఁగిన • ధీనిధులును
ద్వంద్వ రహితులు వాంఛల • వదలువారు
నగు నమూఢు లవ్యయపద • మందఁగలరు. ౫

శ్లో॥ న తద్భాసయతే సూర్యో న శశాఙ్కో న పావకః
యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ.

తే॥ గీ॥ అగ్నిహోత్రుండు చంద్రుండు • నర్యముండు
నేరి దేనిఁ బ్రకాశింపఁ • జేయలేరొ?
దేనిఁజెందిన జన్మకుఁ • దిరిగి రారొ?
యట్టి యవ్యయపదము నా•దైనచోటు. ౬

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
మన షష్ఠానీన్ద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి.

తే॥ గీ॥ జీవ లోకంబునందలి ♦ జీవుడైన
యా సనాతనుఁడే నాదు ♦ నంశమగును
బ్రకృతి యందుండి మనముతోఁ ♦ బరగు నాఱు
నైన యింద్రియముల లాగు ♦ బూని యతడు. ౭

శ్లో॥ శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామ తీశ్వరః,
గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గన్ధాని వాశయాత్.

తే॥ గీ॥ ఈశ్వరుం డీ శరీరంబు ♦ నెపుడు గూడు
నెపుడు వీడు, నపుడు గాలి ♦ యెల్లపూల
తావులం గొనుచును సాగి ♦ పోవులాగు
నింద్రియంబులఁ గొని ♦ మఱి యేగుచుండు. ౮

శ్లో॥ శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ,
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపసేవతే.

తే॥ గీ॥ సకల సుఖదుఃఖములఁ జెందఁ ♦ జాలు దేహి
తోలు కన్నును జెవియును ♦ నాలుకయును
ముక్కు మనసును గల దేహ♦మున వసించి
విషయ సౌఖ్యమ్ముల ననుభ♦వించుచుండు. ౯

శ్లో॥ ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞానచక్షుషః.

తే॥ గీ॥ ఒడలు వెడలెడు వానిని ♦ నున్నవాని
ననుభవించెడు వాని గుణా♦న్వితుడగు
దేహి నజ్ఞాను లగు వారు ♦ దెలియలేరు
జ్ఞాను లగు వారు తెలియంగఁ ♦ జాలువారు. ౧౦

శ్లో॥ యతన్తో యోగిన శ్చైనం పశ్య న్త్యాత్మ న్యవస్థితమ్,
యతన్తో ప్యకృతాత్మానో నైనం పశ్య న్త్యచేతసః.
తే॥ గీ॥ పూనువారును యోగంబుఁ ♦ బూనువారు
నాత్మ తమ యందు నున్నట్టు ♦ లరయుచుండ్రు
పూనువారైన యకృతాత్ము♦లైనవారు
కానఁగాఁ జాల రవివేకు♦లైన కతన. ౧౧

శ్లో॥ య దాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలమ్
య చ్చన్ద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్
తే॥ గీ॥ జగము వెలిగింపఁ జేయఁగాఁ ♦ జాలినట్టి
భాను తేజంబు చంద్రి సం♦బంధ కాంతి
వహ్ని సంబంధ మైనట్టి ♦ ప్రభయు, నాదు
ప్రభనుగా మానసంబునఁ ♦ బరఁగఁదెలియు. ౧౨

శ్లో॥ గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః
తే॥ గీ॥ ఏను భూమిఁబ్రవేశించి ♦ యిందుఁ గలుగు
భూతజాలంబు, నా బలం♦బున ధరించు
చున్నవాఁడ, రసాత్మతఁ ♦ నెన్నఁ జంద్రి
రూపమున వృక్షజాతులఁ ♦ బోషించుచుందు. ౧౩

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః పచా మ్యన్నం చతుర్విధమ్.
తే॥ గీ॥ అఖిలజీవ శరీరంబు ♦ లాశ్రయించి
యేను, జఠరాగ్నిరూపుండ♦నై నిరతము
ప్రాణము నపానమును గూడి ♦ పరగ నలు వి
ధంబు లగు నన్నముల బచ♦నంబు జేతు. ౧౪

శ్లో॥ సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్త స్స్మృతిర్ జ్ఞాన మపోహనం చ
వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదా న్తకృ ద్వేదవి దేవ చాహమ్.

తే॥ గీ॥ అన్నిప్రాణుల హృదయంబు • లందు నుండు
దలఁచు టెఱుక యపోహ నా • వలనఁ గలుగు
అన్ని శ్రుతులను దెలియంగ • నైన దేన
వివిధ వేదాంతకృ ద్వేద • విదుడ నేన. ౧౫

శ్లో॥ ద్వా విమా పురుషా లోకే క్షర శ్చాక్షర ఏవ చ,
క్షర స్సర్వాణి భూతాని కూట స్థోఽక్షర ఉచ్యతే.

తే॥ గీ॥ పురుషుఁ డీ లోకమున యందు • క్షరుఁడని మఱి
యక్షరుం డని ద్వివిధమై • యలరుచుండు
క్షరుఁడగు సమస్తమగు భూత • జంతు సమితి
పరఁగుఁ గూటస్థ జీవుఁ డ • క్షరుఁడటంచు. ౧౬

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః

తే॥ గీ॥ అవ్యయుం డగు నీశ్వరుం • డఖిలలోక
ములను వ్యాపించి భరియింపఁ • గలిగి యుండు
నట్టి ద్వయమునకంటె వే • రైన పరమ ౧౭
పురుషుఁడే పరమాత్మ నాఁ • బరగుచుండు.

శ్లో॥ యస్మాత్ క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః
అతో౽స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః

తే॥ గీ॥ క్షరమున కతీతుఁడై నేను • బరగియుంట
నక్షరమునకు నుత్తముఁడై యలరుట
వివిధలోకంబు లందును • వేదములను
బరమ పురుషోత్తముఁడనని • పలుకఁ బడితి. ౧౮

శ్లో॥ యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత!

తే॥ గీ॥ భారతా! యెవ్వఁ డజ్ఞాన•వర్జితుఁడయి
పురుషసత్తముఁడ నటంచు • బుద్ధిఁ దెలియు
సకలవిదుఁ డగు నవ్వాఁడు • సకలభావ
ములను నన్ను భజించుచుఁ • బొదలుచుండు. ౧౯

శ్లో॥ ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయా౽నఘ
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత.

తే॥ గీ॥ పాపరహితుఁడ వైనట్టి • భరతవర్య!
పరమము రహస్యశాస్త్రమ్ము • పల్కఁబడియెఁ
దీనిఁ దెలిసిన యాతండు • జ్ఞానవంతుఁ
డగును నటుమీఁదఁ గృతకృత్యుఁ•డగును సుమ్ము. ౨౦

ఇది పంచదశాధ్యాయము



ఓమ్

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమద్భగవద్గీత



## షోడశాధ్యాయము

## దైవాసుర సమ్పద్విభాగ యోగము

శ్రీభగవా నువాచ.

శ్లో॥ అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః,
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్

తే॥ గీ॥ అభయమున నుండ నిర్మలం బైన మతిని
కాత్రియుండుట జ్ఞానయో గాఢ్యుఁ డగుట
శమము దమమును దాన మా ర్జవము గనుట
వివిధ యజ్ఞాధ్యయన తపో విధుల నుంట. ౧

శ్లో॥ అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునమ్
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్.

తే॥ గీ॥ సత్య మక్రోధమును నహింసయును శాంతి
త్యాగ మన్యుల లోపముల్ దలఁపకుంట
భూతదయయును లోలతఁ బూనకుంట
లజ్జ మార్దవమును చాపలమ్ము లేమి. ౨

శ్లో॥ తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా,
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత.

తే॥ గీ॥ ద్రోహ మభిమాన మెందును • ద్రోపకుంట
యోర్పు ధృతిశౌచములు తేజ • మొప్పియుంట
దేవతాసంపదం గల్గి • తేజరిల్లు
వారి గుణములుగా నెంచు • భరతవర్య! 3

శ్లో॥ దంభో దర్పో ఽభిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపద మాసురీమ్.

తే॥ గీ॥ పార్థ! డంబంబు గర్వంబు • స్వాతిశయము
క్రోధ మజ్ఞాన కాఠిన్య • గుణము లన్ని
యాసురీ సంపదం గల్గి • నట్టివారి
లక్షణము లని యెంచ నలయును సుమ్ము. ౪

శ్లో॥ దైవీ సంపద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా
మాశుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ.

తే॥ గీ॥ దైవసంపద మోక్షంబు • తగులఁజేయు
నసురసంపద బంధంబు • నతుకఁజేయు
పరగ నీ విందు దైవ సంపదను గల్గు
వాఁడ వగుటను దుఃఖింప • వలదు పార్థ! ౫

శ్లో॥ ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ,
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు.

తే॥ గీ॥ పార్థ! లోకంబునన్ భూత • వర్గసృష్టి
యందు దైవత మనియును • నాసురంబు
ననియు రెండుండు; దైవతం • బంతపల్క-
బడియె; నాసురసృష్టి నేర్పడఁగ వినుము. ౬

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే.

తే॥ గీ॥ *ఆసురీ సంపదం గల్గు•నట్టి వారు
నెఱిఁబ్రవృత్తి నివృత్తుల • నెఱుఁగఁబోరు
వారి కాచారమును శుచి•త్వంబు లేదు
సత్యవర్తన మనున దెం•చ్చుటను లేదు. ౭

శ్లో॥ అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరమ్
అపరస్పర సంభూతం కి మన్య త్కామహైతుకమ్.

తే॥ గీ॥ అట్టివారీ జగత్తస•త్యము ప్రతిష్ఠ
లేని దీశ్వరకృతమును • గాని దనియు
స్త్రీ పురుష యోగమునఁ గల్గి • తీరె ననియుఁ
గామహేతుక మగు నొండు•గాన మండ్రు. ౮

శ్లో॥ ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః.

తే॥ గీ॥ ఈ యభిప్రాయమును నాశ్ర•యించియున్న
వారు నష్టాత్మకులు నతి•క్రూరకర్మ
లల్పబుద్ధులు జగమున • కహితు లగుచు
భువననాశంబు కొఱకునై •పుట్టుచుండ్రు. ౯

తే॥ గీ॥ *ధర్మపుర్థంబు కామంబుఁ • దలఁచిచేయు
కర్మమార్గంబును "ప్రవృత్తి"•గా నెఱుంగు
[illegible]
కర్మమార్గంబును "నివృత్తి"•గా నెఱుంగు.

శ్లో॥ కామ మాశ్రిత్య దుష్పూరం దంభమానమదాన్వితాః
మోహా ద్గృహీత్వాఽ సద్గ్రాహా౯ ప్రవ_ర్తం తేఽశుచివ్రతాః
తే॥ గీ॥ వారు తనివినిఁ జెందని • కోరికలను
దంభ మభిమాన మదములఁ • దవిలియుండి
యనుచితములను నవివేకు•లగుచుఁ గొంచు
వెలయ నపవిత్ర కృత్యముల్ • సలుపుచుందు్రి. ౧౦
శ్లో॥ చింతా మపరిమేయాం చ ప్రళయాంతా ముపాశ్రితాః
కామోపభోగపరమా ఏతావ దితి నిశ్చితాః.
తే॥ గీ॥ వార లందరుఁ జచ్చెడు•వఱకు విడని
యెడఁదెగని చింతనే యాశ్ర•యించియుండి
కామ భోగంబులే సార్థ•కంబు లనియు
నేది వీనికి వేఱుగా • లేదటనియు. ౧౧
శ్లో॥ ఆశాపాశశ_తై ర్బద్ధాః కామక్రోధ పరాయణాః
ఈహంతే కామభోగార్థ మన్యాయే ఽనార్థసంచయా౯.
తే॥ గీ॥ లెక్కలేనట్టి యాశలఁ•జిక్కి కామ
క్రోపములచేతఁ గాలంబు • మాపనెంచి
యవలఁ గామ భోగార్థ మ•న్యాయముగను
ధనము సంపాదనముసేయఁ • దలఁచుచుందు్రి. ౧౨
శ్లో॥ ఇద మద్య మయాలబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథమ్,
ఇదమ_స్తీ ద మపి మే భవిష్యతి పునర్ధనమ్.
తే॥ గీ॥ నేఁడు దీనిని నేను జెం•దితిని, కోర్కి
దప్పకుండంగ నేను జెం•దంగఁగలను
ఈ విశేషంబు కలదు నా•కింక మీఁద
నెంతయేని ధనము లభి•యింపఁగలదు. ౧౩

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరా నపి
ఈశ్వరోఽహ మహం భోగీ సిద్ధోఽహం బలవా న్సుఖీ.
తే॥ గీ॥ ఈ విరోధి నడంచితి ♦ నింకమీద
మిగులు శత్రువు లందఱ ♦ పొగ రడంతు
నేన యీశుండ భోగిని ♦ నేన సుఖిని
నేన సిద్ధుండ వెండియు ♦ నేన బలిని. ౧౪

శ్లో॥ ఆఢ్యోఽభిజనవా నస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః.
తే॥ గీ॥ జగమునను నేన ధనము గ♦లిగినవాఁడఁ
బ్రికటకులమునఁ గలిగిన ♦ వాఁడ నాకుఁ
దుల్యమైనట్టి మనుజుఁ డెం♦దునను లేఁడు
యాగదానంబులను జేయ ♦ నగుదు ముదము
పొందుదును నను నజ్ఞాన ♦ మోహితులును. ౧౫

శ్లో॥ అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ.
తే॥ గీ॥ చిత్తము ననేక రీతులఁ ♦ జెదరఁగొట్టు
కొని తుదకు మోహ మను వల ♦ నెనసి యుండి
కామభోగంబులం బ్రస♦క్తతను గలిగి
అశుచియౌ నరకంబున ♦ నడఁగుచుంద్రు. ౧౬

శ్లో॥ ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజంతే నామ యజ్ఞై స్తే దంభే నావిధిపూర్వకమ్.
తే॥ గీ॥ తాము తమ నెద గొప్పగాఁ ♦ దలఁచువారు
హీననీతులు ధనమద♦మానయుతులు

అవిధి పూర్వకముగ దంభ ♦ మనుసరించి ౧౭
సలుపుచుందురు నామయ♦జ్ఞముల వారు.

శ్లో॥ అహంకారం బలం దర్పం కామం క్రోధఞ్చ సంశ్రితాః
మా మాత్మపర దేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః

తే॥ గీ॥ బల మహంకృతి కామద•ర్పములఁ గినుక
హత్తువారలు స్వపర దే•హములయందు
నుండు నన్ను నసూయతో • నిందుఁ గొంచు
నున్నవారయి ద్వేషించు•చున్నవారు. ౧౮

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్
క్షిపా మ్యజస్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు.

తే॥ గీ॥ వైరభావమ్ము కలవారు • క్రూరమార్గు
లశుభకారకులౌ నా న•రాధములను
నరక సంసార రూప మా•సురము నైన
యోనులందు నజస్రము • పూని త్రోతు. ౧౯

శ్లో॥ ఆసురీం యోని మాపన్నా
మూఢా జన్మని జన్మని
మా మప్రాప్యైవ కౌంతేయ!
తతో యా న్త్యధమాం గతిమ్.

తే॥ గీ॥ కుంతికొమరుఁడ! యసురుల • కులమునందు
జన్మమొందిన మూఢులు • జన్మజన్మ
మందు నన్నుఁ బొందు మార్గంబు • నంద లేక
మొదటికంటె నధమగతిఁ • బొందుచుందురు. ౨౦

శ్లో॥ త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేతత్త్రయం త్యజేత్.
తే॥ గీ॥ క్రోధమును గామమును లోభ • గుణము మూఁడు
నరకమును బొందు దారులై • పరఁగు సుమ్ము
వీనిచే నాత్మనాశంబు • వెస జనించుఁ
గానఁ బ్రతిమానవుఁడు వీని • మానవలయు. ౨౧

శ్లో॥ ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాంగతిమ్
తే॥ గీ॥ ఎవ్వఁడు తమోమయంబైన • యీ నరక జ
గంబునకు ద్వారము లగు త్రి • కంబు వదలు
నట్టివాఁ డాత్మకును హితుం • డైనవాఁడు
వాఁడు మోక్షంబునందు నె • వ్వాండు గాని. ౨౨

శ్లో॥ య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.
తే॥ గీ॥ వెఱువ కెవ్వాఁడు నీ శాస్త్ర • విధిని విడిచి
మదికి నష్టంబయినలాగు • మఱి నడచునో ?
యతఁడు సిద్ధిని సుఖమును • నందఁబోఁడు
మోక్షముంగూడ నవ్వాఁడు • పొందఁబోఁడు. ౨౩

శ్లో॥ తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి.
తే॥ గీ॥ చేయఁదగుదాన నేనియుఁ • జేయఁదగని
దాననేని శాస్త్రంబె ప్ర • మాణమగును
శాస్త్రమున విధియించిన • సరణిఁ దెలిసి
నీవు కర్మలుసేయ య • త్నింప దగుదు. ౨౪



ఇది షోడశాధ్యాయము.

ఓమ్.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీమానుమద్భగవద్గీత

## సప్తదశాధ్యాయము

### శ్రద్ధాత్రయ విభాగయోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ యే శాస్త్రవిధి ముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః
తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః

తే॥ గీ॥ ఎట్టి శాస్త్రమువీడి శ్రద్ధాన్వితులయి
హర్షమున దేవతలఁ గొల్చు • నట్టివారి
కర్మనిష్ఠలు సత్త్వమొ్మ•కాక, నాకు
వినుచుము రజస్తమమ్ములో • వేగ కృష్ణ! ౧

శ్రీ భగవా నువాచ—

శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు.

తే॥ గీ॥ శ్రద్ధ దేహిస్వభావాను•సారముగను
సంభవించుచు నుండును • సాత్త్వికముగ
వెండియును రాజసమ్ముగాఁ • వెలయుచుండుఁ
దామసమ్ముగఁ ద్రివిధమై •. దాని వినుము. ౨

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః.

తే॥ గీ॥ శ్రద్ధ వ్యక్తుల యుచిత సం♦స్కార లభ్య
మైన యంతఃకరణమున ♦కనుగుణ మగు
నీ పురుషుఁ డెన్న శ్రద్ధాస్వ♦రూపు డగును
నెట్టి దగు శ్రద్ధఁ గలవాఁడు ♦ నట్టిఁడగును. 3

శ్లో॥ యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసా జనాః.

తే॥ గీ॥ సాత్త్వికులు దేవతాసేవ♦సల్పుచుంద్రు
రాజసులు యక్ష రాక్షస ♦ రాజిఁ గొల్త్రు
అన్యులైనట్టి తామసు♦లైన జనులు
భూతముల ప్రేతముల నతి♦ప్రీతిఁ గొల్త్రు. ౪

శ్లో॥ అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామరాగబలాన్వితాః.

తే॥ గీ॥ కామ రాగ బలంబును ♦ గల్గి యుండి
దంభమునను, నహంకృతిఁ ♦ దవిలియుండి
శాస్త్రరోధంబు స్వేతర ♦ సంకటంబు
నగు తపస్సును నెవ్వార ♦ లాచరింత్రో. ౫

శ్లో॥ కర్శయంత శ్శరీరస్థం భూతగ్రామ మచేతసః
మాం చైవాంతశ్శరీరస్థం తాన్ విద్ధ్యాసురనిశ్చయాన్.

తే॥ గీ॥ తెగి యచేతస్కులైయుండి ♦ దేహమందుఁ
గలిగియుండిన భూతప్ర♦కాండము నట
హృదయవర్తిని నన్నుఁ గృ♦శింపఁజేయు
వార లసురు లటంచు నే♦ర్పడఁగఁ దెలియు. ౬

శ్లో॥ ఆహార _స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ _స్తప _స్తథా దానం తేషాం భేద మిమం శ్రుణు.

తే॥ గీ॥ సకలమునకు నాహారముల్ ♦ సాత్త్వికమని
రాజసము తామసం బని ♦ కాఁగలు మూడు
దాన యజ్ఞ తపంబులు ♦ తద్విధంబ
కాన నవ్వాని భేదంబు ♦ లూని వినుము. ౭

శ్లో॥ ఆయు స్సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్వికప్రియాః

తే॥ గీ॥ ఆయురారోగ్య సత్త్వబ♦లాతిసౌఖ్య
ములను బ్రీతిని నభివృద్ధిఁ ♦ బూన్చునదియు
స్థిరము హృద్యము రస్యమ్ము ♦ స్నిగ్ధమగు స
కల విధాహారమును సాత్త్వి♦కులకుఁ బ్రియము. ౮

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః.

తే॥ గీ॥ కార ముప్పును బులుసును ♦ గడిఁది వేడి
చుఱుకుఁ గల్గి చమురులేక ♦ తఱచు దప్పి
గలిగి దుఃఖము శోకరో♦గములఁ గూర్చు
నఖిలవ స్తువుల్ రాజసు ♦ లారగింతురు ౯

శ్లో॥ యాతయామం గతరసం పూతిపర్యుషితం చ యత్
ఉచ్ఛిష్ట మపి చామేధ్యం భోజనం తామసప్రియమ్.

తే॥ గీ॥ వండి జామయి రసమంత ♦ యెండిపోయి
పాసి వాసన గొట్టుచుఁ ♦ బక్వమైన
పిదప రేయిఁగడచి తిన్న ♦ వెనుక మిగిలి
యజ్ఞశేషంబు గాని యా♦హారసమితి
తామసుల కిష్ట మనుచుఁ బె♦ద్దలు వచింతుర. ౧౦

శ్లో॥ అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే,
యష్టవ్య మేవేతి మన స్సమాధాయ స సాత్త్వికః.

తే॥ గీ॥ ఇద్ది శాస్త్రప్రసిద్ధమం ♦ చెంచి దానిఁ
జేయవలయు ననెడు స్థిర ♦ చిత్తమునను
ఫల మపేక్షింపకే చేయఁ♦బడిన యజ్ఞ
మవని సాత్త్వికమని యెన్న♦నగును జుమ్ము. ౧౧

శ్లో॥ అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్,
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్.

తే॥ గీ॥ భరతకులవర్య! జగమున ♦ ఫలమునకయి
డంబమునకయి యెద్ది క♦డంగఁబడునొ
యట్టి యజ్ఞంబు రాజసం♦బంచు నీవు
నెమ్మనంబున యందు నెం♦తే. నెఱుంగు. ౧౨

శ్లో॥ విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్,
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే.

తే॥ గీ॥ శాస్త్రమార్గం బనుసరింపఁ ♦ జాలనిదియు
నన్నదానము లేనిది ♦ యంతెకాక
శ్రద్ధయును, దక్షిణయును మం♦త్రములు లేని ౧౩
యజ్ఞమే తామసం బని ♦ యార్యులందుర.

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞపూజనం శౌచ మార్జవమ్
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే.

తే॥ గీ॥ నిర్జరుల విప్రుల గురు పం•డితులఁ బూజ
సలుపుచు శుచిత్వ సద్వ ర్త•నలఁ జెలంగి
పడతులెడఁ గోర్కి మరలించి • ప్రాణిహింస
చేయమి శరీరతప మని • చెప్పఁబడియె. ౧౪

శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే.

తే॥ గీ॥ ఇతరుల మనస్సునకు బాధ • నీయనదియుఁ
బ్రియము హితము యథార్థమై • శ్రేయ మిడెడు
నట్టి సంభాషణంబు వే•దాధ్యయనము
వాక్కు సంబంధి తప మని • పల్కఁబడును. ౧౫

శ్లో॥ మనః ప్రసాద స్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావ సంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే.

తే॥ గీ॥ నిర్మలంబైన మన మాత్మ•నిగ్రహంబు
మౌనము ముఖప్రసన్నతా•మానితంబు
నిష్కపటభావ సంపద్వి•నీతియుతము
స్వాంతసంబంధి తప మని • పల్కఁబడును. ౧౬

శ్లో॥ శ్రద్ధయా పరయా త ప్తం తప స్తత్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్వికం పరిచక్షతే.

తే॥ గీ॥ క్షమను నుత్కృష్ట మైనట్టి • శ్రద్ధతోడ
జరుపనైన తపము మూఁడు • తెలుఁగులకును
ఫలములం గోర కింద్రియం•బుల జయించి
సలుపగానైన తప మది • సాత్త్వికంబు. ౧౭

శ్లో॥ సత్కార మానపూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్.
తే॥ గీ॥ పరుల సత్కారమును బొంద • వలయు నంచుఁ
బరుల సంభావనము పూజ • నలయు నంచు
దంభము ప్రధానముగఁజేయు • తపము చంచ
లమ్ము నస్థిరమౌ రాజ • సమ్ము నగును. ౧౮

శ్లో॥ మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః,
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్.
తే॥ గీ॥ మూఢభావమ్ముతోడను • ముందు తనకు
పీడ రానున్నదని చేయఁ • గూడినదియు
నొకరి హింసకు మూలమై • యుండు నదియుఁ
దామసంబైన తప మని • తలఁపఁబడును. ౧౯

శ్లో॥ దాతవ్య మితి యద్దానం దీయతే ఽనుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్.
తే॥ గీ॥ తగినదేశంబు కాలపా • త్రములు దొరకు
నపుడు ప్రత్యుపకారంబు • నందకుండ
శాస్త్రవిధిచేత నీయంగఁ • జాలిన దగు
దానమును సాత్త్వికంబైన • దాన మండ్రు. ౨౦

శ్లో॥ యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః,
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్.
తే॥ గీ॥ తాను బ్రత్యుపకారంబుఁ • దలఁచి గాని
మించు ఫల మేదియో చెంద • నెంచి గాని
పూని యేదాన మతి కష్ట • ముగను నొసఁగఁ
బడునో యది రాజసం బని • పల్కఁబడును. ౨౧

శ్లో॥ అదేశకాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే,
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్.

తే॥ గీ॥ ఎలమి దేశమ్ము కాలమ్ము ♦ నెంచఁబోక
పరుసఁ బాత్రులు గానట్టి ♦ వారి కొఱకు
తగిన సత్కృతిలేక నిం♦దను గలట్టి
దానమును తామసం బని ♦ తలఁపవలయు. ౨౨

శ్లో॥ ఓం త త్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదా శ్చ యజ్ఞా శ్చ విహితాః పురా.

తే॥ గీ॥ ఓ మనియుఁ దత్తు సత్తని♦యుం దలంపఁ
బడియె మూడువిధంబుల ♦ బ్రహ్మయొక్క
నామ మద్దానివలన ని♦ర్ణయము నయ్యె
బ్రాహ్మణులు వేదములు యజ్ఞ♦పంక్తిగూడ. ౨౩

శ్లో॥ తస్మా దో మి త్యుదాహృత్య యజ్ఞదాన తపఃక్రియాః
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్.

తే॥ గీ॥ కావునను బ్రహ్మ వాదులై ♦ కారులువార
లిలను శాస్త్రోక్తయజ్ఞమ్ము ♦ నేని దాన
మేని తపమేని చేయంగఁ ♦ బూనినపుడు
ఓ మనెడు బ్రహ్మనామంబు ♦ నుచ్చరింతురు. ౨౪

శ్లో॥ త దిత్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః క్రియాః
దానక్రియా శ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః.

తే॥ గీ॥ ధీరు లగు మోక్షకాంక్షులౌ ♦ వారిచేత
వివిధ యజ్ఞతపోదాన ♦ విహితకర్మ
పార మిసుమంత ఫలమును ♦ గోరకుండ
తత్తనుచుఁ బల్కి చేయంగఁ ♦ దనరుచుండు. ౨౫

శ్లో॥ సద్భావే సాధుభావే చ సదిత్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే.

తే॥ గీ॥ పార్థ! సత్తని పల్కఁడు ◆ బ్రహ్మనామ
మలర నుత్తమ కర్మంబు ◆ లందుఁగాని
పరగ, సద్భావమున, సాధు◆భావముననుగాని; యెల్లప్పుడును వాఁడ ◆ గాను బడును. ౨౬

శ్లో॥ యజ్ఞే తపసి దానే చ స్థితి స్స దితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యే వాభిధీయతే.

తే॥ గీ॥ యజ్ఞదానతపంబుల ◆ యందుఁ గలుగు
నిష్ఠ సత్తనఁబడు వాని ◆ నేర్పుమీర
సలుపు కర్మమ్ము గూడను ◆ సత్తనఁబడు
నంచు నీ మది లోపల ◆ నరయవలయు. ౨౭

శ్లో॥ అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్
అస దిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ.

తే॥ గీ॥ పార్థ! యశ్రద్ధచేఁ జేయఁ◆బడిన యట్టి
యజ్ఞదాన తపః కర్మ◆లన్ని గూడ
నెంచగ నసత్తనుచు వచి◆యించఁబడును
దాన నిహపర ఫలములఁ ◆ గానబోము. ౨౮

ఇది సప్తదశాధ్యాయము.



ఓమ్
శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ హనుమద్భగవద్గీత

## అష్టాదశాధ్యాయము

### మోక్షసన్న్యాసయోగము

అర్జున ఉవాచ—

శ్లో॥ సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన.

తే॥ గీ॥ అచ్యుత! హృషీకనాయక! • యసురకేశి
హంతకా! దీర్ఘబాహూ! మ•హానుభావ!
కరుణ సన్న్యాస మవలత్యా•గమ్ము తత్త్వ
విధము దెలియంగఁ గోరెద • వేఱువేఱ. ౧

శ్రీభగవానువాచ—

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః.

తే॥ గీ॥ కామ్యకర్మల నన్నింటిఁ • గడకు విడుట
యవనిఁ బండితులెల్ల స•న్న్యాసమండ్రు
సర్వకర్మఫలంబుల • జారవిడుట
యా మహావేదవేద్యులే • త్యాగమండ్రు. ౨

శ్లో॥ త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్య మితి చాపరే.
తే॥ గీ॥ పండితులు కర్మతతిదోష•వంత మగుట
వదలఁదగు ననుచుందురు • వారు గాక
తక్కువారలు యజ్ఞమ్ము • దానము తప
మనెడు కర్మలు విడువరా•దని వచింతురు. 3

శ్లో॥ నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ,
త్యాగో వా పురుషవ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః
తే॥ గీ॥ భరత సత్తమ! హరి శౌర్య • పురుషవర్య!
త్యాగమందలి నా నిశ్చ•యమ్ము వినుము
త్యాగ మది మూఁడు విధములఁ • దనరుచుండు
నంచు నీ మదిలోన ద•లంచుమయ్య. ౪

శ్లో॥ యజ్ఞో దానం తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్,
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్.
తే॥ గీ॥ యజ్ఞదానతపః కర్మ•లనున వెపుడు
త్రోయఁదగినవి కా వవి • సేయఁదగును
పండితులు యజ్ఞదానత•పముల వలన
చిత్తశుద్ధిని నిరతమ్ముఁ • జెందగలరు. ౫

శ్లో॥ ఏతా న్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ,
కర్తవ్యా నీతి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్.
తే॥ గీ॥ పార్థ! యీ యజ్ఞదాన త•పంబు లనెడు
కర్మలు మమత్వమును ఫల•కాంక్ష వదలి
చేయుటే విధి యని యెంచి • చేయుటెల్ల
యుక్తమని నాదు నిశ్చయం • బుత్తమంబు. ౬

శ్లో॥ నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహా త్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః.

తే॥ గీ॥ నియతకర్మల వదలుట ♦ నీతిగాదు
మోహమునఁ ద్యక్తకర్ముఁడై ♦ పోదలునట్టిఁ
డయ్యెనేనియు; నవ్వాని ♦ త్యాగమెన్నఁ
దామసత్యాగ మని యది ♦ తలఁపఁబడును. ౭

శ్లో॥ దుఃఖ మిత్యేవ య త్కర్మ కాయక్లేశభయా త్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్.

తే॥ గీ॥ విధిగఁ జేయంగఁ దగు కర్మ ♦ వీడి దేహ
కష్టభయమున దుఃఖంబు ♦ గలుగు ననుచు
నెవడు రాజసత్యాగంబు ♦ నెపుడుచేయు
నతడు త్యాగఫలమ్ముఁ దా ♦ నందఁబోడు. ౮

శ్లో॥ కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః.

తే॥ గీ॥ అర్జునా! శాస్త్రనిష్పన్న ♦ మైన కర్మ
సలుపఁదగునంచు సంగంబు ♦ ఫలము వీడి
యాచరింపఁగ బడునట్టి ♦ దైన త్యాగ
మెంచగాఁబడు సాత్త్వికం ♦ బంచు నెపుడు. ౯

శ్లో॥ న ద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే
త్యాగీ స త్త్వ సమావిష్టో మేధావీ ఛిన్నసంశయః.

తే॥ గీ॥ ఆత్మవిషయిక జ్ఞానంబు ♦ నందువాఁడు
ఛిన్నసంశయుఁడును త్యాగ ♦ శీలుఁడైన
ప్రాజ్ఞుఁడగువాడు దుఃఖ క♦ర్మలను ద్వేష
ము సుఖకర్మలఁ బ్రీతినిఁ ♦ బూనఁబోడు. ౧౦

శ్లో॥ న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మా ణ్యశేషతః
యస్తు కర్మ ఫలత్యాగీ స త్యా గీ త్యభిధీయతే.

తే॥ గీ॥ కాయధారి మిగులకుండఁ ◆ గర్మములను
త్యక్తమును జేయు టెపుడు శ◆క్యంబుగాదు
కర్మము లొనర్చుచును ఫల◆కాంక్ష వీఁడు
వాఁడు త్యాగి యటంచును ◆ బల్కఁబడును. ౧౧

శ్లో॥ అనిష్ట మిష్టం మిశ్రంచ త్రివిధం కర్మణః ఫలమ్
భవ త్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్.

తే॥ గీ॥ ఇష్ట మనియును మిశ్ర మ◆నిష్ట మనియు
కర్మ యొక్క ఫలము మూఁడు ◆ గతుల నుండు
త్యాగరహితు డడంగి త◆త్ఫలము నొందు
కనఁడు సన్న్యాసి వాని నొ◆కప్పు డేని. ౧౨

శ్లో॥ పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్

తే॥ గీ॥ నిశ్చయింపఁబడిన సాంఖ్య◆నియతియందు
సర్వకర్మలయొక్క ని◆ష్పత్తికొఱకు
పలుకఁబడియెను గారణ◆పంచకంబు
గాన వినుపింతు నవ్వాని ◆ గ్రమత వినుము. ౧౩

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్.

తే॥ గీ॥ కాయమును గర్త వివిధమౌ ◆ కరణములును
నవల ప్రాణాదికమ్ముల◆కైన క్రియలు
[illegible]

పంచమం బగు దైవంబు ◆ పరఁగుచుండు. ౧౪

శ్లో॥ శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః.

తే॥ గీ॥ న్యాయ్య మైనది యేని న•న్యాయ్యమైన
దేని యే కర్మమును జేయ నే • మనుజుఁడు
మొదలిడునో యట్టి త్రికరణ • మూలమైన
త్రివిధ కర్మల కైదు హే•తువులు నగును. ౧౫

శ్లో॥ తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః

తే॥ గీ॥ అవ్విషయమున నిశ్చయం • బివ్విధమున
నుండఁ బ్రత్యేకకర్తగా • నుంటి నంచు
నెవ్వఁ డెంచు నకృతబుద్ధి • హీనుఁడైన
వాఁడు నిజము నెఱుంగని • వాఁడ సుమ్ము. ౧౬

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే,
హత్వాఽపి స ఇమాౝల్లోకాౝ న హంతి న నిబధ్యతే.

తే॥ గీ॥ ఎవఁ డహంకృతభావమ్ము • లెల్లవిడుచు
తగ నెవని బుద్ధి కలుషీకృ•తమ్ము గాదొ
వాఁడు ప్రాణులఁ జంపిన•వాఁడు నయ్యు
హంతకుఁడు బంధితుఁడుగాఁ డొ•కింత యేని. ౧౭

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా,
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః.

తే॥ గీ॥ జ్ఞానమును జ్ఞేయమును పరి•జ్ఞాత యంచుఁ
గర్మచోదన త్రివిధంబు•గా నెసంగు
గరణమును గర్మ మనియును • గర్త యంచుఁ
గర్మసంగ్రహమును మూఁడు•గాఁ దలంచు. ౧౮

శ్లో॥ జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావ చ్ఛృణు తాన్యపి.

తే॥ గీ॥ కపిలసాంఖ్యంబునను జ్ఞాన ♦ కర్మకర్తృ
విషయములు త్రిగుణంబుల ♦ భేదములను
బట్టి త్రివిధంబుగాఁ జెప్పఁ♦బడియె గాన
వానిని యథాస్థితినిఁ బల్కువాఁడ వినుము. ౧౯

శ్లో॥ సర్వభూతేషు యే నైకం భావ మవ్యయ మీక్ష్యతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్.

తే॥ గీ॥ వేఱుగాఁ దోఁచబడు భూత♦వితతియందు
నవ్యయము నేక మవిభక్త♦మైన యాత్మ
దేనిచేఁ జూడఁబడు నట్టి ♦ జ్ఞానమెన్న
సాత్త్వికంబని మదిలోన సంస్మరించు. ౨౦

శ్లో॥ పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్.

తే॥ గీ॥ వివిధ భూతంబులందున ♦ వేఱువేఱు
గుఱుతులం గల్గి వేఱుగా ♦ మెఱయు నట్టి
యాత్మలను వేఱుదృష్టితో♦నరయు దేన
నట్టి జ్ఞానమ్ము రాజసం ♦ బనఁగ నొప్పు ౨౧

శ్లో॥ యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకమ్
అతత్త్వార్థవ దల్పంచ తత్తామస ముదాహృతమ్.

తే॥ గీ॥ పరఁగ నొకపని పురుషార్థ♦భావముంచి
కారణములేక సక్తతఁ ♦ గాంచియుండు
అల్పమయ్యు నతత్త్వార్థ ♦ మైన దానిఁ
గనెడు జ్ఞానమ్ము తామసం ♦ బనఁగఁబరఁగు. ౨౨

శ్లో॥ నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్
అఫలప్రేప్సునా కర్మ య త్త త్సాత్త్విక ముచ్యతే.
తే॥ గీ॥ విధిగ నే కర్మ రాగమ్ము ♦ ద్వేష ముడిగి
సంగఫలముల వీడిన ♦ సత్పురుషుని
చేతఁ జేయంగబడునో యా♦శిష్టకర్మ
సాత్త్వికమ్మైనదిగఁ బల్కఁ ♦ జనును బార్థ! ౨౩
శ్లో॥ యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహుళాయాసం త ద్రాజస ముదాహృతమ్.
తే॥ గీ॥ కర్మ మేది ఫలాపేక్ష ♦ గలుగువాని
చేత సాహంకరణభావు ♦ చేతఁగాని
యధిక మైనట్టి శ్రమచేత ♦ నాచరింపఁ
బడునో యది రాజసంబని ♦ పల్కఁబడును. ౨౪
శ్లో॥ అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషమ్
మోహా దారభ్యతే కర్మ త త్తామస ముదాహృతమ్.
తే॥ గీ॥ ఎద్ది రాఁబోవు లాభమ్ము ♦ నెఱుఁగఁబోక
ప్రాణిహింసయు ధననాశ ♦ పౌరుషముల
పరిగణింపకయే మోహ♦పరతఁజేసి
సల్పఁబడు కర్మయే తామ♦సం బటండ్రు. ౨౫
శ్లో॥ ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే.
తే॥ గీ॥ ఫలము సంగమ్ము వర్జించి ♦ పరఁగ సిద్ధి
గలిగినను గల్గకున్న వి♦కారమొంద
కుండి యనహంకృతుఁడు ధృతి♦నూనువాడు
సంతతోత్సాహుఁడౌ కర్త ♦ సాత్త్వికుండు. ౨౬

శ్లో॥ రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః.

తే॥ గీ॥ రాగి కర్మఫలాసక్తిఁ • గోరువాఁడు
లోభి హింసాత్మకుండును • లోన బైల
శుద్ధిలేనట్టిఁడును హర్ష•శోకయుక్తుఁ
డైన కర్తయె రాజసుం • డనఁగఁ బడును. ౨౭

శ్లో॥ అయుక్తః ప్రాకృతః స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలసః
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే.

తే॥ గీ॥ పామరుఁ డయుక్తుఁడును స్తబ్ధ•భావనుండు
నలసుఁడు శఠుండు వంచకుఁ • డతివిషాది
దీర్ఘసూత్రియు నైన త•ద్దేహధారి
తామసుండగు కర్తగాఁ • దలఁపఁబడును. ౨౮

శ్లో॥ బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ.

తే॥ గీ॥ ఓ ధనంజయ! విను బుద్ధి•యొక్కయు ధృతి
యొక్క భేదంబు త్రివిధమై • యుండు గుణవి
శేషములఁజేసి యవియు న•శేషముగ వి
వేకమునఁ జెప్పబడియెడి • విశదరీతి. ౨౯

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ కార్యాకార్యే భయాభయే
బన్ధం మోక్షంచ యా వేత్తి బుద్ధి స్సా పార్థ! సాత్త్వికీ.

తే॥ గీ॥ అర్జునా! విను మేది భ•యాఽభయముల;
కార్యము నకార్యమును; బంధ•కారణమును
మోక్షమును; బ్రవృత్తిని నివృత్తి • నెఱిఁగి నెఱుంగు
నట్టి బుద్ధిని సాత్త్వికం•బని తలంచు.

శ్లో॥ యయా ధర్మ మధర్మం చ కార్యం చాకార్య మేవ చ,
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ! రాజసీ.

తే॥ గీ॥ కవ్వడీ! కార్య మనియు న॰కార్యమనియు
ధర్మమనియును మఱియు న॰ధర్మమనియు
నిర్ణయమునకు విపరీత ॰ నియతి నెంచు
నట్టిబుద్ధిని రాజసం॰బని యెఱుంగు. ౩౧

శ్లో॥ అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా,
సర్వార్థా న్విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ! తామసీ.

తే॥ గీ॥ పార్థ! యెయ్యది యజ్ఞాన ॰ పరివృతమయి
తలఁచుచుండు నధర్మమ్ము ॰ ధర్మమనియు
నర్థసంపత్తి నెల్ల న॰నర్థములుగ
నట్టిబుద్ధిని తామసం॰బని యెఱుంగు. ౩౨

శ్లో॥ ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేన్ద్రియక్రియాః
యోగేనాఽవ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్త్వికీ.

తే॥ గీ॥ పరుగిడని యే ధృతిని మనః॰ప్రాణములయు
నింద్రియంబుల వ్యాపార॰మెల్ల యోగ
నిరతిమై ధరియించియుఁ ॰ బరఁగుచుండు
నట్టిధృతి సాత్త్వికంబని ॰ యాదరించు. ౩౩

శ్లో॥ యయా తు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున,
ప్రసంగేన ఫలాకాఙ్క్షీ ధృతి స్సా పార్థ! రాజసీ.

తే॥ గీ॥ ఏ ధృతి ఫలాభికాంక్షియై ॰ యెసఁగువాఁడు
వరుస ధర్మాదులను జేయు ॰ వాంఛచేతఁ
ద త్త్రివర్గంబు నెప్పుడు ॰తా ధరించు
నట్టిదగు ధృతి రాజసం॰ బనఁగ నొప్పు. ౩౪

శ్లో॥ యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ,
న విముఞ్చతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ.
తే॥ గీ॥ పార్థ ! దుర్బుద్ధిఁగల్గిన • వాఁడు నిద్ర
భయము మత్తత శోకమ్ము • బహువిషాద
ములను నెద్దానిచే వీడఁ•బోవఁ డట్టి
ధృతినిఁ దామస మంచునుఁ • దెలియవలయు. 35
శ్లో॥ సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ,
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖా న్తం చ నిగచ్ఛతి.
తే॥ గీ॥ పార్థ ! యెయ్యెడ నెవఁ డల•వాటుచేతఁ
గ్రీడసేయుచు దుఃఖంబు • గెంటివేయు
నట్టి సుఖమును త్రివిధంబు • నగుచునుండు
విను మిపుడు వాని నా చేత • విశదముగను. 36
శ్లో॥ యత్త దగ్రే విష మివ పరిణామేఽమృతోపమమ్,
త త్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్.
తే॥ గీ॥ తొలుత నెయ్యది విషముగాఁ • దోచుచుండి
వరుసఁ బరిణామమున సుధో•పమము నగుచు
స్వాత్మబుద్ధి ప్రసాదమ్ము • వలనఁ గలుగు
తత్సుఖము సాత్త్వికంబని • తలఁప దగును. 37
శ్లో॥ విషయేన్ద్రియసంయోగా ద్య త్తదగ్రేఽమృతోపమమ్,
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్.
తే॥ గీ॥ ఆదియందున నమృత తు•ల్యంబు నగుచు
మార్పుఁజెందుట విషముతో • మాద్రిఁదగుచు
సకల విషయేంద్రియమ్ముల • సంగమునను
గనుపడు సుఖంబు రాజసం•బనఁగ నొప్పు. 38

శ్లో॥ యదగ్రే చానుబన్ధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్యప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్.

తే॥ గీ॥ ఆదియందును బరిణామ•మందుఁ గూడ
ఆత్మమోహన కరమయి • యలరుచుండి
మాంద్యనిద్రాప్రమాద సం•భ్రమమునైన
తత్సుఖము తామసంబని • తలఁపఁదగును. ౩౯

శ్లో॥ న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
స త్త్వం ప్రకృతిజై ర్ముక్తం యదేభి స్స్యా త్త్రిభి ర్గుణైః.

తే॥ గీ॥ ప్రకృతినుండియుఁ బుట్టు స•త్త్వంబు మొదలు
మూఁడుగుణముల చేతను • వీడఁబడిన
సత్త్వ మిా లోకమున యందు • స్వర్గమందు
దేవతల యందు లేదని • తెలియవలయు. ౪౦

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః

తే॥ గీ॥ పగఱఁదపియింపఁ జేయంగఁ • దగిన పార్థ!
ప్రకృతివలన జనించిన • వరగుణముల
బట్టి బ్రాహ్మణ క్షత్రియ • వైశ్యశూద్ర
వర్ణముల కర్మ భేదముల్ • వరుస వినుము. ౪౧

శ్లో॥ శమో దమ స్తప శ్శౌచం క్షా న్తి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్

తే॥ గీ॥ శమము దమము తపంబు నార్జ•వము క్షమయు
జ్ఞాన మాస్తిక్య శౌచవి•జ్ఞానములును
బ్రాహ్మణున కుండఁ దగిన స్వ•భావజనిత
మైన కర్మ యటంచు నీ•యాత్మ నెఱుఁగు. ౪౨

శ్లో॥ శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్
దాన మీశ్వరభావ శ్చ క్షాత్త్రం కర్మ స్వభావజమ్.
తే॥ గీ॥ శౌర్యమును తేజమును నేర్పు ♦ ధైర్యగుణము
యుద్ధమున యందు వెన్నియ♦కుండుటయును
దాన మీశ్వరభావమ్ము ♦ ధరణిపతుల
కర్మలు స్వభావజమ్ములై ♦ క్రాలుచుండు. ౪౩

శ్లో॥ కృషిగోరక్షవాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్.
తే॥ గీ॥ నిత్యగోరక్షణమ్ము వా♦ణిజ్యము, కృషి
క్షితిని వైశ్యులకు స్వభావ ♦ సిద్ధము లివి;
ఆత్మభావముతో సేవ♦నాచరించు
టవరజన్మలకు స్వభావ♦మైన గుణము. ౪౪

శ్లో॥ స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు.
తే॥ గీ॥ మహి స్వకర్మల సక్తుడౌ♦మానవుండు
చిత్తసంశుద్ధి యెంతయుఁ ♦ జెందగలడు
నాత్మకర్మను సక్తుఁడై ♦ నట్టివాఁడు
సిద్ధి యెట్లొందునో విను♦ చెప్పువాఁడ. ౪౫

శ్లో॥ యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతమ్
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః.
తే॥ గీ॥ ఎల్లభూతమ్ముల ప్రవృత్తి ♦ యే పరేశు
వలన జరుగునో యే యాత్మ♦వలన భువన
మంత వ్యాపింపఁబడెనో యా ♦ యాత్మను నిజ
కర్మ బూజించి సిద్ధినిఁ ♦ గాంచు నరుఁడు. ౪౬

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్.

తే॥ గీ॥ చక్కఁగాను నొనర్పంగఁ ♦ జాలిన పర
ధర్మమునకంటె, విగుణస్వ♦ధర్మము త్త
మము స్వభావమౌ నియతక♦ర్మముల నాచ
రించు నాతఁడు పాపమ్ముఁ ♦ గాంచఁబోఁడు. ౪౭

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః.

తే॥ గీ॥ ఓయి కుంతీసుతా! దోష♦యుక్తము లయి
యున్న నిజకర్మలను వీడి ♦ యుండఁదగదు
ధూమ మగ్నిఁ గప్పినయట్లు ♦ దోషములను
గప్పియుండె సర్వారంభ ♦ గణము నట్లె. ౪౮

శ్లో॥ అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి.

తే॥ గీ॥ దారపుత్రాదులం దస♦క్తమగు బుద్ధి;
నిర్జితాత్ముండు నన్నింట ♦ నిస్పృహుండు
సకల మైనట్టి కర్మల ♦ సన్న్యసించి
పరమనైష్కర్మ్యసిద్ధినిఁ ♦ బడయగలఁడు. ౪౯

శ్లో॥ సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా.

తే॥ గీ॥ కర్మసిద్ధినిఁ జెందంగ ♦ గలుగువాఁడు
నేవిధమ్మున బ్రహ్మమ్ము ♦ నెనయఁగలఁడొ
జ్ఞాన పరనిష్ఠ యేదియో ♦ దానిఁగూర్చి
నా వలన సంగ్రహముగ వి♦నంగదయ్య! ౫౦

శ్లో॥ బుద్ధ్యా విశుద్ధయా ధృత్యాఽత్మానం నియమ్య చ,
శబ్దాదీ౯ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ.

తే॥ గీ॥ ఒగిని బరిశుద్ధ బుద్ధి సం◆యుక్తుఁడగుచు
ధృతిని గార్యకరణముల ◆ దెగడివైచి
పరికట శబ్దాది విషయముల్ ◆ వదలివేసి
రాగమును ద్వేష మవల దూ◆రముగఁ ద్రోసి. ౫౧

శ్లో॥ వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః.

తే॥ గీ॥ శుద్ధవిజన ప్రదేశమ్ముఁ ◆ జొచ్చియుండి
మితముగాఁ దిని; వాక్కును ◆ మేను మనము
నియమముగఁ జేసి ధ్యాన స◆న్నిష్ఠుఁడగుచు;
నిత్యవైరాగ్యయుక్తుఁడై ◆ నివ్వటిల్లి. ౫౨

శ్లో॥ అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే.

తే॥ గీ॥ కామబల దర్పములు నహం◆కార మవలఁ
గ్రోధము మమత్వమును పుచ్చు◆కొంట వీడి
శాంతమున నుండు నాతండు ◆ సంతతంబు
బ్రహ్మమును జెందఁదగు నట్టి◆వాఁడు నగును. ౫౩

శ్లో॥ బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాఙ్క్షతి
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్.

తే॥ గీ॥ అట్లు బ్రహ్మభూతుడు ప్రస◆న్నాత్ముఁడగుచు
గోఁడు సెందఁడు; దేనినిఁ ◆ గోరఁబోఁడు;
భూతముల నన్నిటి సమాన◆ముగను గాంచు;
పరమమగు నాదు భక్తినిఁ ◆ బడయఁగలఁడు. ౫౪

శ్లో. భక్త్యా మా మభిజానాతి యావాన్ య శ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశ తే తదనన్తరమ్.

తే॥ గీ॥ బత్తిచేతను నేను నెవ్వాడనో కో
యెంతవాడనో నిజముగ • నెఱుఁగఁజూచి
నన్ను నిక్కముగ నెఱింగి • యున్న వాఁడు
అంత నాయందుఁ గలసి తా నలరుచుండు. ౫౫

శ్లో॥ సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్.

తే॥ గీ॥ ఈశ్వరుఁడ నగు నన్నె యు • త్కృష్టమైన
యాశ్రయముగాఁ గలిగి కర్మ • లన్ని జేయు
చున్న మదనుగ్రహమ్మున • నొందఁగలఁడు
నవ్యయము శాశ్వతంబైన • యట్టి పదము. ౫౬

శ్లో॥ చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ.

తే॥ గీ॥ స్థిరమతిని సర్వకర్మలు • చేర్చి నాకు
గడఁక నా యందు నాసక్తిఁ • గలిగియుండి
బుద్ధియోగంబునం జేసి • పూని నీవు
సంతతము మది నాయందుఁ • జక్క నిలుపు. ౫౭

శ్లో॥ మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథ చే త్త్వ మహఙ్కారా న్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి.

తే॥ గీ॥ నాయెడ సమర్పితంబౌ మ • నస్సు గలిగి
నా కృపను దుఃఖము తరింతు • గాక యెపుడు
నిక్కముగ నేను నుడివిన • దొక్క వేళ
వినవయేని యహంకార • మునను జెడుదు. ౫౮

శ్లో॥ యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి.
తే॥ గీ॥ ఏ యహంకారమును బూని ♦ యీ సమరము
సేయనందువొ యా వ్యవ♦సాయ మెల్ల
వ్యర్థమై పోవు సుమ్మ యా♦పైని నీదు
ప్రకృతియే పురికొల్పు నె♦ప్పటికి నిజము. ౫౯

శ్లో॥ స్వభావజేన కౌన్తేయ! నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్య స్యవశోఽపి తత్.
తే॥ గీ॥ ప్రకృతిజం బగు నీదు క♦ర్మమునఁ జేసి
కట్టబడినట్టివాఁడవై ♦ కడక దేనిఁ
జేయుటకుఁ గోరకుంటివో ♦ చేరి దాని
మోహమున నవశుండవై ♦ పూనఁగలవు. ౬౦

శ్లో॥ ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున! తిష్ఠతి
భ్రామయ న్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా.
తే॥ గీ॥ అర్జునా! భూతజాలమ్ము ♦ సంతతము దన
మాయ నారూఢ యంత్రముల్ ♦ మాదిరిగాగ
చలన మొందంగఁ జేయు చీ♦శ్వరుడు సర్వ
భూతహృద్దేశములయందుఁ ♦ బూనియుండు. ౬౧

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదా త్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.
తే॥ గీ॥ పార్థ! విను నీవు సర్వభా♦వములచేత
భూతహృదయస్థు శరణంబుఁ ♦ బొందు మతని
నిరుపమప్రసాదమ్మునఁ ♦ బరమశాంతి

శాశ్వతస్థానమును జెందఁ ♦ జాలు దీవు. ౬౨

శ్లో॥ ఇతి తే జ్ఞాన మాఖ్యాతం గుహ్యా ద్గుహ్యాతరం మయా
విమృ శ్యైత ద శేషేణ య థేచ్ఛసి తథా కురు.
తే॥ గీ॥ తడయ కిటు నీకు నెక్కుడు ♦ దాచఁదగిన
జ్ఞానమంతయుఁ జెప్పితిఁ ♦ జక్కగాను
నిద్దియెల్ల విమర్శించి ♦ యేది మేలో
దాని నీ తోఁచినట్లుగాఁ ♦ దగ నొనర్పు. ౬౩

శ్లో॥ సర్వగుహ్యాతమం భూయ శ్శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్.
తే॥ గీ॥ అఖిల గుహ్యాతమంబయి ♦ యలరు నాదు
పరమవాక్యము వినుమయ్య ♦ తిరిగి నీవు
దృఢముగా నాకు నిష్టుండ ♦ వీవ యగుట
హితమయిన దాని నీ కొఱ♦కే వచింతు. ౬౪

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే.
తే॥ గీ॥ నాయెడ మనస్సు నుంచుము ♦ నను యజించు
నావలన భక్తుఁడవు గమ్ము ♦ నాకు మ్రొక్కు;
మిటుల జేసిన నన్నె నీ♦వెనయఁగలవు
శపథ మొనరింతు ప్రియుఁడౌట ♦ సత్యముగను. ౬౫

శ్లో॥ సర్వధర్మా న్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః
తే॥ గీ॥ సకలమైనట్టి ధర్మముల్ ♦ సన్న్యసించి
నన్ను నొక్కనినే శర♦ణంబు నొందు;
నే నఖిల పాపములనుండి ♦ నిన్ను మోక్షు
మంద్రఁ జేతు; విచారమ్ము ♦ నందవలదు. ౬౬

శ్లో॥ ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
న చాశుశ్రూషవే వాచ్యం నచ మాం యోఽభ్యసూయతి.

తే॥ గీ॥ భక్తిహీనుని కొఱకు కత♦పస్కు కొఱకు
గురుని శుశ్రూష సేయని ♦ కుమతి కొఱకు
సన్నసూయను గనెడు మా♦నవుని కొఱకుఁ
బలుకబోకు మొకప్డు గీ♦తలను బార్థ. ౬౭

శ్లో॥ య ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మా మేవై ష్య త్యసంశయః

తే॥ గీ॥ ఈ పరమ గుహ్య మగు గీత ♦ నెవ్వఁడేని
నాదుభక్తులకును బోధఁ ♦ బాదుకొల్పు
నేని యవ్వాఁడు నా యందు ♦ హెచ్చు భక్తి
నుంచి ననుఁ జెందు సంశయం♦బొాదవ దింత. ౬౮

శ్లో॥ న చ తస్మా న్మనుష్యేషు కశ్చి న్మే ప్రియకృత్తమః
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి.

తే॥ గీ॥ కాన నాతనికంటె జ♦గంబునఁ గల
ప్రజలలో మేలొనర్చెడు ♦ వాఁడు లేఁడు
వాని కంటెను బ్రియతరుం♦డైన వాఁడు
మేలయిన వాఁడు భువిలోన ♦ మించి లేఁడు. ౬౯

శ్లో॥ అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనాఽహ మిష్ట స్స్యా మితి మే మతిః.

తే॥ గీ॥ భక్తి నెవ్వఁడు ధర్మసం♦యుక్తమైన
మనకు నిర్వురకైన ♦ సంవాద పఠన
పలుకునో, వాని జ్ఞానయ♦జ్ఞమున నేను
పూజఁ బడసినవాఁడుగా ♦ భువినిఁ దలఁతు. ౭౦

## ఫలశ్రుతిః.

శ్లో॥ శ్రద్ధావా ననసూయ శ్చ శృణుయా దపి యో నరః
సోఽపి ముక్త శ్శుభా ల్లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణామ్.

తే॥ గీ॥ ఏఁడు ననసూయతో శ్రద్ధ • తోడ వినునొ
వాఁడు సర్వాఘములచేత • వదలఁబడిన
వాఁడు పుణ్యకర్మలఁ జేయు • వారి భవ్య
లోకములకును జనఁజాలు • లోకవంద్య! ౭౧

శ్లో॥ కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనఞ్జయ.

తే॥ గీ॥ ఓ ధనంజయ? పార్థ! నా • బోధ నెల్ల
సావధాన మనస్కుండ • వగుచు నాల
కించితి వటయ్య? యజ్ఞాన • సంచయమునఁ
జనిత మగు మోహ మెల్లను • జారెనయ్య. ౭౨

అర్జున ఉవాచ :—

శ్లో॥ నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత
స్థితోఽస్మి గతసన్దేహః కరిష్యే వచనం తవ.

తే॥ గీ॥ అచ్యుతా! నాదయిన మోహ • మంత యడఁగె;
స్మృతిగలిగె నాకు నీదగు • కృపను; నన్ని
సంశయంబులు నశియించి • స్థాయి గలిగె;
నీవు చెప్పిన వచనంబు • నే నొనర్తు. 23

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌషి మద్భుతం రోమహర్షణమ్.

తే॥ గీ॥ ఈ విధమున మహాత్ముఁడై ◆ యెసఁగు వాసు
దేవునకుఁ బార్థునకుఁ బ్రవ◆ర్తించ నైన
యద్భుతము రోమహర్షణ ◆ మై తనర్చు
నట్టి సంవాదమును వింటి ◆ నలరఁగంటి. ౭౪

శ్లో॥ వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నిమం గుహ్యతమం పరమ్
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయత
స్స్వయమ్.

తే॥ గీ॥ వ్యాసభగవానుని యనుగ్ర◆హమున నాదు
నెదుటఁ బల్కెడు యోగేశు ◆ కృష్ణువలనఁ
బరమగుహ్యతమపు యోగ◆సరణి నేను
స్వయముగా నాలకించిన ◆ వాఁడ నైతి. ౭౫

శ్లో॥ రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః.

తే॥ గీ॥ అబ్బురంబుఁ బవిత్రంబు ◆ నైనయట్టి
యచ్యుతార్జున సంవాద ◆ మాత్మయందుఁ
దలఁచి తలఁచియు నా లోన ◆ [illegible]

నధిప! పలుమారు లానంద ◆ మందినాఁడ. ౭౬

శ్లో॥ తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహా౯ రాజన్! హృష్యామి చ పునః పునః.
తే॥ గీ॥ ఓ మహారాజ! మిక్కిలి • యొప్పిదమయి
వింతఁగలిగించు శ్రీహరి• విశ్వరూప
మును స్మరించి స్మరించి య•ద్భుత రసాబ్ధిఁ
దేలి పలుమారు ముదమున • గ్రాలుచుంటి. ౭౭
శ్లో॥ యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ.
తే॥ గీ॥ ఎందు యోగేశ్వరుండైన • కృష్ణుఁడుండు
నెందు ధన్వియౌ పార్థుండు • నెసఁగుచుండు
నందు లక్ష్మి జయము, నీతి • యవ్విభూతి
నిల్కడగ నుండు నంచు నెం• తేఁదలంతు. ౭౮

ఇది యష్టాదశాధ్యాయము

ఓమ్ తత్సత్.



# గద్య రూప పద్యము



శ్రీమ దలమేలు మంగాభి • రామమూర్తి
సుకవి, కౌండిన్య గోత్రుండు • శుభ్రకీర్తి
అబ్బరాజాన్వవాయామృ • తాబ్ధిచంద్రుఁ
డైన శేషాచలవరాఖ్యు • నాత్మపుత్రుఁ
డైన హనుమంతరాయ శ • ర్మాభిధేయుఁ
డాంధ్రమున భగవద్గీత • లలర వ్రాసె.

తే॥ గీ॥ పరగ ముప్పది, నాల్గు, ము • ప్పదియునాల్గు (30-4-1934)
నైన యాంగ్లాబ్దతుల్య భా • వాబ్దమందు
నధిక వైశాఖ బహుళ, పా • డ్యమి మృగాంక
వాసరంబున గీతల • వ్రాఁత ముగిసె.



# శ్రీ హనుమద్గ్రంథమండలివారి గ్రంథములు

1. మాఘమాహాత్మ్యము—ఇది మా తండ్రిగారిచేత మృదుమధురశైలితో వ్రాయఁబడిన పద్యకావ్యము
   సాదా 2- 0-0
   ఫెదర్వైటు బౌండుప్రతి 3- 0-0
2. ఆదినారాయణ శతకము—భక్తిరసప్రధానము 0- 1-0
3. శ్రీ హనుమద్భగవద్గీత-ఇది మాచే సులభశైలితో వివరణ విశేషార్థసహితముగ వ్రాయనైనది. సాదా 1- 0-0
   క్యాలికో 1- 8-0
4. శ్రీ నందిరాజ లక్ష్మీనారాయణదీక్షిత చరిత్ర-ఇది యొక మతవిషయగ్రంథము. వర్ణాశ్రమధర్మములం దెల్పును సాదా 1- 0-0
   ఫెదర్వైటు క్యాలికో 2- 0-0
5. అచ్చాంధ్రనిరోష్ఠ్య నిర్గద్య దాశరథి చరిత్ర. 1- 0-0
6. శ్రీ సుగ్రీవ పట్టాభిషేకము- 5 ఆశ్వాసముల పద్యకావ్యము. నవరసభరితము. ఇరువదిరెండు వర్ణనలు గలది 1- 0-0
7. నారాయణుఁడు-దశావతారకథలు, వచనము 0- 5-0
8. నీతికథానిధి - నీతికథలు ,, 0- 5-0
9. పార్వతీ పరిణయము-నాటకము అతిమనోహరమైన శైలితో నా కుమారునిచేత వ్రాయబడినది 0-12-0

(1942 - 43 సం॥ విద్వాన్ విద్యార్థులకు పఠనీయమైన గ్రంథము)

1. వలయువారు:___ కవిశేఖర

అ. హనుమంతరాయశర్మ,

రిటైర్డు హైస్కూలు పండితుఁడు.

శ్రీ చిదానందసరస్వతీ మందిరము, నెం 20/188 రు. చెట్లవీధి,

గవర్నరుపేట, బెజవాడ, కృష్ణాడిస్ట్రిక్టు.

2. వాణీనికేతనము

గాంధినగరము, బెజవాడ.

## శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవిగారి గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1 | లక్షణా పరిణయము | ప్రబంధము | 0-12-0 |
| 2 | అంబరీష విజయము | ,, | 0-12-0 |
| 3 | రామకథా మంజరి | వచనము | 1- 0-0 |
| 4 | మంగళాద్రి నరసింహశతకము | ,, | 2- 0-0 |
| 5 | రాజరాజేశ్వరి | ,, | 0- 2-0 |
| 6 | తరుణీ | ,, | 0- 2-0 |
| 7 | సోదరి (కల్పితకథ, పద్యములు) | ,, | 0- 2-0 |
| 8 | గోవిలాసము | ,, | 0- 1-0 |
| 9 | గాంధిపాటలు | ,, | 0- 3-0 |
| 10 | సీతారాముల పాటలు | ,, | 0- 8-0 |

వలయువారు :

గుడిపూడి రామారావుగారు,
గాంధినగరము, బెజవాడ.

## బ్రహ్మశ్రీ కల్లూరు వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారి గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1 | భాగవత మాహాత్మ్యము | ... | 0-8-0 |
| 2 | కవికల్పలత | ... | 2-4-0 |

కే. వి. యస్. దీక్షితులుగారు, పండితుఁడు,
మ్యునిసిపల్ హైస్కూలు, బెజవాడ.

## బ్రహ్మశ్రీ చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారి గ్రంథములు

| | | |
|---|---|---|
| శుద్ధాంధ్ర ఋతుసంహారము (కాళిదాసకృతి కనువాదము) | | 0-8-0 |
| ఆంధ్రబాల రామాయణము | ... | 0-4-0 |
| ఆంధ్రస్తోత్ర మణిత్రయి | ... | 0-2-0 |
| శ్రీ సీతా[illegible] | ... | 0 2-0 |



చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారు,

